# గుర్తుంచుకోండి, పోషణపరంగా సమతూకమైన ఆహారం తినిపించకపోతే, మీ పాపాయికి తగినంతగా బరువు పెరిగేందుకు అవసరమైన ప్రోటీన్‌లు లభించవు.

## "అందుకే నేను మా పాపకు సెరిలాక్ యిస్తాను."

మీ డాక్టర్‌ని అడగండి. ఆయన మీకు రెండు ముఖ్యమైన విషయాలు చెబుతారు. ఒకటి, ప్రొటీన్‌లు మీ పాపాయి కండరాలు, శరీర కణాలు పెరగడంలోను, రక్తం ఏర్పడటంలోను తోడ్పడతాయన్నది. రెండవది, సరయిన ప్రొటీన్‌లు లభించాలంటే మీ పాపాయికి ప్రతిసారి ఆహారం యిచ్చినప్పుడు పోషణ రీత్యా సమతూకమైన ఆహారం అవసరమన్నది. ఇటు వంటి ఆహారం ప్రతి రోజూ తినిపించాలి. చాలా మంది తల్లులకు సంప్రదాయమైన ఆహారంతో యీ పని సాధ్యం కాక పోవచ్చు.

దీనికి పరిష్కారం ?

సెరిలాక్. ఎందుచేతనంటే ప్రొటీన్‌లు పుష్కలంగా గల రెండు ఆహార పదార్థాలు పాలు, గోధుమ సెరిలాక్‌లో ఉన్నాయి. ఇందులో కార్బొహైడ్రేట్లు (పిండి పదార్థాలు) కొవ్వు పదార్థాలు, విటమిన్లూ, ఖనిజాలు, ఇనుము, కేల్షియం సరైన పాళ్ళల్లో ఉన్నాయి. ఇది మీ పాపాయికి 4వ నెల నుంచి, అంటే పాలు ఒక్కటే సరిపోని వయసు నుంచి, తినిపించేందుకు ఘన రూపంలోని సమతూకమైన పోషకాహారం. అదీకాకుండా, సెరిలాక్ చాలా రుచిగా ఉంటుంది. పిల్లలకు అది చాలా యిష్టమైనది.

అందుచేత పోషణ రూపేణా సమతూకమైన సెరిలాక్ వల్ల ఉండే లాభాలన్నింటిని మీ పాపాయికి అందించండి. పాపాయికి 6 నెలల వయసు వచ్చినప్పటి నుంచి, వీట్-ఆపిల్ వీట్-ఆరెంజ్, వీట్-వెజిటబుల్ యొక్క అదనపు లాభాన్ని కూడా సమకూర్చండి.

ప్యాక్ మీద యివ్వబడిన సూచనలను దయచేసి పాటించండి.

---

**ఉచితం** సెరిలాక్ బేబీ కేర్ బుక్

వ్రాయండి : సెరిలాక్, పోస్టుబ్యాగ్ నం. 21, న్యూ ఢిల్లీ-110 029

---

నెస్లె వారి నాణ్యమైన ఉత్పాదన




**మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం.**

**IDEAL**
**K·I·T·C·H·E·N**

"నా కుటుంబంతో నేను ఎక్కువ సమయాన్ని గడుపుకొన ఒక అవకాశాన్ని సృష్టించిన కాళికి నా కృతజ్ఞతలు."



ఎందువల్లనంటే
కాళితో వంట
త్వరితంగా పూర్తికాగలదు
మరియు ఆహారాన్ని
పౌష్ఠికంగా వుంచనూగలదు.

# కాళి

## కాపర్ - బాటమ్
## స్టెయిన్‌లెస్ స్టీల్ కుక్‌వేర్

ఆమె చుట్టూతా ఎన్నెన్నో అతిశయాలు సంభవించుతూన్నాయి... ఒక నాగరిక గృహిణి వానిలో పాలుపంచుకోవాలని ఉవ్విళ్ళూరటం సమంజసమేగదా!
మరి వంట విషయం ఏమిటి? ఆమె విస్మరించలేదు, తన శక్తి సామర్థ్యాల గురించి మరియు తనకు ఎంతో సమయాన్ని ఆదాచేయు కాళి కాపర్-బాటమ్ స్టెయిన్‌లెస్ స్టీల్ కుక్‌వేర్‌ను ఎన్నుకోగలిగినందుకు ఆమె ఎంతో గర్వించుతోంది.
కాళికి ఇవన్నీ కలవని ఆమెకు తెలును:

- **ఐఎస్ఐ చిహ్నాన్ని కలిగివున్న ఒకే ఒక కుక్‌వేర్.**
- **ఉత్పత్తుల నాణ్యతా చిహ్నంగా భారత ప్రభుత్వపు జాతీయ బహుమతిని గెలుపొందింది.**
- **విశిష్టమైన నాణ్యతగల ఏఐఎస్ఐ 304 (18/8) సేలం స్టెయిన్‌లెస్ స్టీల్‌తో తయారు చేయబడుతోంది.**

పానేలు, కడాయిలూ, తావాలూ, స్కిల్లెట్లు, టాప్‌లు, ఆవిరి కుక్కర్లు (పెటిట్ 200) కిచెన్ కాంప్యాక్ట్ వగైరా.




kali kali IS 4536 ISI

**కాళి**

నిక్షేపంగా సమకూర్చుకోగల అనువైన పాత్రసామగ్రి



అమ్మకంచేయు ఏజెంట్లు: శ్రీ విద్యా ఏజెన్సీస్, కుంభేశ్వరర్ సన్నిధి, కుంభకోణం 612 001, ఫోన్: 20136 ● చిల్లర వ్యాపారపు షోరూము: శ్రీ ఎం.వి.ఎం. స్టోర్సు, కుంభేశ్వరర్ సన్నిధి, కుంభకోణం 612 001, ఫోను: 20136 ● ప్రాంతీయ ఏజెంట్లు: సమ్ము & కో,. పో.బా. నం. 3622, ఎం.జి. రోడ్డు, ఎర్నాకుళం, కొచ్చిన్ 682 035, ఫోన్: 361139 ● విక్టరీ మెటల్స్, 101, ఖెత్‌వాడి మెయిన్ రోడ్డు, బొంబాయి 400 004, ఫోను: 354507/380075 ● దినేష్ ఎంటర్‌ప్రైసెస్, 302, బ్లాక్ - 22 జి, సెక్టార్-7, రోహిణి, ఢిల్లీ 110 085, ఫోను: 7276879 ● కౌశిక్ ఏజెన్సీస్, 3, పాలిత్ స్ట్రీట్, కలకత్తా 700 019, ఫోను: 750544

Imageads 3108 Tel

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

* కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

---------- కూపన్ ----------

జనవరి 'చతుర' నవల 'వసుంధర'

సమీక్షకుని పేరు: ..........................................

చిరునామా: ..........................................

..........................................

..........................................

..........................................

# "మండుతున్న మేధస్సు"పై చతుర సమీక్షలు

నవంబరు 'చతుర'లో ప్రచురితమైన సత్యవోలు సుందరశాయి నవల 'మండుతున్న మేధస్సు'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము.

## సమాజ సంఘర్షణల నిలువుటద్దం

*(ప్రథమబహుమతి రు.100/- పొందిన సమీక్ష)*

**నేటి** సామాజిక వ్యవస్థలో నిరంతరం జరిగే మంచీచెడుల సంఘర్షణలకు నిలువుటద్దం సత్యవోలు సుందరశాయిగారి "మండుతున్న మేధస్సు"! ఒక పోస్ట్‌గ్రాడ్యుయేట్ నిరుద్యోగి రోజూ ఉదయం వార్తాపత్రికలలో ఉద్యోగప్రకటనలనే ప్రధానంగా చూడడం, ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజిలో అటెండర్ విదిలిస్తూ మాట్లాడినా ఎంతో ఓపికపట్టి సహించడం, "నా ఎం.ఎ. డిగ్రీని మరిచిపోండి, ఈ ఉద్యోగం నాకు ఇవ్వండి, నాకు చదువు ఎక్కువగా ఉందని ఈ ఉద్యోగం ఇవ్వడం మానకండి" అని ప్రాధేయపడటం, ఈ దేశంలోని నిరుద్యోగుల ఆవేదనను, నిరుద్యోగ తీవ్రతను కళ్లకు కట్టినట్లు వివరిస్తుంది. అలాగే హోటల్‌లో ఉద్యోగం నుండి తీసివేసిన తర్వాత "మేధస్సుపై జరుగుతున్న హింసాకాండ" గురించి అభిషేక్ వెలుబుచ్చిన అభిప్రాయం నేటి విద్యావ్యవస్థకు, క్షీణించిపోతున్న నేటి విద్యాప్రమాణాలకు ఒక సవాలుగా ఆలోచింపజేస్తుంది.

ఈ నవలను ఒక కోణం నుండి చూస్తే రాయలుతో పరిచయమై అంచెలంచెలుగా ఎదిగిన అభిషేక్ పాత్ర ద్వారా "ఈ జగతిలో మంచితో సాధించలేనిదంటూ ఏదీలేదనే" సూక్తిని రచయిత స్ఫురింపచేసారు. అలాగే మరో కోణం నుండి సామాన్యుల అభివృద్ధిని కాంక్షించని సంపన్నులు వారిని ఎన్నివిధాలుగానైనా హింసకు గురిచేయగలరనే నగ్నసత్యాన్ని 'జగదీష్' పాత్ర ద్వారా స్ఫురింపజేశారు.

అభిషేక్‌లాంటి నిస్వార్థపరులు నేటి సామాజిక, రాజకీయ వాతావరణంలో కొరవడ్డారనేది నిస్సందేహం. జీవితంలో ఎన్నో ఎదురుదెబ్బలు తిన్నా ప్రత్యర్థులపట్ల ప్రతీకారభావంకలగని అభిషేక్ వారిపట్ల చిరునవ్వును ప్రదర్శించినతీరు అద్వితీయం. సగటువ్యక్తి జీవితంలో అందరి ఆదరాభిమానాలు పొందాలంటే శారీరకంగాను, మానసికంగాను ఎన్ని బాధలను, అవమానాలను అనుభవించాలో చూపిన అభిషేక్‌పాత్ర నేటి యువతకు ఆదర్శప్రాయం కావాలి. జి.కె.ఎస్టేట్స్ అధిపతియైన జగదీష్, నిరుద్యోగియైన అభిషేక్‌కు తాను ఉద్యోగం ఇవ్వకపోయినా అంచెలంచెలుగా అభివృద్ధి చెందుతున్నందుకు అతనిపై దాడికి పూనుకోవడం, అతని అల్పమనస్తత్వానికే ప్రతీక. రాజకీయజీవితంలో కూడా అభిషేక్‌లను

కవర్‌పేజీ ఫోటోగ్రాఫర్: జగ్‌మోహన్

అణచివేయాలని ప్రయత్నించే జగదీష్‌లు నేటి సమాజంలో కోకొల్లలు.

అయితే రచయిత సామాన్యులనందరినీ మంచివారుగాను, సంపన్నులనందరినీ చెడ్డ వారుగాను భావించారనిపిస్తోంది. అలాగే కథా నాయకునకు, నాయిక అవసరమనే భావన తోనే "జ్యోత్స్న" పాత్ర కల్పించినట్లుంది. అభి షేక్, జగదీష్‌లనిద్దరినీ మనసులో మననం చేసుకుంటూ ఎవరికి భాగస్వామికావాలో నిర్ణ యించుకోవడంలో జ్యోత్స్న పడేతపన నేటి తరం స్త్రీలలో కానరాదేమో! ఎందుకంటే మంచితనం, ఆదర్శం, నిరాడంబరత్వం క న్నా ఆస్తి, అహం, హోదా, అధికారం ఉన్నవా రిపట్లే నేటితరం హెచ్చుగా ఆకర్షితులవుతు న్నారు. అందువలననే చివరివరకు జగదీష్ మనసును రచయిత మార్చలేకపోయారు కూడా.

నేటి పరిస్థితులను ప్రతిబింబింపచేసిన ఒక మంచినవలను చదివిన అనుభూతిని కల్గించిన రచయిత అభినందనీయులు.

—మొహమ్మద్ రంజాన్ అలి,
విశాఖపట్నం-530 016.

## మేధస్సు ఎందుకు మండుతుంది?

**(ద్వితీయబహుమతి రు.75/- పొందిన సమీక్ష)**

"మండుతున్న మేధస్సు"లో అడుగడుగునా రచయిత సమాజంపట్ల పెంచుకున్న 'కసి' కన్పిస్తుంది. ఎందుకంటే యిది 'దళారుల వ్యవస్థ' 'పైరవీకారుల రాజ్యం' కనుక! అంతేనా? 'భజనపరులు'న్న సమాజంకూడా.

వివిధరంగాల్ని విభిన్న వ్యక్తుల్ని పరిశీ లించి రచయిత వెలువరించిన అభిప్రాయా లు నిజానికి అమూల్యములు. ఈ వ్యవస్థయొ క్క నగ్నరూపాన్ని ఆవిష్కరించే సఫలప్రయ త్నం జరిగిందీ నవలలో.

"భారతదేశంలో ఎవరైనాసరే ముందు ప్ర భుత్వ ఉద్యోగాల్లో దూరడానికి ప్రయత్నిస్తా రు-" నిజమే. చదువుకునేది తనసుతాను తెలుసుకోడానికని మనిషి మరిచిపోయి చాలా కాలమైందిమరి.

"ప్రభుత్వం తరపున ప్రజలకు సేవచేయా ల్సిన వుద్యోగుల్లో ఎక్కువ శాతం పైఅధికార్ల మెప్పుకోసమే వుద్యోగం చేస్తున్నారనడంలో సందేహం అనవసరం "అంటూ ప్రభుత్వోద్యో గులంతా భుజాలు తడుముకొనేలా చేసారు రచయిత. అన్నింటికంటే ముఖ్యంగా గుండె లోతుల్లో గుచ్చుకొనే మాట ఒకటుందీనవలలో. అది- "ఈ దేశంలో ఎవరు మరొకర్ని ఎందుకు ద్వేషిస్తారో చెప్పలేం. మతమని, కులమని, శాఖోపశాఖలని వ్యక్తుల్ని విడివిడిగా విభజించి అనవసరంగా ద్వేషించటం ఆనవాయితీ అయిపోయింది".

అభిషేక్‌పాత్రలో సహజత్వంలోపించి, రచ యిత ఆశించిన లెవల్లో క్లిక్ కాలేదాపాత్ర. జగదీష్ క్యారెక్టర్‌కూడా సరిగా ఎస్టాబ్లిష్ కాలే దు. రాయలు మంత్రి అయి సాధించేదేమీలే దు. జోత్స్నపాత్ర చివరికి హీరోప్రక్కన హీరో యిన్ లేకుంటే ఏం బావుంటుందని సృష్టించి నట్లేవుంది. ఇంక కార్మికసంఘాల కోలాహలం ఒకఫట్నాన పాఠకులకు అంతుబట్టదు. హీరో గారి హీరోయిజాన్ని పెంచిపోషించడానికి చే సిన సర్కస్ ఫీట్లే కార్మికుల గందరగోళం.

ఈ దేశంలో మేధస్సు ఎందుకు మండు తుందో- అసలు కారణం తెలిసికూడా రచ యిత చెప్పలేదేమో అనిపిస్తుంది. అక్కడికీ ధైర్యంచేసి ఒకమాట వ్రాయనే వ్రాసారు. కులం ప్రాతిపదికమీద ఉద్యోగం సంపాదించు కున్నవాడుకూడా నిరుద్యోగ మేధావిని చూసి ఫోజు కొడతాడని! శహభాష్!

—ఎస్.కె.మహబూబ్ కమల్,
బొల్లార్‌గూడెం

## రాజకీయం - రాజనీతి

**(తృతీయ బహుమతి రు.50/- పొందిన సమీక్ష)**

రాజకీయం నేపథ్యంగా సాగిన ఈ నవల సరికొత్తరీతిలో ఉంది, ఏకబిగిని చదివించేలా ఉంది. అహంకారానికీ, సంస్కారానికీ మధ్య జరిగిన పోరాటమే ఈ 'మండుతున్న మేధ స్సు'. రాజకీయమంటేనే అక్రమాలూ అన్యా యాలూ అరాచకాలూ-దుర్మార్గాల నిలయమనే అర్థాన్ని ఆపాదించిన రాజకీయనాయకులకు

ఓ ఆదర్శ రాజకీయనాయకుడెలా ఉండాలో అభిషేక్, రాయలు పాత్రలద్వారా చూపారు రచయిత.

అభిషేక్ రాజకీయ గంజాయివనంలో తులసిమొక్కలా ఎదిగి, తన ఆదర్శ రాజనీతిజ్ఞతతో ప్రజల అభిమానాన్ని చూరగొనేవిధం చదివాక నేటి కుళ్ళు రాజకీయాలతో విసిగి, వేసారి, నిరాశలో ఉన్నవారికి అభిషేక్‌లాంటి నాయకుడు ఏనాటికైనా రావాలని, వస్తాడనీ అనిపిస్తుంది.

ముఖ్యంగా, ఈ నవలలో పాత్రలమధ్య మౌనంగానే సాగిన సంభాషణను వివరించిన తీరూ, ఆ శైలీ బాగుంది.

నిరుద్యోగయువకుల ఆవేదనకు ఆర్తిగా అక్షరరూపం ఇచ్చారు రచయిత.

కానీ, ఎంత రాజకీయపుటెత్తు అని సరిపెట్టుకున్నా ఎం.ఎల్.ఎ. సీటుకోసం రాయలు, అభిషేక్ కలిసి చేసిన ట్రిక్ చాలా చీప్‌గా ఉండటమేకాక, అంతవరకూ పాఠకుల మనసుల్లో ఉన్నతంగా ఎదుగుతూవచ్చిన ఆ రెండు పాత్రలకూ మచ్చతెచ్చింది.

చివర్లో జగదీష్ తన ఫాక్టరీలో పన్జేసే ఓ వృద్ధకార్మికుడిని అనవసరంగా కొట్టటం వెనుక బలమైన కారణంలేక కృతకంగానూ, హాస్యాన్పదంగానూ ఉంది.

ఏదియేమైనా ఈ నవల రాజకీయానికి రాజనీతికీగల తేడా చూపుతూ, రాజకీయాల్లో కూడా ఆదర్శంగా ఉండవచ్చునన్న ఆశాభావాన్ని కలుగజేస్తుంది.

—కె.పద్మలత, నెల్లూరు.

## అసలు విషయం నిరుద్యోగం

*(నాలుగవ బహుమతి రు.25/- పొందిన సమీక్ష)*

స్థూలంగా ఇది రాజకీయనాయకుల కథలా కన్పించినా అంతరాంతరాల్లో 'నిరుద్యోగసమస్య' ఇమిడి ఉంది. అంతకంటే ముఖ్యంగా మంచి-చెడులమధ్య నిత్యం జరుగుతున్న సంఘర్షణను బలమైన సన్నివేశకల్పన ద్వారా చూపించారు. కేవలం మంచిచెడుల సంఘర్షణకు మాత్రమే కాదు, ఒక పేదవాడు, గొప్పవాడిమధ్య జరిగే సంఘర్షణ కూడా చక్కగా చిత్రించబడింది. మనిషిని ఓర్పు, మంచితనం వంటి ఉత్తమగుణాలు ఎంతటి ఉన్నత స్థితికి తీసుకువెళ్తాయో ఆవేశం, కక్ష, కార్పణ్యం వంటివి అంతటి అథఃపాతాళానికి తోసివేస్తాయి. మనుమల్లోని ఈ మంచి-చెడ్డ గుణాలకు ప్రతీకలే అభిషేక్, జగదీష్ పాత్రలు. ఈ నవలలోని పాత్రలను కేవలం సృష్టించలేదు జీవంపోసి సజీవశిల్పాలుగా మలిచారు రచయిత.

ఒక వ్యక్తికి ఉద్యోగం లేకపోతే అతను ఎంత మేధావి అయినా సమాజం దృష్టిలో దద్దమ్మే. అందుకే నిరుద్యోగుల మేధస్సును మండిపోతున్న మేధస్సుగా అభివర్ణించారు రచయిత. అయితే ఉద్యోగవేటలో విసిగివేసారిన అభిషేక్ ఉద్యోగంకోసం రాయలును కొంతకాలం ఆశ్రయించినా తన తెలివితేటలతో అక్కడ నిలదొక్కుకోవడం అభిషేక్‌లోని చొరవకు నిదర్శనం. నిరుద్యోగ సమస్య గురించి అభిషేక్ పాత్రద్వారా రచయిత చేసిన విశ్లేషణ బావుంది. అభిషేక్, జగదీష్ వీరిద్దరూ విభిన్నతత్వాలకు నిదర్శనం. వీరిలో ఎవరు ఉత్తములో తేల్చుకోవడానికి జ్యోత్స్న పాత్రలో చిత్రించిన సంఘర్షణతీరు బావుంది.

ఏమీలేక నిరుద్యోగిగాఉన్న అభిషేక్ తన మేధస్సుతో, మంచితనంతో హోమ్ మినిస్టర్ కాగలిగితే అన్నీ ఉండి జగదీష్ అసహనం, అసూయాద్వేషాలతో పీడించబడుతూ చివరకు జైలుశిక్షకూడా అనుభవిస్తాడు. ఉత్తముడు ఎన్ని కష్టాలనెదుర్కొన్నా చివరకు ఉన్నత పథాన్ని చేరుకుంటాడు అన్న సత్యాన్ని ఈ నవల నొక్కిచెప్తుంది.

ఈ నవలలో కథనశైలి వేగంగా నడిపిస్తుంది. సన్నివేశాలను సృష్టించిన తీరులోనూ, ఒకదానికొకటి ముడిపెట్టడంలోనూ రచయిత ప్రజ్ఞాపాటవాలు వెల్లడి అవుతాయి.

ఈ నవల కేవలం ఒక మంచి నవలేకాదు ఒక ఉత్తమ నవల కూడా.

—ఎ.శ్రీప్రసాదమోహన్, హైదరాబాద్.





## ఆలోచింపచేసే నవల

(అయిదవ బహుమతి రు. 25/- పొందిన సమీక్ష)

ప్రస్తుత సమాజంలో అడుగడుగునా కనిపించే ఎక్స్‌ప్లాయిటేషన్, మేథస్సు మీద జరుగుతున్న హింసాకాండలను ఎలా అధిగమించాలి అన్నది ఇతివృత్తంగా తీసుకుని శ్రీ సాయి అందించిన 'మండుతున్న మేథస్సు' ఒక సజీవస్థితికి సాహితీ రూపకల్పన. మేధావులకు, విద్యావంతులకు నిత్యం ఎదురయ్యే చేదు అనుభవాలు, నైరాశ్యం వంటి అంశాలను అభిషేక్ పాత్ర ద్వారా హృద్యంగా చెప్పారు రచయిత. మేథస్సు హింసాకాండతో అణచివేయబడితే ఈ నిరాశానిస్పృహలే రేపు దావానలంలా జాతిని దహించేస్తాయనే ప్రమాదాన్ని సూచిస్తూరచయిత సూటిగానేహెచ్చరించారు.

నవల ఆద్యంతం అభిషేక్ నిండివున్నాడు. పాత్రలన్నీ ఇతని చుట్టూపరిభ్రమిస్తాయి. మిన్ను విరిగి మీదపడ్డా, సాగరమే ముంచెత్తనున్నా చలించని ఆత్మస్థయిర్యం అభిషేక్‌ది. వైకుంఠపాళీలాంటి జీవితంలో ప్రత్యర్థి అయిన జగదీష్ సృష్టించిన ప్రతి పాము నుండీ తప్పించుకుని తన మేథస్సు అనే నిచ్చెనపై అంచెలంచలుగా ఎదిగి అగ్రస్థానాన్ని అధిరోహించిన అభిషేక్ పాత్ర నేటి వ్యవస్థలో నిరాశా నిస్పృహలతో కుమిలే నిరుద్యోగులకు, విజ్ఞానులకు ఆదర్శమూర్తి కాగలదు. రాజకీయాల రొచ్చులో విచ్చుకుని పరిమళించిన అమలిన కమలం అతడు.

అభిషేక్ నిరుద్యోగులతో బీచ్‌లో జరిపిన చర్చ, యూనివర్సిటీలో అతని ఉపన్యాసం ప్రతి పాఠకుడినీ ఆలోచింపచేస్తుంది.

నిరుద్యోగం, రాజకీయం, శ్రమదోపిడి, అణచివేత, హాస్పిటళ్ళ తీరు, వివిధ రంగాల్లోని అడ్డదార్లు వంటి విషయాల మీద రచయితకు గల అవగాహన ఈ రచనలో నిరూపించబడింది. అక్కడక్కడ జగదీష్ పాత్ర చిత్రీకరణలో కొంచెం అతి అనిపించినా కథాబలం, కథాగమన వేగం ముందు ఇటువంటివి లోపాలుగా అనిపించవు.

రకరకాల పెర్వర్షన్‌లకు లోనవుతూ రచనలు వస్తున్న ఈ రోజుల్లో ఈ నవల ఒక ఆణిముత్యం. దీన్ని పాఠకులకు అందించిన సాయికి ధన్యవాదాలు.

పెండ్యాల సుబ్బారావు హైదరాబాద్

## సమకాలీన వ్యవస్థకు ప్రతిబింబం

(ఆరవ బహుమతి రు. 25/- పొందిన సమీక్ష)

సమకాలీన వ్యవస్థకు అద్దం పట్టిన "మండుతున్న మేధస్సు" అపూర్వమైన నవల. కుళ్ళిపోయిన రాజకీయాలలో రాయలులాంటి మంత్రులు అరుదు. అలాగే అభిషేక్‌లాంటి విద్యాధికుడు, మంచితనం మూర్తీభవించిన నిర్మల హృదయుడు మరీ అరుదు.

రాజకీయపరంగా వచ్చే నవలల్లో ఈ మధ్య అసలు మంచి రచనలు రావటం లేదనే చెప్పాలి. అలాంటి తరుణంలో 'మండుతున్న మేధస్సు' లాంటి మంచి నవలలనాదరించే పాఠకులకు ఎడారిలాంటి సాహితీ జగత్తులో ఒయాసిస్సులా ఈ నవల పాఠక హృదయాలపై చెరగని ముద్రవేసింది.

నేటి వ్యవస్థకు అభిషేక్‌లాంటి వ్యక్తులు చాలా అవసరం అని పరోక్షంగా రచయిత సూచించటం వినూత్న ప్రయోగం. జగదీష్ అహంభావాన్ని చక్కగా వివరించారు.

విద్యార్థులు ఎదుర్కొంటున్న విభిన్న సమస్యలకు రచయిత అభిషేక్ ద్వారా చక్కటి వివరణ ఇచ్చారు. రాజకీయనాయకుడికి, ప్రజలకు మధ్య ఎలాంటి అనుబంధం వుండాలనే విషయంలో అభిషేక్ వివరణ విజ్ఞతతో కూడివుంది.

జ్యోత్స్నలాంటి స్త్రీలు అభిషేక్‌ను అభిమానించటం, ఆరాధించటం తుదకు వివాహమాడటం సంభవమే. అది జగదీష్‌లాంటి స్వార్థపరులకు కనువిప్పు కావాలి. సామాన్య ప్రజల సాధక బాధకాలు, ఆస్తిపరుల మనోవికారాల చిత్రణ బాగుంది. నేటి సమాజానికి ఇది నిజంగా దివ్యమైన ఔషధం

నందం రెడ్డియ్య భట్టిప్రోలు



# చైనా చతుర కథలు

## బతకనేర్చిన సర్పం

వయసుడిగిన ఓ సర్పం ఆహారం వెదుక్కునే ఓపికలేక, బద్ధకంగా ఓ చెట్టు తొర్రలో పడుకుంది.

అంతలో సరదాగా కూనిరాగం తీసుకుంటూ అటుగా వచ్చిన ఒక కప్ప దాన్ని చూసి అదిరిపడింది.

దాని బెదురు గ్రహించిన సర్పం-

"ఏం కప్పమహాశయా... అలాగే నిలబడిపోయారు... రండి దయచేయండి" అంటూ ఆహ్వానించింది.



కప్పగుండెదడ ఇంకా తగ్గలేదు. పిచ్చిచూపులు చూస్తూ నిలుచుండిపోయింది. మెల్లగా దాన్ని మాటల్లోకిదించి ఎలాగైనా తినేయాలని సర్పంగారి ఉద్దేశం.

"ఏం మిత్రమా... అలాగే నిల్చుండిపోయారు, మరేంభయంలేదు... కూర్చోండి. పసిమి పచ్చటి మీ వంటి రంగు చూస్తుంటే బంగారు బొమ్మలా అన్పిస్తున్నారు. ఏమైనా ప్రపంచంలో మీలాంటి అందగాళ్ళు అరుదంటే నమ్మండి" నమ్మబలికింది సర్పం.

ఆ మాటలకి కప్పకి ఎక్కడలేని ఆనందం కలిగింది. వరిసరాల్ని మరిచిపోయి ఠీవిగా రొమ్ము విరుచుకొని నిలబడింది.

"నిజంగా మీ శరీరం మీద ఉన్న ఆ ఆకుపచ్చ మచ్చల్ని చూస్తుంటే వజ్రవైఢూర్యాలేవో మీ చర్మానికి తాపడం చేసినట్లన్పిస్తోంది" మళ్ళీ పొగిడింది పాము.

కప్ప గర్వంగా తన శరీరం వంక చూసుకుందొకసారి.

"అవునూ... అది సరేగానీ నేనో మాట విన్నాను నిజమేనంటావా మిత్రమా?" మెల్లిగా అంది పాము.

ఏమిటన్నట్లు చూసింది కప్ప.

"ఎంత సన్నటి రంధ్రంలోంచైనా మీరు సులభంగా దూరిపోగలరట"

"అవును... అందుకు సందేహమెందుకు?" సంకోచించకుండా అంది కప్ప.

"నేనే దూరలేను, తమరెలా దూరగలరబ్బా?" ఆశ్చర్యం నటిస్తూ అంది పాము.

"నీకు నా శక్తి తెలియదు... తెలిస్తే నువ్విలా అనవు" గర్వంగా అంది కప్ప.

"అయితే అదుగో మీ పక్కనే ఉన్న ఆ చిన్నరంధ్రంలో దూరిచూపించండి... అప్పుడు నమ్ముతాను" అంది పాము రెచ్చగొట్టేధోరణిలో.

"ఓ... అదెంతపని" అంటూ ముందు వెనుకాచూడకుండా ఆ కన్నంలోకి దూరిపోయింది కప్ప.

ఆ కన్నం జానెడు లోతుకూడా లేదనీ, తనలాంటివాళ్ళని ఉబ్బేసి అందులో ప్రవేశపెట్టాక తీరుబడిగా తలదూర్చి ఆ పాము మింగేస్తుందనీ పాపం ఆ కప్పకు తెలియదు.

కాసేపాగి నవ్వుకుంటూ ఆవైపు పాకింది సర్పం.

ఆ పాముకీ- మన రాజకీయనాయకులకీ తేడా ఏముంది? ప్రజలు తెలివితక్కువ కప్పల్లా వాళ్ళు ఆడించినట్లల్లా ఆడి చివరికి బలైపోవడంతప్ప ఏం చేయగలరు?

—షావోహువా





# జ్ఞానోదయం

మాంసం దుకాణంలో దొంగతనం చేయబోయిన ఓ శునకరాజంగారు దురదృష్టవశాత్తూ తన తోకను పోగొట్టుకోవాల్సి వచ్చింది. మొండి తోకని గురించి బంధుమిత్రులు, ఇరుగుపొరుగు కుక్కలు గేలిచేస్తాయని ఊహించి ముందుగానే దానికో కారణాన్ని కల్పించి చెప్పాలని నిర్ణయించుకుందది.

అనుకున్నట్లే మొండితోక విషయం శునక మిత్రులందరిలో సంచలనం సృష్టించింది.

ఏదో అడగబోయిన మిత్రులవంక గంభీరంగా చూసి-

"మిత్రులారా... నా మొండితోక మీ అందరిలో ఎంతో కుతూహలాన్ని రేకెత్తిస్తోందని నాకు బాగా తెలుసు" అంటూ ఉపన్యాసధోరణిలో ప్రారంభించింది శునకరాజు.

తక్కిన కుక్కలన్నీ అది చెప్పే మాటల్ని శ్రద్ధగా ఆలకించసాగాయి.

"...నిజానికి మన ఈ తోకలు అతి నిరర్థకమైనవి. వీటివల్ల ఉపయోగంలేకపోగా రకరకాల అవమానాలకి, అపార్థాలకి కారణభూతం అవుతున్నాయి"

శ్రోతకుక్కలు ఆశ్చర్యంతో చెవులురిక్కించి మరీ వినసాగాయి.

అది గమనించిన శునకరాజం ఉత్సాహంతో మరింత విజృంభించింది.

"...ఉదాహరణకి తోకని స్ప్రింగులా నిలబడేలాపైకి ఉంచుకున్నామంటే జనం మనల్ని పొగరుబోతులమంటారు... పోనీ దాన్ని ముడుచుకుని కాళ్ళమధ్య దాచుకుంటే పిరికిపంద అంటారు. అటూ ఇటూ ఊపామనుకోండి కాకా పడుతున్నా మంటారు... అవునా?"

"అవునవును" కోరస్ పాడాయి కుక్కలు.

"అంతేకాదు... వక్రబుద్ధిగలవాణ్ణి మన తోకతో పోలుస్తారు. అందుకే నొప్పి అయినప్పటికీ అవమానభారం కంటే అదేం ఎక్కువకాదని భావించి నా తోకని నేనే స్వయంగా నరికేసుకున్నాను. ఇప్పుడు నాకు అవమానాలు, అపార్థాల బాధేలేదు. మీరూ కావాలంటే నాలాగే చేయండి. అవమానాలపీడలనుంచి శాశ్వత విముక్తి సంపాదించుకోండి" అని ముగించింది శునకరాజం.

కుక్కలన్నీ ఆలోచనలోపడ్డాయి. శునకరాజం చెప్పినదాంట్లో సత్యంలేకపోలేదనిపించింది వాటికి.

ఇంతలో నల్లమచ్చలకుక్క "మహాశయా... ఈ జ్ఞానోదయం తమకెలాకలిగిందో సెలవిస్తారా?" అని ప్రశ్నించింది. ఊహించని ఈ ప్రశ్నకు ఏం చెప్పాలో తోచలేదు శునకరాజానికి.



"అది అది... నిజంగా... ఊరికే... నాకే ఆ ఆలోచన వచ్చింది" నీళ్ళు నమిలిందది.

"మాంసం దుకాణంలో దొంగతనం చేస్తుంటే కొట్టువాడు విసిరిన కత్తి తగిలి మీ తోక ఊడి పడినపుడే మీకీ జ్ఞానోదయం కలిగిందని నా ఉద్దేశం" వ్యంగ్యంగా మళ్ళీ అంది నల్లమచ్చల కుక్క.

కుక్కలన్నింటికీ విషయం అర్థం అయింది. మొండితోక కుక్కవంక ఎగతాళిగా చూసి నవ్వుకొన్నాయి.

మాంసం దుకాణం వద్ద తన తోక తెగడం నల్లమచ్చల కుక్క చూసిందన్న విషయం అప్పటికిగాని శునకరాజానికి తెలిసిరాలేదు. చేసేదిలేక సిగ్గుతో ఇంటిదారి పట్టింది.

— చెంగ్‌నయాక్సియాంగ్



# ఆత్మవిమర్శ

"నా ప్రవర్తనలో లోటుపాట్లేమైనా ఉంటే చెప్పండి... చక్కదిద్దుకుంటాను" అన్నాడు జీతూ తన కుటుంబీకులతో ఓనాడు.

ఆ మాట అనడమే తడవుగా-

"మార్కెట్‌కు వెళ్ళి సరుకులు తేవడం, వంటపనిలో కాస్త సాయపడుతూ భార్యని సుఖ పెట్టడం బుద్ధిమంతులైన భర్తల లక్షణం" అంది భార్య.



"అన్నం తినేటప్పుడు కంచంచుట్టూ మెతుకులు వృథాగా పడిపోయేలా తింటావేంటి డాడీ? శుభ్రంగా తినడమెలాగో నన్నుచూసి నేర్చుకోరాదూ?" అన్నాడు ఏడేళ్ల పుత్రరత్నం.

"అడ్డదారంటూ రోజూ పెరట్లోంచి నడుస్తుంటే చెట్లపాదులు దెబ్బతింటాయిగదా - కాస్త అలా చుట్టుతిరిగి వెళ్తే నీ సొమ్మేంపోతుంది?" అని నన్నగా చీవాట్లేశాడు తండ్రి.

వెంటనే ఈ విషయాలన్నీ ఒక నోట్‌బుక్‌లో రాసుకొని మర్నాటినుంచీ బుద్ధిగా ప్రవర్తించాలనుకున్నాడు జీతూ.

ఆ సాయంత్రం తన తల్లిగారింటికి వెళ్ళి కొంచెం ఆలస్యంగా ఇల్లు చేరింది జీతూ భార్య. అప్పటికే ఆమెమీద కారాలు మిరియాలూ నూరుతున్న అతను ఒక్కసారిగా తిట్లు లంకించుకున్నాడు.

"దొంగముండా ... ఇంట్లోపని చేసుకోలేవుగానీ పెత్తనాలు కావాల్సివచ్చాయా పెత్తనాలు? వంటపని, ఇంటిపని మొగుడు చేసిపెడితే తేరగా తినికూర్చుందామనుకున్నావా దొంగ రాస్కెల్?"

ఇంతలో అతని కొడుకు తన పాఠంలో ఒక వంక్తి మర్చిపోయి అదేంటో చెప్పమంటూ తండ్రిదగ్గరికి వచ్చాడు.

జీతూ కోపమంతా కొడుకుమీదికి మళ్లింది.

"వెధవా ... వేలెడంతలేవు... పాఠంలో ఒక్క ముక్క గుర్తెట్టుకోవటంరాని పిల్లకాయవి అన్నం తినడమెలాగో నాకు నేర్పుతావా?" అంటూ వాడి నడ్డిమీద నాలుగు గుద్దులు గుద్దాడు.

ఆ కోపంతో విసురుగా బయటకొచ్చిన జీతూకి చేతినంచి పుచ్చుకొని బజారుకి పోతున్న తండ్రి కన్పించాడు. ఆయన కష్టఫలంగా పెరట్లో విరగకాస్తున్న చెట్లపాదులు కన్పించాయి. జీతూ కోపం వెంటనే ఆయనమీదకి ప్రసరించింది.

"తను దొడ్లోంచి దర్జాగా వెళ్తూ నాకు చుట్టు తిరిగి పొమ్మని సలహా చెబుతాడా? లేకపోతే ఈ పాదులు పాడవుతాయా? నా పిండాకూడేం కాదూ" అనుకొని తండ్రి కనుమరుగవగానే తమ మూడు గొర్రెల్నీ విప్పి పెరట్లోకి తోలాడు. ఇంకేముంది? పావుగంటలో చెట్లపాదులు సమూలంగా మాయమయ్యాయి.

మళ్ళీ తెల్లవారగానే నోట్‌బుక్ చేతిలో పుచ్చుకుని-

"నా లోటుపాట్లేమైనా ఉంటే చెప్పండి! సరిదిద్దుకుంటాను" అంటూ మిత్రులకోసం ఊరిమీదికి బయలుదేరాడు జీతూ.

కాని ఏవరూ అతనికేం చెప్పలేదు. కారణం కొరివితో తల గోక్కోవటం అనవసరమని వారికి బాగా తెలుసు.

—గావేలి





## పారని ఎత్తు

ఓరోజు ఉదయాన్నే పొట్ట పోసుకోడానికని బయలుదేరిన ఓ వృద్ధజంబూకానికి తిరిగి తిరిగి అలసట వచ్చిందే తప్ప ఆహారమెక్కడా లభించలేదు. అలాగే నీరసంగా తిరుగుతూ ఓ కొండ ప్రాంతానికి చేరిందది. అక్కడ అప్పుడే వేటాడి పట్టుకున్న నెమలిని ఆరగించబోతూ కన్పించింది మరో నక్క. మంచి వయస్సులో దృఢంగా కన్పిస్తున్న ఆ నక్కతో పోరాడి గెలవడం అసాధ్యమనుకున్న వృద్ధ జంబూకం ఏదైనా ఎత్తువేసి దాని దగ్గర తనూ కాస్త వాటా కొట్టేయాలని నిర్ణయించుకుంది.

అందుకే ఆ నక్కకి అల్లంతదూరంలో పడుకొని దానివంకే చూస్తూ గాఢంగా నిట్టూర్చిందది.

ఆ అలికిడికి తలెత్తి చూసిన కుర్రనక్క, ముసలినక్క ఆకలిచూపులు గమనించి నెమలిని మరింత గట్టిగా పట్టుకొని మెల్లగా ఆరగించనారంభించింది.

ఆతర్వాత వృద్ధ జంబూకం మళ్లీ మళ్లీ నిట్టూర్పులు విడుస్తుంటే గుర్రుగా చూసి, "ఏమిటి నీ ఉద్దేశం? నీకూ ఆకలవుతోందా ఏమిటి?" అని చిరాగ్గా అడిగింది కుర్రనక్క.

"హుం! నిజంగా నీ ప్రవర్తన నక్కజాతికే అవమానకరంగా ఉంది సోదరా. నువ్వు మన వంశప్రతిష్టలు గంగలో కలిపేస్తున్నావ్!" అంది ముసలినక్క ఆత్రంగా మాంసాన్ని తింటున్న కుర్రనక్కను చూసి.

"నేను నీకు కొంచెం వాటాయిస్తే మన వంశప్రతిష్ట ఇనుమడిస్తుందా సోదరా?" వ్యంగ్యంగా అంది కుర్రనక్క.

"అన్నన్న ఎంతమాట? కుందేళ్లనీ, పందికొక్కుల్ని మనం వేటాడచ్చుగాని నెమళ్లని చంపడం తప్పుకదా" నొచ్చుకుంటూ అంది ముసలినక్క.

కుర్రనక్క ఆ నెమలి మాంసమంతా ఒక్కతే తింటుంటే దానికెంతో బాధగా ఉంది.

"అలాగా! మనం నెమళ్లని మాత్రం ఎందుకు వేటాడరాదు సోదరా?" మాంసం చప్పరిస్తూ తాపీగా అంది కుర్రనక్క.

"ఎందుకంటే అవి చాలా అందంగా ఉంటాయి. సాధుప్రాణులు. అలాంటివాటిని హింసిస్తే అడవిలోని మిగిలిన జంతువులు ఏమనుకుంటాయ్ చెప్పు?" తనకు దక్కకుండానే క్రమంగా మాంసం మాయం అయిపోతుండడం వలన కలిగే బాధ వృద్ధ జంబూకం స్వరంలో స్పష్టమైంది.

"అనుకోనీ! ఎవరిష్టంవారిది. నాకు తెల్సినంతవరకూ అడవి జంతువులన్నీ నెమలి మాంసం భలే పసందుగా ఉంటుందని అనుకుంటాయి" అంటూ కుర్రనక్క ఆఖరి మాంసం ముక్కను కూడా నోట్లో పెట్టుకోబోతూ



అంది.

"ఆగాగు... ఆ ముక్క తినకు ఛస్తావ్ అది విషం" అడ్డుపడబోయింది ముసలినక్క.

అయినా కుర్రనక్క లక్ష్యపెట్టకుండా దాన్ని కాస్తా గుటుక్కున మింగేసి, "శీఘ్రమరణం నక్కలకు లభించదు సోదరా! ఆధవా లభించిందా దానంతటి పరువుతక్కువ మరొకటి ఉండదు" అంటూ చిలిపిగా నవ్వి వచ్చిక మీద నడుం వాల్చింది.

ముసలినక్క జిత్తులన్నీ కొరగాకుండా పోవడానికి అసలు కారణం దాని ప్రత్యర్థి కూడా నక్క కావడమే!

— లూదెహువా

స్వేచ్ఛానుసరణ: ప్రతాపచంద్ర



# చతుర

సంపుటి : 13 జనవరి 1991 సంచిక : 12

'కన్యగా కనే రంగుల స్వప్నాలు... నిజాలుగా మారడం అసాధ్యం' అని నిరూపించాడు తను ప్రాణంగా ప్రేమించి పెళ్లాడదామనుకున్న బావ. కుమిలిపోతున్న ఆమెను మరిపించి, బతుకులో విలువను చూపించి ప్రేమ, పెళ్లి పేరుతో వంచించాడు మరో మగవాడు. తన జాతకమే నష్టజాతకమనీ, వైవాహిక జీవితమే తన నొసటలేదనీ క్రుంగిపోయే తరుణంలో ఆమెను మనసారా ప్రేమించి పెళ్లాడతానని ముందు కొచ్చాడు ఆమె కోసమే పెద్దచదువులు చదివిన ఓ అజ్ఞాత ప్రేమికుడు. కానీ... అక్కడా ఆమెకు చుక్కెదురయింది. ఆధునిక ప్రపంచంలో మూఢనమ్మకాలుగా కొట్టిపారేసేవన్నీ ఆమె జీవితంలో భయంకర వాస్తవాలుగా రుజువవుతున్నప్పుడు చివరికామె ఏం చేసింది? వంచనే తప్ప మంచికి తావులేని ఈ స్వార్థ ప్రపంచం మానవత్వానికి మారుపేరయిన ఆ ప్రేమమయికి మిగిల్చిందేమిటి?

అమాయక స్త్రీల జీవితాలతో ఆటలాడే గోముఖ వ్యాఘ్రాల నిజస్వరూపాలకి అద్దంపడుతూ జె.వి.బాబు రచించిన 'వసుంధర' ఈనెల చతుర సమర్పిస్తున్న సమగ్ర నవల.

"పోస్ట్" అనే కేక వింటూనే-

లుంగీ చుట్టుకుంటున్న చంద్రశేఖర్ అరని ముఖం తర్వాత బయటకు వెళ్ళి పోస్ట్‌మాన్ చేతిలోని ఉత్తరం అందుకున్నాడు. లోపలికి వస్తూ కవరు మీద అక్షరాలు పరిశీలించాడు. అవి తనకు సుపరిచితమైనవే.

యధాలాపంగా కవరును చించి అందు లోని కాగితం బయటకు తీశాడు. ఆ కాగి తంలోని అక్షరాలు కుదురుగా, గుండ్రంగా ముద్దొచ్చేలా ఉన్నాయి.

"ప్రియమైన బావకు...

"ఇక్కడ అందరూ క్షేమంగా ఉన్నారు. మరి నువ్వు అక్కడ ఎలా ఉన్నావో తెలియలేదు. నీ నుండి ఒక్క జాబు కూడా రాదు.

బావా... నువ్వెలా ఉన్నావు? నీకు అక్కడ అంతా సౌకర్యంగానే ఉందా? నువ్వు అక్కడ ఎంత ఆనందంగా ఉన్నా నా బావ ఎలాంటి అసౌకర్యంతో బాధపడుతున్నాడో కదా అని అనుకుంటూ దిగులుపడుతుంటాను నేను. అసలు నీకా హోటల్ తిండి సరిపడుతుందా? ఏమిటో అన్నీ ఉండి కూడా నీకీ ఒంటరిజీ వితం ఎందుకో అర్థంకాదు. పెళ్ళి చేసు కుందాం అంటే 'నేనింకా పై చదువులు చద వాలి, పెళ్ళికి చదువుకు పొత్తు కుదరదు' అంటావు. పెళ్ళిచేసుకున్నాక పైచదువులు చదివేవారు ఈ లోకంలో ఎంతమంది లేరు?

బావా... నా మనసెందుకో నిన్ను వెంటనే చూడాలని ఆత్రుత పడుతోంది. కాని నువ్వేమో మన పల్లె వైపే రావడం మానేశావు. అయినా నాకు తెలియక అడుగుతాను అంత బిజీపను లు నీకేం ఉన్నాయి. బ్యాంక్ ఉద్యోగం, ఐ.ఏ.యస్‌కు చదువుకోవడం అంతేకదా! అలాంటప్పుడు ఒకింత తీరిక చేసుకుని మన ఊరు రావచ్చుకదా! అమ్మ, నాన్న అత్తయ్యా అందరూ నిన్ను చూడాలని ఆరాటపడుతున్నా రు. ఇక నా సంగతి చెప్పనే అవసరంలేదు. ఏవేవో విరహగీతాలు గుర్తుకు వస్తున్నాయి... నా చుట్టూ ఎంతోమంది ఉన్నా ఒంటరిననే భావన నాలో కలుగుతోంది. అందుకే కాసేప యినా నా ఈ అనుభూతిని నీతో పంచుకోవా లనే, మన ఇంటి పెరడులోని మామిడిచెట్టు కింద కూర్చుని ఎవరూ చూడకుండా నీకీ ఉత్తరం రాస్తున్నాను.

మిట్టమధ్యాహ్నం కదా అమ్మా నాన్న హాయిగా నిద్రపోతున్నారు. నాకు మాత్రం మధ్యాహ్నం వేళ నిద్ర అసలు రానేరాదు. ఒకవేళ పడుకున్నా నీ గురించిన ఆలోచనలే నన్ను చుట్టుముడుతుంటాయి. అయినా బావా... నీకు నన్ను చూడాలని ఎప్పుడూ అనిపించదా?... నాకు మాత్రం కనులు మూ సినా, కనులు తెరిచినా నీ రూపమే సాక్షాత్కార మవుతుంటుంది... ఈ పిచ్చిదాని అమాయక త్వానికి నవ్వుకుంటున్నావా? నిజమే... ఈ సమ యంలో నా బాధ చూసి మామిడాకు, ఎదు రుగా ఉండే నన్నజాజిపువ్వు కూడా మెల్లగా నవ్వుకుంటున్నట్టున్నాయి.

ఎవరు ఏమనుకున్నా ఎందరు నవ్వుకున్నా నా బావ మీద నాకు కొద్దిగా కూడా ప్రేమ తగ్గదు- ఇది నిజం.

బావా! ఒక్కసారి నువ్వొచ్చి కనిపించిపో లేదా కనీసం ఉత్తరం ముక్కయినా జవాబుగా రాయి. నీకోసం ఎదురుచూస్తూంటాను.

ఇట్లు
నీ మరదలు
వసుంధర

ఉత్తరం మడిచి దూరంగా విసిరేశాడు చంద్రశేఖర్. బద్ధకంగా వళ్ళు విరుచుకున్నా డు.

ఆ క్షణం ఒకింతసేపు మరదలి అందమైన రూపం కనుల ముందు కదలాడింది.

'పాపం... పిచ్చిది' మనసులోనే అనుకున్నాడ తను.

'తన చదువుకు ఎంత సహాయం చేసి ఉంటే మాత్రం ఒక బ్యాంక్ ఆఫీసరయి ఉండి, రేపోమాపో ఐ.ఎ.యస్‌కు సెలక్ట్ కాబో తున్న తను ఒక పల్లెటూరి పిల్లను పెళ్ళాడ తాడా?...

నో నో... తను తన స్టేటస్‌కు తగిన అమ్మా యినే పెళ్ళాడి తీరతాడు...?'

ఆలోచనలు ఆపి అతడు తన రోజువారీ కార్యక్రమంలో మునిగిపోయాడు.

స్నానంచేసి డ్రస్సప్ అయ్యాడు. బయటకు





నడిచి స్కూటర్ స్టార్ట్‌చేసి బ్యాంకు వైపు పోని చ్చాడు.

బ్యాంక్‌లో అడుగుపెట్టకముందే భానుమూర్తి అతడిని పలకరించాడు.

"హాయ్ చంద్రా"

"హలో భానూ" ఆ వైపు నడుస్తూ అన్నాడు అతడు.

"ఏమిటి విశేషాలు... నిన్న హాలీడేకి ఏదయినా ప్రోగ్రాం వేసుకున్నావా?..."

"అలాంటిదేమీ లేదే" నవ్వేశాడు చంద్రశేఖర్.

"కొంత ఉత్సాహంగా ఉన్నట్టు అనిపిస్తేనూ, నిన్న హాలీడేని బాగా ఎంజాయ్ చేసి ఉంటావనుకున్నాను. అలాంటిదేమీ లేదంటే మరి ఈ ఉత్సాహానికి కారణం ఏమయిఉంటుంది?"

భానుమూర్తి ఆలోచనల్లో పడ్డట్టుగా రెండు క్షణాలు దీర్ఘంగా పైకప్పు వంక చూసి తర్వాత చెప్పాడు-

"రైట్... నీలోని ఈ ఉత్సాహానికి కారణం ఈరోజు నీ మరదలు దగ్గర నుండి నీకు ఉత్తరం వచ్చి ఉంటుంది యామ్ ఐ రైట్?"

బలవంతంగా నవ్వాడు చంద్రశేఖర్. 'తన మనసులోని ఆలోచన తెలియని మిత్రుడు తనింకా వసుంధరను పెళ్ళాడబోతున్నట్టుగానే ఊహించుకుంటున్నాడు. అందుకే తనతో ఇలా మాట్లాడుతున్నాడు' మనసులో కొంత గిల్టీగా కూడా అనిపించింది. తేరుకుని మిత్రుడితో "యూఆర్‌రైట్" అన్నాడు. ఇక అతడి ముందు ఎక్కువసేపు ఉండడం ఇష్టంలేక ఏదో పని ఉన్నట్టుగా అక్కడినుండి తప్పుకుని వెళ్ళిపోయాడు.

భానుమూర్తి కూడా తన పనిలో మునిగిపోయాడు.

చంద్రశేఖర్ ఆ బ్యాంక్‌లో ఫీల్డ్ ఆఫీసర్, భానుమూర్తి కేషియర్. వారిద్దరూ ఉద్యోగంలో ఒకేసారి జాయిన్ అయ్యారు. ఒకరికొకరు పరిచయం చేసుకున్నాక భానుమూర్తి రూమ్‌కోసం వెతుకుతున్నాడని తెలిసింది. అతడికి రూమ్ దొరికేవరకూ తన గదిలో ఉండమని చెప్పాడు చంద్రశేఖర్. ఆరోజే అతడు చంద్రశేఖర్ గదిలో చేరిపోయాడు.

ఆరునెలలపాటు వారిద్దరూ రూమ్మేట్స్‌గా ఉన్నారు. యువకులు, బ్రహ్మచారులు అయిన వారి మధ్య క్రమంగా చనువు పెరిగింది. ఇద్దరూ చాలా క్లోజ్‌గా మూవ్ అయ్యేవారు.

ఒంటరిగా ఉన్నప్పుడు చంద్రశేఖర్ తన మరదలు వసుంధర గురించి భానుమూర్తికి చెప్పేవాడు. ఆమె అందాన్ని వర్ణించేవాడు. ఆమెకు తన మీద గల ప్రేమను వివరించేవాడు. వసుంధర తనకు రాసిన ఉత్తరాలు కూడా అతడికి చూపించేవాడు చంద్రశేఖర్.

ఆవిధంగా భానుమూర్తికి వసుంధర గురించి తెలుసు. ఆమెను ప్రత్యక్షంగా చూడకపోయినా ఆమె రూపలావణ్యాలు, మంచి మనసు సుపరిచితాలయ్యాయి. అతడు అనుకుంటుండేవాడు వసుంధరలాంటి అభిమానించే మనసున్న అమ్మాయిని పెళ్ళాడటం చంద్రశేఖర్ అదృష్టమని. అయితే అతడికింతవరకూ చంద్రశేఖర్ మనసులో కొత్తగా ఏర్పడిన ఆలోచనల గురించి తెలియదు కాబట్టే అతడు ఇంకా మిత్రుడిని ఆటపట్టిస్తూనే ఉన్నాడు ఆ విషయంలో.

లంచ్‌టైమ్‌లో హోటల్‌కి వెళ్ళినప్పుడు భానుమూర్తి చంద్రశేఖర్‌ని అడిగాడు "అవునూ... ఇంతకీ ఈరోజు వచ్చిన ఉత్తరంలోని విశేషాలేమిటి?"

"ఏమున్నాయి, మామూలే... నన్ను చూడాలని ఉందట. ఒకసారి ఊరు వచ్చి వెళ్ళమని రాసింది" ముభావంగా చెప్పాడు చంద్రశేఖర్.

"పాపం... ఆమె అంతగా కోరుకుంటున్నప్పుడు, చూడాలని తపనపడుతున్నప్పుడు ఒకసారి వెళ్ళి కనిపించి రాకూడదూ?"

ఆ చర్చ తనకిష్టంలేనట్టు టాపిక్ మార్చాడు చంద్రశేఖర్ "అది సరే!... ఇంతకీ పరీక్షలకు నువ్వెలా చదువుతున్నావు?"

మిత్రుడు టాపిక్ మార్చడం గుర్తించాడు అతడు. అయినా అదేమీ పట్టించుకోకుండా "బాగానే చదువుతున్నాను" అన్నాడు.

భానుమూర్తి ఆఫీసర్ పోస్ట్‌కోసం పరీక్షలకు ప్రిపేర్ అవుతున్నాడు. అసలు వారిద్దరూ వేరు పడినందుకు కారణం అదే. అటు చంద్రశేఖర్ ఐ.ఎ.యస్ కోసం చదువుతున్నాడు; ఇటు



తను ఆఫీసర్ పోస్టుకోసం ప్రిపేరవుతున్నాడు. ఒకరి చదువు మరొకరికి డిస్టర్బెన్స్ అవుతుందని భానుమూర్తి వేరుగా రూమ్ తీసుకుని వెళ్ళిపోయాడు.

చర్చ చదువులు మీదకి వెళ్లిపోయింది.

భోజనాలు పూర్తయ్యాక ఇద్దరూ బ్యాంక్‌కి తిరిగి వచ్చేశారు.

★ ★ ★

చిన్న పల్లె అది.

ఆ పల్లెలో ఉండే నలుగురు మోతుబరి రైతులలో శంకరయ్య ఒకడు. పాతికెకరాల పొలం, పాతకాలం నాటి పెద్దఇల్లు, పది పాడి పశువులు మంచి స్థితిగల కాపురమే అయనది.

ఆయనకు ఇద్దరే సంతానం. ఒక అమ్మాయి, ఒక అబ్బాయి. ఆ ఇద్దరిలో అమ్మాయి పెద్దది, వయసు పద్ధెనిమిది.

ఆమే వసుంధర.

వసుంధర అంటే ఆ ఇంటిలోనివారందరికీ ఎంతో ఇష్టం. ఇంటిలోనివారే కాదు గ్రామంలోని వారంతా ఆమెను అభిమానిస్తారు.

ఆమెది చాలా మృదువైన స్వభావం. తన చుట్టుపక్కల ఎవరు కష్టపడుతున్నా ఆమె భరించలేదు. తనకు చేతనయిన సహాయంచేసి వారిని ఆదుకునేది. ఇరుగుపొరుగు ఏదయినా అవసరపడితే చాటుగా ఆమెను అడిగేవారు. ఆమె కూడా తల్లికి తెలియకుండా వారు కోరింది అందించేది. సాయంత్రం, తండ్రి తిరిగొచ్చాక తను చేసిన ఘనకార్యాలన్నీ ఆయనకు ఏకరువుపెట్టేది. ఆయన హాయిగా నవ్వుకునేవాడు. ఆమె తల్లికి ఈ చాటుమాటు వ్యవహారాలు తెలిసినా గట్టిగా కసురుకునేదికాదు. ఆప్యాయంగా విసుక్కునేది అంతే.

అందమైన ఆ పల్లెలో ఆనందంగా గడుస్తోంది ఆమె జీవితం.

అయితే ఆ ఆనందకరమైన జీవితంలో ఒకే ఒక కోరిక తీరవలసిఉంది. ఆ కోరిక తీరబోయే క్షణంకోసం ఆమె ఎదురుచూస్తూ ఉంది. ఆమె కోరిక పెద్దదేంకాదు చాలా చిన్నదే... తన ముద్దులబావను పెళ్ళిచేసుకోవడం.

తన బావ చంద్రశేఖర్ అంటే వసుంధరకు చాలా ఇష్టం.

ఆమె మేనత్త చిన్నవయసులోనే భర్తను పోగొట్టుకోవడంతో తన అన్నగారి పంచన వచ్చి చేరింది. అప్పటికి చంద్రశేఖర్ వయసు పదేళ్ళు. వసుంధరకు నాలుగయిదేళ్ళుంటాయి. వారిద్దరికీ స్నేహం కలిసింది. ఇద్దరూ కలిసి స్కూల్‌కి వెళ్ళడం మొదలుపెట్టారు. చంద్రశేఖర్ ఐదోతరగతి. వసుంధర ఒకటి. స్కూల్ వదిలాక ఇద్దరూ కలిసి ఆడుకునేవారు; ఇద్దరూ కలిసి రకరకాల చిలిపిపనులు చేసేవారు.

కాలంతోపాటు వారూ పెరిగారు. వయసులతోపాటే వారి స్నేహం కూడా పెరిగింది. చంద్రశేఖర్ కాలేజిలో చేరాడు. సెలవులకు మాత్రమే పల్లెకు వచ్చేవాడు. చంద్రశేఖర్ కాలేజి ఖర్చంతా శంకరయ్యే భరిస్తూ ఉన్నాడు. అందుకొక కారణం ఉంది తన మేనల్లుడిని బాగా చదివించి, తన కూతుర్ని ఇచ్చి పెళ్ళిచేయాలన్నది ఆయన ఆశ. అందుకు ఆయన చెల్లెలు సుముఖంగానే ఉంది. మేనల్లుడు కూడా వసుంధరను ఇష్టపడుతున్నట్టుగానే ఆయన భావించాడు.

ఆ ఉద్దేశంతోనే ఆ బావామరదళ్లు ఎంత చనువుగా మసలుకుంటున్నా ఆ ఇంటిలోనివారెవరూ ఏమీ అనేవారు కాదు- 'ఎంతయినా కాబోయే భార్యాభర్తలు కదా' అనుకునేవారు.

వసుంధర స్కూల్‌ఫైనల్‌తో చదువు ఆపేసింది.

పోస్టుగ్రాడ్యుయేషన్ పూర్తయిన సంవత్సరమే చంద్రశేఖర్‌కు బ్యాంక్ ఆఫీసర్‌గా ఉద్యోగం వచ్చింది.

ఉద్యోగం వచ్చింది కాబట్టి ఇక పెళ్ళి చేసేస్తానన్నాడు శంకరయ్య.

'కాదు మామయ్యా... నేనింకా పైచదువులు చదవాలి, అన్నాడు చంద్రశేఖర్.

ఊరుకోక తప్పింది కాదు ఆ ఇంటిలోనివారికి. అదీగాక 'తమ అల్లుడు ఇంకా పైచదువులు చదివి మరింత ఉన్నతస్థితికి వెళ్తే సుఖపడబోయేది తమ అమ్మాయేకదా' అనుకున్నారు వారు.

అయితే బ్యాంక్ ఉద్యోగం వచ్చాక చంద్రశే

ఖర్ ఆలోచనలు కొద్దిగా మారాయి. తను బాగా చదువుకున్న అమ్మాయిని, ఉద్యోగంచేసి డబ్బు సంపాదించే స్త్రీని పెళ్ళాడితే తన జీవితం మరింత సాఫీగా జరుగుతుంది కదా' అనుకోసాగాడు. అలాకాకపోయినా రేపు తను కలెక్టర్ అయితే ఏ ప్రముఖ రాజకీయనాయకుడో, బిజినెస్ మాగ్నెటో లక్షల కట్నంతో తనకు అమ్మాయినిస్తాడు. ఒక ప్రముఖుడు తనకు మామ అయితే సమాజంలో తన స్టేటస్ పెరుగుతుంది. ఆ కట్నం డబ్బుతో విలాసవంతమయిన జీవితం గడపవచ్చు... ఇవీ అతడి ఆలోచనలు.

ఈ ఆలోచనలు మనసులో ప్రవేశించాక అతడు పల్లెకు వెళ్ళడం దాదాపుగా మానేశాడు. ఉత్తరాలు రాయటం కూడా తగ్గించేశాడు. తల్లిని తన దగ్గరకు పిలిపించుకోవాలని ప్రయత్నించాడు. అయితే తల్లి శకుంతలమ్మకు సిటీ వాతావరణం పడకపోవడంతో రాలేనని ఖచ్చితంగా చెప్పేసింది.

పాపం... వసుంధరకు తన బావ ఇలా పట్నవాసంలో కృత్రిమ విలువలపట్ల ఆకర్షితుడవుతున్నాడన్న విషయం తెలియదు. అందుకే ఆమె అతడిని గాఢంగా అభిమానిస్తోంది. మనసులోనే ఆరాధిస్తోంది. తన ప్రేమను ఉత్తరాల ద్వారా బావకు తెలుపుకుంటోంది.

★ ★ ★

పెరడులోని సన్నజాజిపందిరి కింద మంచం వాల్చుకుని తెలుగు నవల చదువుకుంటోంది వసుంధర.

మిట్టమధ్యాహ్నం వేళఅయినా చెట్ల మధ్యకావడంతో చల్లగాలి మెల్లగా వీస్తోంది. చెట్ల మీద చేరిన పక్షుల అరుపులు పెద్దగా వినిపిస్తున్నాయి.

తన పక్కనే ఏదో చప్పుడయినట్లుగా అనిపించి చప్పున తిరిగి చూసింది వసుంధర.

రంగడు తల గీరుకుంటూ తన పక్కనే నిలబడి ఉన్నాడు. ఆమె చూడటంతోనే బలవంతంగా నవ్వాడు అతడు.

అతడి నవ్వు చూడటంతోనే ఆమెకు అర్థమయిపోయింది - రంగడు తననేదో అడిగేందుకు వచ్చాడు. ఆమె చిరునవ్వుతో "ఏమిటి రంగయ్యా... ఏం కావాలి?" అంది.

రంగడు తలగోక్కోవటం ఆపి "చిన్నమ్మగోరూ..." అంటూ ఆగాడు.

ఆ నసుగుడు ఎందుకో ఆమెకు అర్థమయింది అది డబ్బు కోసం. దాంతో ముఖాన్ని కాస్త సీరియస్‌గా మార్చి "ఏం కావాలో చెప్పు?" అంది దబాయిస్తున్నట్టు.

రంగడు నసగటం ఆపి చెప్పాడు "చిన్నమ్మగోరూ! నాకు... నాకు పది రూపాయలు కావాలి"

"ఎందుకు?"

"పిల్లాడి పుస్తకాలు కొనాలమ్మా" చెప్పాడు.

"పిల్లాడి పుస్తకాలకా లేక నీ సొంతఖర్చులకా?"

అతడు తడబడి "నిజంగా పిల్లాడి ఖర్చుకేనమ్మా" అన్నాడు.

"పిల్లాడికోసం అయితే నాన్ననే అడగొచ్చు కదా?"

"అప్పు పెరిగిపోతుందని నాన్నగారు తిడతారమ్మా. అదీగాక నిన్ననే ఆయన దగ్గర పాతికరూపాయలు తీసుకున్నాను"

నిముషంపాటు నిశ్శబ్దంగా ఉండి "సరే... ఇస్తానుండు" అంటూ లేచింది ఆమె. తన పడకగదిలోనికి వెళ్ళి ట్రంకుపెట్టె తెరిచింది. పండుగలకు, పుట్టినరోజుకు నాన్నగారు ఇచ్చే డబ్బు అందులో ఉంది. పెట్టె అడుగు నుండి డబ్బు తీసి పదిరూపాయలు అందుకుని బయటకు వచ్చింది. అది రంగయ్యకు అందించి "జాగ్రత్త... ఇది పిల్లాడి ఖర్చులకని ఇస్తున్నా. నువ్వు సొంతఖర్చు పెట్టుకున్నావని తెలిస్తే మాత్రం ఊరుకోను" అంది.

రంగయ్య నవ్వు ముఖంతో అన్నాడు "మీకు అబద్ధం చెపుతాననంటమ్మా? ఇది నిజంగా నా కొడుకు పుస్తకాల కోసమే"

"సరే... వెళ్ళు" అంది వసుంధర.

రంగయ్య వెళ్ళిపోయాడు.

ఆమె తిరిగి సన్నజాజిపందిరి దగ్గరకు వచ్చి మంచం మీద వాలి, నవల అందుకోబోయేంతలో పక్కింటి మీనాక్షమ్మ పిలిచింది "వసూ..."

"ఏమిటి పిన్నీ" ప్రహరీగోడ దగ్గరగా నడు




స్తూ అడిగింది వసుంధర.

"అమ్మ ఏం చేస్తోంది?"

"నిద్రపోతోంది పిన్నీ" జవాబు చెప్పి తర్వాత అన్నది "ఏం కావాలి?"

"ఏంలేదమ్మా... మీ బాబాయి ఇంకాసేపట్లో నిద్రలేస్తారు. ఆయనకు నిద్ర లేవగానే ఎదురుగా కాఫీకప్పు ఉండాలి. ఇంట్లో ఏమో పంచదార నిండుకుని ఉంది" మిగతాది. పూర్తి చేయకుండానే ఆగింది మీనాక్షమ్మ.

"దాన్దేముంది పిన్నీ... నేనిస్తాగా"

"అదికాదు వనూ... మీ అమ్మకు తెలిస్తే నిన్ను ఏదయినా అంటుందేమోనని అడగలేక పోతున్నాను"

"గ్లాను పంచదార కోసం అమ్మకు చెప్పడం ఎందుకు? నేను అమ్మ చూడకుండా తీసుకువస్తాలే"

"ఎంత మంచిమనను తల్లీ నీది" మీనాక్షమ్మ పొగిడింది.

ఆ పొగడ్తకు పొంగిపోయికాదుగాని, పక్కవారికి పెట్టడంలో ఉన్న తృప్తి వసుంధరను వంటగదివైపు నడిపించింది.

చప్పుడు చేయకుండా వంటగది తలుపు తీసి లోపలికెళ్ళింది. పంచదార డబ్బాలో నుండి గ్లానుడు చక్కెర తీసుకుని వెనుతిరిగింది. వంటగది తలుపు గడియ వేస్తుంటే, హాలులో పడుకుని ఉన్న శారదమ్మ నిద్రమత్తులోనే "ఏమిటే వనూ?" అంది.

"దాహమయితే మంచినీళ్లు తాగానమ్మా"

శారదమ్మ తిరిగి మాట్లాడలేదు. ఆమె నిద్రలోకి జారుకుంది.

వసుంధర పెరటిగోడ దగ్గరకు వచ్చి మీనాక్షమ్మకు పంచదార గ్లాను అందించింది.

ఆ గ్లాను అందుకున్నాక మీనాక్షమ్మ వెనుతిరిగి వెళ్ళబోతూ "వనూ... అన్నట్టు నీకీ విషయం తెలుసా, మన ఎదురింటిలో గవర్నమెంట్ డాక్టర్ కొత్తగా దిగబోతున్నాడుట"

"అవునా"

"అవును... పనివాళ్ళు ఆ ఇంటిని శుభ్రం చేస్తూ ఉన్నారు"

ఆ మాట చెప్పి మీనాక్షమ్మ వెళ్ళిపోయింది.

వసుంధరకి నవల మీద మనసు పోలేదు. ఆమె హాలులోనుండి వీధి వాకిలి దగ్గరకు వెళ్ళి ఎదురింటి వైపు చూసింది.

ఇద్దరు పనివాళ్ళు ఆ ఇంటి దుమ్ము దులుపుతూ, నీటితో కడిగి శుభ్రం చేస్తున్నారు.

ఆమె ఆ ఇంటివంక కాసేపు అలాగే చూసి తిరిగి లోపలికి వెళ్ళిపోయింది.



"నాన్నా! బావ-బావ... ఐ.ఎ.యస్.లో సెలక్ట్ అయ్యాడట" వీధి వాకిలిలోనుండే మహోత్సాహంగా అరుచుకుంటూ లోపలికి వచ్చింది వసుంధర.

హాలులో కూర్చుని ఉన్న శంకరయ్య, శారదమ్మ, శకుంతలమ్మలు ఆ మాటలకు ఉలిక్కిపడి ఆమె వంక చూశారు.

"నిజమా?!" అన్నారు అందరూ ఒక్కసారే.

"నిజం...ఇదుగో ఈ ఉత్తరంలో బావ రాశాడు"

శంకరయ్య ఉత్తరం అందుకుని చదివాడు, తర్వాత శారదమ్మ, శకుంతలమ్మలు కూడా దాన్ని అందుకుని చూశారు. అందరి ముఖాలలో ఆనందం వెల్లివిరిసింది.

"ఆ దేవుడి దయ వలన వాడు కోరింది జరిగింది అంతేచాలు" అంది శకుంతలమ్మ.

"ఇది ఆ దేవుడి దయే కాదు మా అమ్మాయి అదృష్టం కూడా ఇందులో ఉంది" నవ్వుతూ చెప్పింది శారదమ్మ.

"అదృష్టవంతురాలు కాబట్టే కదా కలెక్టర్ భార్య కాబోతోంది" తన మేనకోడలు వైపు ఓరగా చూస్తూ అన్నది శకుంతలమ్మ.

ఆ మాటకు వదినా మరదళ్ళతోపాటు శంకరయ్య కూడా నవ్వాడు. వసుంధరకు సిగ్గు ముంచుకురావడంతో పరిగెత్తుకుంటూ పక్కగదిలోకి వెళ్ళిపోయింది. అయితే ఒక చెవి అటువేసి వారి మాటలు ఆలకించసాగింది.

శంకరయ్య అంటున్నాడు "శకుంతలా... వాడు అనుకున్నది సాధించాడు. ఇక మనం కోరుకున్నది జరిపించేస్తే సరిపోతుందిగా"

"మీరనేది వసుంధర పెళ్ళి విషయమేగా అన్నయ్యా...ఇందుకు నన్ను అడగాల్సిన అవసరం ఏముంది? ఇది ఎలాగూ చిన్నప్పటి నుండీ అనుకుంటున్నదే కదా! కాబట్టి మీరు ఒకేసారి ముహూర్తం నిర్ణయించి తీసుకెళ్ళి, 'ఫలానా తారీఖున మీ పెళ్ళిరా' అని వాడితో చెప్పేయండి అంతే"

ఆయన తల అడ్డంగా ఆడించాడు "అలా వద్దులే శకుంతలా! ఫలానా తారీఖున పెళ్ళి అంటే ఆ రోజుకు వాడికి తీరిక ఉండచ్చు, ఉండకపోవచ్చు. మనం ముందుగా నిశ్చయించేసి వాడిని ఇబ్బందిపెట్టడం భావ్యంకాదు. ముందుగా వాడిని కనుక్కుని, వాడికి వీలు చిక్కినప్పుడే ముహూర్తాలు నిర్ణయించడం నబబుగా ఉంటుంది"

"అలా అనుకునేప్పుడు ఇంకా ఆలస్యం ఎందుకన్నయ్యా! వాడిని వెంటనే రమ్మని జాబు రాయడమో లేక మీరే వెళ్ళి విషయం కనుక్కుని రావడమో చేస్తే సరిపోతుంది"

ఆయన సాలోచనగా తలూపి 'నిజమే' అని, క్షణంఆగి చెప్పాడు- "ఉత్తరం రాయడం కన్నా నేను వెళ్ళి రావడమే మంచిదనుకుంటున్నాను"

"అదే మంచిది... వీలు చూసుకొని వెళ్ళి రండన్నయ్యా"

తలూపాడు శంకరయ్య.

"మంచిరోజు చూసుకుని వెళ్లండి" సలహా ఇచ్చింది శారదమ్మ.

"అలాగే" అన్నాడాయన. తిథులు, వారాలు లెక్కవేశాక "గురువారం బాగుంటుందోయ్" అన్నాడు భార్యతో.

"అయితే ఆ రోజు వెళ్లండి"

"వెళ్తాను"

ఆతర్వాత వారు పెళ్ళికి పిలవాల్సిన అతిథుల గురించీ, పెళ్ళికి కావలసిన ఆర్భాటాల గురించి చర్చించుకోసాగారు. వసుంధరకు ఆ చర్చ ఆసక్తిగా అనిపించింది. చెవులు రిక్కరించి వినసాగింది.

ఒక గంటసేపు చర్చ తర్వాత శంకరయ్య లేచి బయటకు వెళ్ళాడు. ఆయన వీధిలో కనిపించినవారందరికీ 'తన అల్లుడు ఐ.ఎ.యస్. పాసయ్యాడని, కలెక్టర్ కాబోతున్నాడని' ఆనందంతో చెబుతాడని ఆమెకు తెలుసు. ఆయన ఒక్కడే కాదు తన ఇంటిలోనివారంతా ఈ విషయాన్ని ఇరుగుపొరుగుకు సంతోషంగా చెప్పుకుంటారు. బంధువర్గం అంతటికీ ఈ విషయం తెలుస్తుంది. తమ అదృష్టానికి వారిలో కొందరు కుళ్ళుకుంటారు కూడా.

మనసులో ఏదో తెలియని ఉత్సాహం పొంగి పొరలుతోంది.ఆమె తన పడకగదిలోకి వెళ్ళింది. ట్రంకుపెట్టె అడుగున దాచుకుని ఉన్న తన బావ ఫొటో తీసుకుని తదేకంగా చూసింది. తమకంతో ముద్దుపెట్టుకుంది.

'బావా...'మన పెళ్ళి జరగబోతోంది. ఇక నుండి మనం కలిసి జీవించబోతున్నాం. బావా... అమ్మా, నాన్న అత్తయ్య అంతా అందరూ నువ్వు కలెక్టర్ కాబోతున్నావని ఆనందపడుతున్నారు. కాని నాకు మాత్రం నువ్వు కలెక్టర్ కాబోతున్నావన్న ఆనందం కన్నా మన పెళ్ళి త్వరలో జరగబోతోందన్న సంతోషమే ఎక్కువగా ఉంది. నిజానికి నాకు 'కలెక్టర్ భార్య' అనిపించుకోవాలనే కోరిక లేదు. నా బావకు పెళ్ళాం కావాలన్న ఆశ మాత్రం ఉంది. ఆ ఆశ సఫలం కాబోతున్న ఈ సమయంలో ఈ ఆనందం చెలియలికట్ట దాటుతోంది...'

ఫొటోలోని వ్యక్తి తన కళ్లఎదుట సజీవంగా నిలిచినట్టు, అతడితో సంభాషణ జరిపినట్టు ఫొటోతోనే మనసులోని మాటలు చెప్పుకుంది వసుంధర.

మరో రెండు మార్లు ఫొటోను ముద్దుపెట్టుకున్నాక, దాన్ని అతి జాగ్రత్తగా పెట్టె అడుగున దాచింది.

హుషారుగా పెరడులోకి నడిచింది.




ఆమె ముఖంలోని ఉత్సాహాన్ని గమనించి రంగడు ప్రశ్నించాడు "ఏంటి చిన్నమ్మగోరూ... చాలా ఉత్సాహంగా కనిపిస్తున్నారు?"

వసుంధర అతడి వంక అదోలా చూసి "నీకింకా తెలియదా?" అన్నది.

"ఏ విషయం?"

"అదే... చంద్రం బావ కలెక్టర్ కోర్సు పాస య్యాడు"

అతడు విస్మయపడి "నిజమా... చంద్రంబాబు కలెక్టర్ కాబోతున్నాడా?" అన్నా డు ఆనందం మిళితం చేస్తూ.

"నిజం రంగయ్యా... ఇప్పుడే ఉత్తరం వచ్చింది"

రంగయ్య సంతోషంతో ఉక్కిరిబిక్కిరవుతూ "ఈరోజు నాకు చాలా ఆనందంగా ఉందమ్మా. ఆనందం ఎక్కువయినప్పుడు అది వేసుకోక తప్పదమ్మా" అన్నాడు తల గోక్కుంటూ.

"ఏమిటది?" కళ్ళు చికిలిస్తూ అడిగింది వసుంధర.

"అదే..." బలవంతంగా నవ్వుతూ చెప్పా డు- "ఓ చుక్క"

"ఏయ్..." చిరుకోపంగా చూసింది వసుంధర.

రంగయ్య తల దించేస్తూ "ఈ ఒక్కరోజు... ఒక్కరోజేనమ్మా. అదే చంద్రంబాబు కలెక్టర్ కోర్సు పాసయ్యాడన్న సంతోషం భరించలేక... ఒక్క పదిరూపాయలు ఇవ్వండి. ఇవ్వండి చిన్న మ్మా"

అతడు అడిగిన తీరు ఆమెకు నవ్వు తెప్పించింది. అయినా ఆ నవ్వు మనసులోనే అదిమిపెట్టి కోపాన్ని అరువు తెచ్చుకొంది. "తా గటం తప్పుకదా రంగయ్యా"

"మరీ ఎక్కువ ఆనందం కలిగితే ఈ లోకం విడిచి మరో లోకానికి వెళ్ళాలనిపిస్తుంటుంద మ్మా"

"ఇలా నువ్వు అప్పుడప్పుడూ మరో లోకానికి వెళ్ళి రావాలనుకుంటే ఎప్పుడో ఒకసారి శాశ్వ తంగానే మరో లోకం వెళ్ళిపోతావు" కనురు కుంటూ చెప్పింది వసుంధర.

"అందరూ ఎప్పుడో ఒకసారి వెళ్ళిపోవల సిందే కదా?"

"ఎప్పుడో వెళ్తాంకదా అని ముందుగానే వెళ్ళిపోయేందుకు ప్రయత్నిస్తావా?"

అతడు మౌనంగా తలదించుకున్నాడు.

ఆమె అతడిని ఆప్యాయంగా చూస్తూ చె ప్పింది "నువ్వు చాలా పెద్దవాడివి. నీకు చెప్పే వయసు కాదు నాది. అయినా నువ్వు చేసేది తప్పు కాబట్టి చెబుతున్నా తాగుడు అంత మంచిది కాదు రంగయ్యా"

రంగయ్య బదులు పలకలేదు. వసుంధ రకు అతడి మీద జాలి కలిగింది. లోపలికి వెళ్ళి పెట్టెలో నుంచి పది రూపాయల కాగితం తెచ్చి అతడి చేతిలో పెట్టింది.

"రంగయ్యా... బావ పాసయ్యాడన్న ఆనందంతో నీకీ డబ్బు ఇస్తున్నాను. నీకు తాగాలనిపిస్తే వెళ్ళి తాగు. మాట మీద గౌ రవం వుంటే పిల్లలకి ఏదైనా కొనుక్కో... వెళ్ళు"

అతడు ఆమెవంక అభిమానంగా చూసి- "మీ ఇష్టప్రకారమే చేస్తాను చిన్నమ్మా" అన్నా డు.

రంగయ్య వెళ్ళిపోయాడు.

వసుంధర వెళ్ళి మామిడిచెట్టు మొదట్లో కూర్చుంది. కన్నులు మూసుకుని తన బావను ఊహలలోకి తెచ్చుకుంది. అందమైన ఊహల అల్లిక మొదలయింది. మెల్లగా ఆమె ఊహాలో కంలోకి జారిపోయింది.

* * *

గురువారం ఉదయాన్నే శంకరయ్య రైలెక్కా డు.

వెళ్ళబోయేముందు శారదమ్మ ఆయనతో అంది "అబ్బాయి మరికొద్దికాలం ఆగమంటే, మీరందుకు ఒప్పుకోండి మరీ గట్టి పట్టుపట్టి పెళ్ళికి ఒప్పించాలని మాత్రం చూడకండి"

అందుకు శకుంతలమ్మ అభ్యంతరపెడు తూ "మీకు తెలియదు, ఊరుకోండి వదినా!... ఎదిగిన పిల్లను ఎంతకాలమని ఇంట్లో ఉంచు కోగలం? వాడికేం మగమహారాజు. అందులో నూ హెూటల్ తిండి వంటికి బాగా పడిన ట్టుంది. ఇప్పటికీ ఈ నెల కాదు, ఈ సంవత్స

రంకాదు అంటూ వాయిదాలు వేస్తూ వస్తున్నాడు. ఇక ఎంతమాత్రం ఊరుకునేదిలేదు. రాబోతున్న ముహూర్తాలలో ఏదో ఒక ముహూర్తం చూసి ముడిపెట్టేయాలిసిందే" చెప్పింది.

ఆ ఇద్దరి మాటలలో ఎవరి మాటకూ బదులు పలకకుండా, చిరునవ్వు నవ్వి బయలుదేరాడు. పల్లెలో బస్సు ఎక్కి టౌన్‌లో దిగాడు. రైల్వేస్టేషన్ చేరుకున్నాక గంటసేపటికి రైలు వచ్చింది.

కిటికీ పక్కసీటు చూసుకుని కూర్చున్నాడు శంకరయ్య. రైలు కదిలింది. రైలు ముందుకు వెళుతుంటే చెట్లు, కరెంట్ స్థంభాలు వెనక్కు వెళుతున్నాయి. శంకరయ్య సీటులో వెనక్కు వాలి కళ్ళు మూసుకున్నాడు.

తన మేనల్లుడు గొప్పస్థితికి చేరుకోవడం ఆయనకు ఆనందంగా ఉంది. తను అతడిని చదివించడం ద్వారా మంచిపనే చేశానను కుంటున్నాడు. రేపు తన కూతురు కలెక్టర్ భార్యగా పొందబోయే గౌరవం తలచుకుని మురిసిపోతున్నాడు.

సాయంత్రానికి రైలు దిగవలసిన స్టేషన్‌ను సమీపించింది. ఆయన పైకి లేచి చేతిసంచి సర్దుకున్నాడు.

రైలు ఆగింది. ఆయన ప్లాట్‌ఫారం మీదికి అడుగుపెట్టాడు.

బయటకు నడిచాక ఆటో ఎక్కి ఇంటి అడ్రస్ చెప్పాడు.

సూర్యుడు అస్తమించి అప్పటికే అర్ధగంట పైగా అయింది. ఆకాశం చీకటి పరదాల చాటుకు తప్పుకునేందుకు సిద్ధమవుతూ ఉంది. తూర్పుదిక్కునుండి చంద్రుడు పైపైకి ఎగబాకి వస్తున్నాడు. చీకటి పరదామీద తళుకు లీనేందుకు నక్షత్రాలు ఆయత్తమవుతున్నాయి.

పదినిముషాలు ప్రయాణించాక ఆటో ఒక సందులోకి తిరిగింది. ఆయన ఆ ఇంటికి ఒకటీ రెండుసార్లు వచ్చి ఉన్నాడు. కాబట్టి ఇల్లు గుర్తు చెప్పాడు. ఆటో డ్రయివర్ ఆ ఇంటిముందు ఆపాడు.

ఆయన ఆటో దిగి బాడుగ చెల్లించాడు.





గేటు తీసుకుని లోపలికి వెళ్ళాడు. కాలింగ్‌బెల్ నొక్కిన నిముషం తర్వాత తలుపు తెరుచుకుంది.

తలుపు తీసిన చంద్రశేఖర్ శంకరయ్యను చూసి ముఖంలోకి నవ్వు తెచ్చుకున్నాడు. "రా మామయ్యా" అన్నాడు వాకిలికి అడ్డు తప్పుకుంటూ.

శంకరయ్య లోపలికి నడిచాడు. చేతి సంచిని టేబుల్ మీద పెట్టి అక్కడే ఉన్న కుర్చీలో కూర్చున్నాడు.

"ఇప్పుడేనా రావడం మామయ్యా?" తనూ ఆయన ఎదురుగా మంచం మీద కూర్చుంటూ అడిగాడు అతడు.

"ఆఁ... రైలుదిగి తిన్నగా ఇక్కడికే వస్తున్నాను"

"ఇంటి దగ్గర అందరూ బాగున్నారు కదా?"

"అంతా క్షేమమే"

ఇంటి గురించిన వివరాలు అడగటం పూర్తయ్యాక "స్నానం చేయండి మామయ్యా" అన్నాడు చంద్రశేఖర్.

ఆయన తలూపి లేచాడు. పదిగంటలకు పైగా రైలులో ప్రయాణం చేయడంతో ఒళ్ళంతా బద్ధకంగా ఉంది. ఆయన ఇస్త్రీ బట్టలు సంచిలోనుండి తీసుకోసాగాడు.

చంద్రశేఖర్ వెళ్ళి బాత్‌రూమ్‌లో నీళ్ళుపెట్టి వచ్చాడు. సబ్బు, టవల్ ఆయనకు అందించాడు.

ఆయన బాత్‌రూమ్‌లో దూరి తలుపు వేసుకున్నాడు. తన మామయ్య ఇప్పుడెందుకొచ్చాడా అని ఆలోచిస్తూ కుర్చీలో కూర్చున్నాడు చంద్రశేఖర్.

పది నిముషాల తర్వాత శంకరయ్య స్నానం ముగించుకుని ఇవతలకు వచ్చాడు. ఆయనను వెంటబెట్టుకుని హోటల్‌కు వెళ్ళాడు అతడు. హోటల్‌లో భోంచేస్తున్నప్పుడు ఆయన "ఈ హోటల్ తిండి తినే ఖర్మ నీకింకా ఎన్నాళ్ళోయ్?" అన్నాడు.

చంద్రశేఖర్ మౌనంగా ఉన్నాడు.

"నీకీ ఖర్మ తప్పించాలనే నేనిప్పుడు వచ్చింది"

ఆమాటతో ఆయన వచ్చిన కారణమేమిటో

అర్థమయిపోయింది చంద్రశేఖర్‌కు. కాని విషయం చెప్పమని రెట్టించలేదు అతడు. విషయం ప్రస్తావించడానికి అది సరయిన చోటుకాదని ఆయన కూడా మౌనంగా ఉండిపోయాడు.

భోంచేసి గదికి తిరిగి వచ్చాక ఆయనకు మాట్లాడే ఓపికలేకపోయింది. ప్రయాణ బడలిక ఎక్కువగా ఉండటం చేత నిద్ర ముంచుకు రాసాగింది అది గమనించిన చంద్రశేఖర్ ఆయనకు పడక ఏర్పాటు చేసాడు. శంకరయ్య ఆ మంచం మీద పడుకుని నిద్రలోకి జారుకున్నాడు.

తెల్లవారింది.

శంకరయ్య లేచి దంత ప్రక్షాళన, స్నానంగట్రా పూర్తిచేశాడు. అల్లుడు అందించిన కాఫీ తాగుతూ తను వచ్చిన కార్యం గురించిన చర్చలోకి దిగాడు.

"నువ్వు చదవాలనుకున్న చదువులన్నీ పూర్తయ్యాయి. ఇక నీ బాధ్యత పెళ్ళి ఒక్కటి మాకు మిగిలివుంది. అది కాస్తా జరిపించేస్తే..."

తూర్పునుండి వచ్చే వెలుగురేఖలు కిటికీలోనుండి దూసుకువచ్చి లోపల పడుతున్నాయి. పక్కింటి గోడ గడియారం ఏడుసార్లు కొట్టింది.

శంకరయ్యకు ఎదురుగా మంచంమీద కూర్చుని ఉన్నాడు చంద్రశేఖర్. వచ్చిన సమస్యను ఎలా వదిలించుకోవాలా అని ఆలోచించసాగింది అతడి మెదడు. పెద్ద చదువులు చదివి, ఎన్నెన్నో ఇంటర్వ్యూలకు హాజరయి వేగంగా ఆలోచించడం అలవాటు కావడం వలన క్షణాలలో జవాబేం ఇవ్వాలో ఆలోచించేశాడు.

"మామయ్యా... నాకూ హోటల్ తిండి వినుగేసింది. పెళ్ళిచేసుకోవాలని అనిపిస్తోంది కాని"... ఆగాడతను.

"...కాని... అడ్డమేమొచ్చింది నీకు?..."

అతడు కాసేపు మౌనంగా ఉండి తర్వాత అన్నాడు "ఈ విషయం మీకు ఎలా చెప్పాలో అర్థం కావడంలేదు"

అప్పటికీ ఆయనకు ఎలాంటి అనుమానం రాలేదు. "నాదగ్గర దాచుకోవలసిన అవసరం ఏముంది? నీ ఇబ్బందేమిటో చెప్పు?"

"ఇబ్బంది కాదు... తప్పనిసరి పరిస్థితి. చెబితే మీరు అర్థంచేసుకోగలరో లేదో అన్నదే నా అనుమానం"

"చెప్పు" అన్నారాయన.

"నేను... నేను ఇక్కడ ఒక అమ్మాయిని ప్రేమించాను."

అడుగుదూరంలో బాంబువడ్డట్టుగా అదిరిపడ్డాడు శంకరయ్య. అయినా తన చెవులు తనను మోసం చేస్తున్నాయేమోనని అనుమానం కలిగి నివృత్తికోసం చంద్రం వంక చూశాడు. అతడు తలదించుకునే ఉన్నాడు.

"రేయ్ చంద్రం... నువ్వు అన్నదేమిటి?"

చంద్రశేఖర్ మనసులో కొద్దిగా భయం ప్రవేశించింది. తన మేనమామ ఎంతటి ఆప్యాయత చూపిస్తాడో అంతటి కరకుదనం కూడా చూపించగలడన్నది అతడికి తెలుసు.

అయినా ఆయన కరకుతనం తననిప్పుడు ఏంచేయగలదు? తనిప్పుడు గొప్ప ఆఫీసరు కాబోతున్న వ్యక్తి. ఎవరికీ భయపడవలసిన పనిలేదు. లేని ధైర్యాన్ని కొనితెచ్చుకున్నాడు అతడు.

దీర్ఘంగా ఊపిరిపీల్చి వదులుతూ చెప్పాడు "నా మీద ఆశలు వదులుకుని మీరు మన వసుంధరకు ఇంకో సంబంధం చూడండి మామయ్యా"

ఆయన ముఖం నెత్తురు చుక్కలేనట్టుగా తెల్లగా పాలిపోయింది. అతడు చెప్పిన ఆ రెండు వాక్యాలుతోనే భూమి గిర్రున తిరిగిపోతే ఆయన స్తబ్దుడైపోయాడు. కొద్ది క్షణాలవరకూ నోటమాట రాలేదు.

నిముషం తర్వాత మెల్లగా గొంతు పెగల్చుకుని "అదేమిట్రా... ఇది చిన్నప్పటినుండీ అనుకున్న సంబంధం. నీకూ, వసుంధరకూ పెళ్ళి జరిగితే చూడాలని నేనూ, మీ అమ్మ ఎంతో ఆశతో ఉన్నాం" అన్నాడు. అలా చెపుతుంటే ఆయన గొంతు జీరపోయింది.

"మీ ఆశను నిరాశ చేస్తున్నందుకు నాకూ చాలా బాధగా ఉంది. కానీ... నేనిక్కడ ఆ

అమ్మాయికి మాట ఇచ్చాను. త్వరలో మేమి ద్దరం పెళ్ళిచేసుకోవాలని అనుకుంటున్నాం''

శంకరయ్యకు ఆత్మాభిమానం ఎక్కువ. తను పోషిస్తే పెరిగి పెద్దయినవాడిముందు చెయ్యిచాచి బ్రతిమలాడడం అయనకు ఇష్టంలేకపోయింది. అంతేకాదు. 'నేను నిన్ను పెంచిపెద్ద చేశాను, కష్టపడి చదివించాను కాబట్టి ఇది నీ బాధ్యత' అని చెప్పాలనిపించ లేదు కూడా. కృతఘ్నులతో ఎక్కువగా మాట్లా డటం ఎలా? అయినా చివరి రెండుమాటలూ అతికష్టంమీద మాట్లాడగలిగాడు.

''ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకోవాలన్నది నీ స్థిరనిర్ణయమా చంద్రం''

'అవునని' నోటితో చెప్పలేక తల నిలువుగా ఆడించాడు అతడు.

అలా నిర్ణయం తీసేసుకున్నాక ఇక బతిమ లాడి కూడా ప్రయోజనం ఉండదని ఆయనకు తెలుసు. అందుకే ఆ సంభాషణను అక్కడికి ముగిస్తూ చెప్పాడాయన... ''మంచిది నాయనా... కొత్తగా పరిచయమైన ఆ అమ్మాయి కి మాట ఇచ్చావు. ఆ మాట నిలబెట్టుకోవడం కోసం తాపత్రయపడుతున్నావు. అదీ సరయిన దే. కాకపోతే చిన్నప్పుడే నీ పోషణ బాధ్యత చేతికి తీసుకుని, వేలకువేలు నీ చదువుకోసం వెచ్చించేప్పుడు నీ దగ్గరనుండి ఇలాంటి మాట తీసుకుని ఉండకపోవడం నాతప్పే. నా మేనల్లుడు నా మాటను జవదాటడు అనుకో వడం నా పొరపాటు. నా చెల్లెలి కొడుకు కృతఘ్నుడవుతాడని ఊహించలేకపోవడం నా నేరం... ఈ తప్పులన్నీ నా పక్షాన పెట్టుకుని



నిన్ను నిందించడం భావ్యంకాదు. నీ కూతుర్ని చేసుకోను అని నువ్వు నా ముఖానే చెప్పాక ఈ శంకరయ్య ఇక నిన్ను బతిమిలాడబోడు. ఎవరినో బతిమలాడి నా కూతుర్ని కట్టబెట్టే స్థితిలో లేను నేను. ఈ శంకరయ్య తన కూతురుకి



కలెక్టర్ అల్లుడిని తీసుకు రాలేకపోవచ్చేమో గానీ ఒక మంచి సంబంధం చూసి పెళ్ళిచేయకుండా ఉండిపోయేంత అసమర్థుడు కాదు... వస్తాను'' అంటూనే లేచాడు ఆయన.

చంద్రశేఖరం 'ఆగు మామయ్యా' అన్నా ఆగలేదు. బట్టలు సర్దుకుని వెంటనే బయలుదేరాడు.

ఆయన వీధివాకిలి దాటుతుండగా భానుమూర్తి ఎదురయ్యాడు. వారిద్దరికీ పరిచయం లేదు కాబట్టి ముఖాలు మాత్రం చూసుకున్నారు. శంకరయ్య కన్నులలో నీరు సుడులు తిరుగుతుండటం గమనించాడు భానుమూర్తి. ఆయన ఎవరో, ఆ బాధ ఎందుకో భానుమూర్తికి తెలియదు.

అతడు లోపలికి వెళ్ళేసరికి చంద్రశేఖర్ కుర్చీలో కూర్చుని పైకప్పువంక దీర్ఘంగా చూస్తున్నాడు. మిత్రుడిని అలా చూడటం భానుమూర్తికి అదే మొదటిసారి.

''హలో చంద్రా''

పిలుపుకు ఉలికిపడి అటువైపు చూశాడు చంద్రశేఖర్. భానుమూర్తిని చూసి అదోలా నవ్వాడు. ''హలో భానూ... ఏమిటి ఉదయాన్నే ఇలా వచ్చావు?''

''ఈ రోజు నేను బ్యాంక్‌కు రావడం లేదు. బంధువుల పెళ్ళికి అనుకోకుండా వెళ్ళాల్సివచ్చింది. ఈ విషయం మేనేజర్‌కి చెప్పి ఈ లీవ్ లెటర్ ఇవ్వాలి. అందుకే వచ్చాను. చెబుతావు కదా?''

''వైనాట్... తప్పకుండా చెబుతాను''

భానుమూర్తి కుర్చీలో కూర్చున్నాడు. చంద్రం వంక అదోలా చూసి ''చంద్రా ఏమిటి ఏదోలా కనిపిస్తున్నావ్?'' ప్రశ్నించాడు.

''ఎలా కనిపిస్తున్నాను?''

''ఏదో బాధలో మునిగిఉన్నట్టు''

''అలాంటిదేమీ లేదు'' నవ్వేశాడు చంద్రశేఖర్ వాతావరణాన్ని తేలిక చేయడానికి ప్రయత్నిస్తూ.

కాని భానుమూర్తి వదలలేదు- ''చంద్రం... ఇప్పుడు వచ్చి వెళ్ళినాయన ఎవరు?'' అడిగాడు అతడు.

''మా మామయ్య'' బదులిచ్చాడు చంద్రశేఖర్.

''అంటే వసుంధర తండ్రిగారేనా?'' అనుమానంగా ప్రశ్నించాడు.

''అవును''

''ఏమిటట విశేషం... చూస్తుంటే మీ మధ్య ఏదో క్లాష్ వచ్చినట్లుగా అనిపిస్తోంది నాకు. ఆయనేమో కళ్ళనీరు పెట్టుకుంటూ వెళుతున్నాడు. నువ్వేమో ఇంటిలో దిగులుగా కూర్చుని ఉన్నావు... అసలు జరిగిందేమిటి?''

మిత్రునికి ఏం చెప్పాలో తోచలేదు చంద్రశేఖరానికి. తను మామయ్యతో అన్నమాటలు యథాతథంగా అతడికి వినిపిస్తే అతడు తనను కృతఘ్నుడని అసహ్యించుకుంటాడేమో? అందుకే తను ఈ విషయాన్ని ఎలా చెప్పాలి? తనవైపు వాదనలో కాసింత వాస్తవం ఉందని మిత్రుడిని ఎలా నమ్మించాలి అని ఆలోచించసాగాడు చంద్రశేఖర్.

ఆలస్యాన్ని భరించలేని భానుమూర్తి ''చెప్పు చంద్రం... ఏం జరిగిందో నిజం చెప్పు'' అంటూ బలవంతం చేయసాగాడు.

ఇక తప్పదన్నట్టుగా నోరు తెరిచాడు చంద్రశేఖర్. ''నా పెళ్ళి గురించి నాకు, మామయ్యకు మనస్పర్థలు వచ్చాయి''

''ఎలా... ఆయన వసుంధరగారిని నీకు ఇచ్చి పెళ్ళిచేయనన్నాడా?'' ఆతృతగా ప్రశ్నించాడు భానుమూర్తి.

అతడికి ఏం సమాధానం ఇవ్వాలో తోచలేదు చంద్రశేఖరానికి. మూడేళ్ళక్రితం తను వసుంధరను పెళ్ళి చేసుకోవడం తన అదృష్టంగా భావించేవాడు. తన అదృష్టానికి మురిసిపోతూ ఆ విషయం ఈ మిత్రుడికి చెప్పుకునేవాడు. వసుంధర నుండి వచ్చే భావుకతతో నిండిన అందమైన ప్రేమలేఖలు ఆనందంతో భానుమూర్తికి చూపించేవాడు... ఇప్పుడు తన స్థితి మారింది. వసుంధరను పెళ్ళిచేసుకోవడం తన స్టేటస్‌కు తగినట్టుగా అనిపించడంలేదు. కాని ఈ విషయం తనవైపు నుండి ఆలోచిస్తే సరిగా ఉండొచ్చేమోగాని, నిష్పక్షపాతంగా ఆలోచిస్తే 'తప్పు' అని మాత్రం అనిపించకమానదు.

అయితే తప్పనిసరయి చెప్పాడు ''లేదు...





నేనే వసుంధరను చేసుకోవడంలేదని చెప్పేశాను''

అతడు ఆశ్చర్యపోయాడు. ''ఎందుకలా చెప్పావు... నువ్వు ఆమెను ప్రేమించావు కదా?''

చంద్రశేఖరం నీళ్ళు నమిలాడు. ''ప్రేమించాను అంటే... ఒకప్పుడు ఇష్టపడిన మాట వాస్తవమే. ఆమెను పెళ్ళి చేసుకోవాలని కూడా అనుకున్నాను. కాని ఇప్పుడు నా స్టేటస్ దృష్ట్యా ఆలోచిస్తే ఒక పల్లెటూరి అమ్మాయిని పెళ్ళాడడం అంత తెలివైనపనిగా అనిపించడం లేదు''

'స్టేటస్', 'తెలివైనపని' అన్న పదాలు చంద్రం నోట వినిపించడంతో కొత్తగా చూశాడు మిత్రుడివంక. ఎంత పైస్థితికి ఎగబాకినా నిన్న ఇష్టపడ్డ అమ్మాయిమీద ఈ రోజు అకారణంగా అయిష్టం ఎలా కలుగుతుందో అతడికి అర్థం కాలేదు. ఇతగాడి ప్రేమ స్థితినిబట్టి మారే క్షణికమైన ప్రేమా? అని విస్మయపడ్డాడు. ఎంతో అభిమానం, భావుకత రంగరించి ఆ బ్రహ్మదేవుడు అప్యాయంగా తీర్చిదిద్దిన బొమ్మ వసుంధరను పెళ్ళాడలేకపోవడం ఇతగాడి దురదృష్టం అని కూడా అతడికి అనిపించింది... అసలు చంద్రం మనసులోని ఉద్దేశమేమిటో పూర్తిగా తెలుసుకోవాలనుకున్నాడు అతడు.

''నీ మనసులోని అభిప్రాయమేమిటో నాకర్థం కావడం లేదు చంద్రం''

చంద్రశేఖర్ అన్నాడు ''ఇందులో అర్థం కాకపోవడం ఏముంది? నాకు చిన్నప్పటినుండీ గొప్పస్థితికి ఎగబాకాలనే ఆశ ఉండేది. ఆ పట్టుదలతోనే నేనీనాడు ఈ స్థాయికి చేరుకోగలిగాను. కాని ఈ స్థాయికూడా నాకు తృప్తి కలిగించడం లేదు. నేను ఐ.ఎ.యస్ ఆఫీసర్ని కావడమే కాదు నా సంబంధీకులు కూడా ఉన్నతస్థాయికి చెందినవారయి ఉండాలనే ఆశ నాది ఈ రోజు నేను వసుంధరను పెళ్ళాడితే రేపు ఎవరయినా 'కలెక్టర్‌గారూ... మీ ఆవిడ ఎంతవరకూ చదువుకుందీ' అంటే 'పదవతరగతి' అని జవాబివ్వడం ఎంత ఇన్సల్టింగ్‌గా ఉంటుందో ఆలోచించు.

''అలాగే నలుగురు ప్రముఖులమధ్య నిలబడినప్పుడు 'మీ మామగారు ఏంచేస్తారని ఎవరయినా ప్రశ్నిస్తే మా మామగారు పొలంపని చేసుకుంటారు' అని చెప్పుకోవడం నాకు చిన్నతనం అనిపిస్తుంది. అందుకే నాకు కాబోయే భార్య మంచి చదువు చదివి ఉండాలి నా మామగారికి సమాజంలో మంచి స్టేటస్ ఉండాలి- ఇదే నా కోరిక. ఈ కోరికతోనే నేను వసుంధరను వద్దనుకుంటున్నాను. మరో అమ్మాయిని ప్రేమించి, మాట ఇచ్చానని అబద్ధంచెప్పి మామయ్య నుండి తప్పించుకున్నాను''

అంతా విన్న భానుమూర్తి చంద్రంను చూసి ''ఓరీ నికృష్ట మానవాధముడా'' అనుకోకుండా ఉండలేకపోయాడు. చదివించినవారి మనసును కష్టపెట్టావు; ప్రేమించిన పడతి మనసును గాయపరుస్తున్నావు. ఎంతో చదువుకున్నావు... ఎందుకు నీ చదువు తగలెయ్యనా? నీలాంటి కృతఘ్నులు ఎంత గొప్ప స్థాయికి వెళ్లినా నీచబుద్ధులు మానుకోలేరు.

భానుమూర్తి కొద్దిక్షణాలు మౌనంగా ఉండి తర్వాత చెప్పాడు. ''చూడు చంద్రం... జీవితంలో ఎంత సంపాదించాం, ఏ స్థితిలో ఉన్నాం అన్నది ముఖ్యంకాదు. ఒకవేళ సమాజానికి ఆ రెండూ అవసరమేగాని మన మనసుకు సంబంధించి ఒకరయినా మనను ప్రేమించే మనిషి ఉండాలని కోరుకోవడం మంచిది. ఈరోజు మన స్థితిని చూసి దగ్గరయ్యేవారు చాలామంది ఉండొచ్చు కాని మనలను వ్యక్తిగా అభిమానించి ఆరాధించేవారు ఎవరూ ఉండరు. వసుంధర ఈరోజు నువ్వు కలెక్టర్ కాబోతున్నావని నిన్ను పెళ్లిచేసుకోవాలనుకోవడంలేదు. ఆమె నీకు ఏ స్థితీ లేనినాడు కూడా నిన్ను నిన్నుగా ప్రేమించింది. తనను ప్రేమించే స్త్రీని పెళ్లాడినవాడు తప్పకుండా సుఖపడతాడు. ఎవరో ముక్కూముఖం తెలియని యువతిని పెళ్లాడి, ఆమె మనస్తత్వంతో అడ్జస్ట్ అయ్యేందుకు ప్రయత్నించడంకన్నా నువ్వు ఎరిగిన నీ వసుంధరను పెళ్లాడడం ఎంతో మంచిది. ఓ మంచి మిత్రునిగా, నీ మేలు కోరేవాడిగా ఈ సలహా ఇస్తున్నాను... నా మాట విను''

చంద్రశేఖర్ తల అడ్డంగా ఆడించాడు ''సారీ భానూ! ఈ విషయంలో నా నిర్ణయం

ఎట్టి పరిస్థితిలోనూ మార్చుకోలేను''

అంత ఖచ్చితంగా చెప్పేవాడిని ఇక మార్చడం ఎలా? అందులోను తెలివైన మూర్ఖుడి మనను మార్చడం చాలా కష్టం.

అతడు భుజాలెగరేశాడు. ''ఆల్‌రైట్ నేను చెప్పదలచుకున్న విషయం చెప్పాను. అందులోని మంచీచెడు తెలిసి మసలుకోవలసినవాడివి నువ్వే''

ఇద్దరి మధ్యా కాసేపు నిశ్శబ్దం.

మరికాసేపు కూర్చుని ''వస్తాను చంద్రం'' అని చెప్పి ఆ రూమ్‌నుండి ఇవతలకు వచ్చేశాడు భానుమూర్తి.

అతడి మనసిప్పుడు వసుంధర గురించే ఆలోచించసాగింది.

★ ★ ★

వీధి మలుపు తిరిగాక మెయిన్‌రోడ్ ఎక్కాడు శంకరయ్య. వెళుతున్న ఆటోను ఆపి ఎక్కికూర్చున్నాక ''రైల్వేస్టేషన్ పోనివ్వు'' అన్నాడు.

ఆటో ముందుకు కదిలింది. ఆయన భారంగా వెనక్కు వాలాడు.

ఆఫీసులకెళ్లే టైము కావడంతో రోడ్డుమీద విపరీతమైన రద్దీ. ఆటో డ్రైవర్ తన వాహనాన్ని తోటి వాహనాల మధ్యనుండి తప్పిస్తూ ముందుకు తీసుకెళ్లేందుకు ప్రయత్నిస్తున్నాడు. అది ఏ క్షణాన ఎక్కడ బోల్తా పడిపోతుందోనన్నంత భయం కలుగుతుంది చూసేవారికి.

అయితే శంకరయ్యకి ఇదేమీ పట్టడంలేదు. ఆయన తనకు సంభవించిన బాధలో మరో లోకానికి వెళ్లిపోయారు. వేదన మనసును పట్టి కుదుపుతోంది. ఎంత ఆపుకోవాలని ప్రయత్నిస్తున్నా కన్నీటి ముత్యాలు ఆగకుండా కనుకొలకులనుండి బయటపడుతున్నాయి. ఆయన భుజంమీది కండువాతో ఆ కన్నీటిని తుడుచుకుంటున్నాడు.

'ఈ విషయం ఇంట్లో ఎలా చెప్పాలి? ముఖ్యంగా తన బావమీద ఎన్నో ఊహలు అల్లుకుని ఉన్న వసుంధరకు ఈ విషయం తెలపడం ఎట్లా? అసలే దానిది ఎంతో సున్నిత హృదయం. ఈ విషయం విని ఆ లేతగుండె తట్టుకోగలదా? తను ఏనాడూ ఊహించలేదు చంద్రం ఇలాంటి ఘాతుకానికి ఒడిగట్టగలడని...'

''సార్... రైల్వేస్టేషన్ వచ్చింది'' ఆటో డ్రైవర్ పిలుపుతో ఈ లోకంలోకి వచ్చాడు శంకరయ్య.

సీటులోనుండి దిగి ఆటోకి డబ్బు ఇచ్చాడు. ఆటోవాడు అందించిన చిల్లర జేబులో వేసుకుని స్టేషన్ లోపలికి నడిచాడు. కౌంటర్‌లో టిక్కెట్ తీసుకుని ప్లాట్‌ఫారంమీదికి వెళ్లాడు.

ఆయనకు చాలా నీరసంగా ఉంది. నిలబడేందుకుకూడా ఓపిక లేదు. ప్లాట్‌ఫారంమీదున్న కాంక్రీట్ బల్లమీద కూర్చున్నాడు.

రెండుగంటల నిరీక్షణ తర్వాత రైలు వచ్చి ప్లాట్‌ఫారంమీద ఆగింది. ఆయన రైలెక్కి కూర్చున్నాడు.

కూత వేశాక రైలు కదిలింది. ప్లాట్‌ఫారంమీది జనం మెల్లగా దూరం అవుతున్నారు.

ఆయన పరిసరాలు గమనించనంతగా ఆలోచనల్లో మునిగిపోయాడు. ఉదయం తాగిన కాఫీయేతప్ప మధ్యాహ్నం భోజనంకూడా చేయలేదు. రైలు దిగి బస్సెక్కి పల్లెకు చేరుకునేసరికి రాత్రి పదిగంటలయింది.

శారదమ్మ నీళ్లుతోడి స్నానంచేయమంటే వద్దన్నాడాయన. భోంచేయమని పీటవాలిస్తే ఆకలి లేదు అని చెప్పాడు. ఎవరేం మాట్లాడినా పలక్కుండా తన గదిలోకి వెళ్లి మంచంమీద పడుకుని తిరిగే సీలింగ్ ఫాన్ వంక దీర్ఘంగా చూడసాగాడు.

ఆయన ముఖంలోని నిస్తేజత, చేష్టలు ఆ ఇంటిలోవారికి అనుమానం కలిగించింది. మొత్తం మీద ఏదో జరిగిఉంటుందనుకున్నారు. ఏంజరిగివుంటుందో మాత్రం ఊహించలేకపోయారు. 'చంద్రశేఖరం వసుంధరను వద్దంటాడన్న' ఆలోచన వారెవరికీ రాలేదు. వారు చంద్రశేఖరాన్ని అంత బాగా నమ్మి ఉన్నారు.

ఆ రాత్రి ఆ ఇంటిలోనివారంతా సతమతమయ్యే గుండెలతో గడిపారు.

తెల్లవారింది. శంకరయ్య తన గదిలోనుండి బయటకు రాలేదు. వదిన, ఆడపడుచు కాసేపు గుసగుసలాడుకున్నాక శకుంతలమ్మ కా




స్త భయంగానే అన్నగారి గదిలోనికి వెళ్ళింది.

ఆయన చెల్లెలివంక నిస్తేజంగా చూశాడు. ఆమె ఆయనకు ఎదురుగా గోడకు ఆనుకుని నిలబడి అడిగింది.

"వెళ్ళివచ్చిన పనేమయిందన్నయ్యా?"

ఆయన బదులు పలకలేదు. శారదమ్మ వాకిట దగ్గర నిలబడి లోపలికితొంగి చూస్తోంది. వసుంధర తల్లి పక్కనే నిలబడి తండ్రి జవాబుకోసం ఆతృతగా ఎదురుచూస్తోంది.

"మీరిలా మౌనంగా ఉండిపోతే మాకు కంగారుగా ఉంది. అసలు అక్కడ ఏం జరిగిందో చెప్పకపోతే ఎలా?"

ఆయన చాలా మామూలుగా చెప్పాడు. "ఏముంది... నీ కొడుకు వసుంధరను పెళ్ళిచేసుకోలేనని తెగేసి చెప్పాడు"

శ్రోతలు ముగ్గురు అదిరిపడ్డారు. ఊహించని పరిణామం అది.

"వాడు... వాడు అలా ఎందుకన్నాడు?" అడిగింది శకుంతలమ్మ.

"తనో అమ్మాయిని ప్రేమించాడట... ఆమెకు పెళ్ళిచేసుకుంటానని మాట ఇచ్చాడట"

ఒక్కసారిగా ఆ గదిలో గాఢమైన నిశ్శబ్దం అలుముకుంది. జరిగిన వాస్తవాన్ని జీర్ణించుకునేందుకు వారికి సమయం పట్టింది.

శంకరయ్య జరిగిందంతా వారికి వివరించాడు. అందరి ముఖాలలో దుఃఖం కదలాడింది. వసుంధరకు మాత్రం ఈ ప్రపంచమే తల్లక్రిందులయింది. ఆమె కట్టుకున్న ఊహాసౌధాలు తుఫానుగాలికి విరిగిపడిన వృక్షాల్లా కూలిపోయాయి. ఆమె తొలివలపు పుష్పంరేకులు స్వార్థమనే పెనుగాలికి కదలాడి రాలిపోయాయి.

వసుంధర పరిగెత్తుకుంటూ వెళ్ళి తన పడకగదిలోని మంచం మీద బోర్లా పడుకుంది. గుండెలోతులనుండి దుఃఖం ఎగదన్నుకు వస్తుంటే ఆ లేతగుండెకు ఆపుకోవడం చేతకాలేదు. ఆమె వెక్కివెక్కి ఏడవసాగింది.

తమ్ముడు రాము ఆ ఏడుపు చూశాడు. పక్కగదిలోనికి వెళ్ళి అమ్మతో "అక్కయ్య ఏడుస్తోందమ్మా" అన్నాడు.

అక్కడివారందరికీ తెలుసు వసుంధరకు తన బావ అంటే ఎంత ఇష్టమో. ఆమె అతడిని పెళ్ళిచేసుకోవాలని ఎలాంటి కలలు కంటుందో కూడా వారికి తెలుసు. ఆమె కలలు కల్లలయితే... ఏంచేయాలో వారికి తోచలేదు. కూతుర్ని ఓదార్చేందుకు శారదమ్మ వసుంధర గదివైపు వెళ్ళింది. ఆ గదిలో అన్నాచెల్లెళ్ళు మాత్రమే మిగిలారు.

"వాడంతటి కృతఘ్నుడవుతాడనుకోలేదు" కొడుకును అసహ్యించుకుంది శకుంతలమ్మ.

"పాపం... ఆ అమాయకపు పిల్ల తన బావ మీద ఎన్నో ఆశలు పెంచుకుంది. అవన్నీ ఒక్కసారిగా కూలిపోతే అమ్మాయి ఈ బాధ తట్టుకోలేదేమోనని నా అనుమానం..." చెప్పాడాయన ఆవేదనగా.

"ఎందుకయినా మంచిది నేను ఒకసారి వెళ్ళి వాడిని వివరం కనుక్కుని వస్తాను"

"వద్దులేమ్మా... వాడికి ఇష్టంలేని పెళ్ళిచేయడం అంత మంచిదికాదు"

"ఇష్టంలేని పెళ్ళిచేయాలనికాదు. అసలు విషయం ఏమిటో కనుక్కుంటాను. ఒకవేళ వాడు తప్పుదారినుండి బయటకు రావాలని అనుకోగలిగితే వప్పించి తీసుకువస్తాను"

ఆయన మనసులో కూడా ఏ మూలనో ఆశ మిణుకుమిణుకుమంటోంది. కాబట్టే మరింత బెట్టు చేయకుండా ఆమె మాటకు అంగీకరించాడు.

ఆ మర్నాడే శకుంతలమ్మను బస్సు ఎక్కించాడు.

అయితే రెండోరోజుకు ఆమె గోడకు కొట్టిన బంతిలా తిరిగివచ్చింది. ఆమె ముఖం మహా భారంగా ఉంది.

"అన్నయ్యా... ఇకనుండి వాడికీ మనకూ సంబంధం తెగిపోయింది... పోషించి, చదివించిన మేనమామను మోసం చేసినవాడితో, కన్నతల్లి మాట విననివాడితో ఎలాంటి సంబంధం పెట్టుకోవడం నా కిష్టంలేదు. వాడు నన్ను తనదగ్గరే ఉండమని బతిమిలాడినా, ఆ ముఖం చూడటం ఇష్టంలేక 'ఇక నీకూ-నాకూ తెగిపోయింది' అని ఖచ్చితంగా చెప్పేసి వచ్చాను"



ఆ మాటలతోనే అక్కడ ఏంజరిగి ఉంటుందో అర్థమయిపోయింది అయనకు. ఎక్కడో మిణుకుమిణుకుమంటున్న ఆశకూడా ఆరిపోయింది.

ఆ ఇంటిలోని వ్యక్తులందరి మనసులలో వేదన. వసుంధర ఆ గదిదాటి ఇవతలకు రావడంలేదు. మిగతావారు ఒకరినొకరు పలకరించుకుంటున్నా మునుపటి సంతోషం ఆ ఇంటిలో మాయమయింది.

కలెక్టర్ కాబోతున్న చంద్రశేఖరంకు, వసుంధరకు పెళ్ళి జరగబోతుందని, ఆమె చాలా అదృష్టవంతురాలని అనుకుంటున్నారు గ్రామస్తులు. ఈ విషయం తెలియడంతో గ్రామస్తులంతా వసుంధరమీద జాలిపడ్డారు. శంకరయ్య దురదృష్టానికి చింతించారు. చంద్రశేఖరం కృతఘ్నతను ఈసడించుకున్నారు.

జరిగినదాంట్లో తన తప్పులేకపోయినా శంకరయ్య మునుపటిలా వీధిలో తలెత్తుకుని తిరగలేకపోయాడు. ఏదో ఘోరమైన నేరం చేసినవాడిలా మనుమలను తప్పించుకుని తిరగసాగాడు.

ఆ ఇంటిలోని వ్యక్తుల ముఖంలో దైన్యంలాంటిది చోటుచేసుకుంది.

శకుంతలమ్మ కొడుకును అడిగొచ్చిన రెండో రోజుకు వసుంధరకు జ్వరం వచ్చింది. ఆహారం నయించడంలేదు. ఒళ్లంతా సెగలు కక్కుతోంది. ఆమె నీరసంగా పడుకుని ఉంది. అప్పుడప్పుడు మగతగా నిద్రవచ్చేది. ఆ నిద్రలో ఆమె కలవరించేది, ఒక్కొక్కసారి నిద్రలోనే అరిచేది.

శంకరయ్య ఎదురింట్లో కొత్తగా దిగిన గవర్నమెంట్ డాక్టర్ని పిలుచుకువచ్చాడు. అతడు ఆమెను పరీక్ష చేశాక ఇంజక్షన్ ఇచ్చాడు. నిద్రమత్తులోనే అమ్మా అంటూ మూలిగింది వసుంధర. గుడ్డను నీళ్లతో తడిపి ఆమె నుదుటన ఉంచాడు.

ఆ స్పర్శతో ఆమె కొద్దిగా కదిలి మేలుకుంది. కళ్లు తెరచి తన చుట్టూ ఉన్నవారిని చూసింది. అమ్మ, నాన్న, అత్తయ్య, తమ్ముడు, రంగయ్య... మరో అపరిచితుడు. ఎవరతడు?

వసుంధర అతడి వైపు పరీక్షగా చూసింది.

అతడికి ఇరవై ఐదు ముప్పయ్యేళ్ల మధ్య వయసు ఉండొచ్చు. ఎత్తుగా, అందంగా, హుందాగా ఉన్నాడు. తెల్లని బట్టలలో శాంతిచిహ్నంలా కనిపించాడు. తను ఎదురింటి డాక్టర్ అని అర్థమయింది.

ఆమె కన్నులు తెరవడం చూసి అతడు ఆప్యాయంగా నవ్వాడు- "గుడ్... కళ్లు తెరిచారా? కాస్త మీ టెంపరేచర్ చూడాలి. ఈ థర్మామీటర్ మీ నోట్లో పెట్టుకోగలరా?" నమ్రతగా అడిగాడు.

అతడు అందించిన థర్మామీటర్ నోట్లో పెట్టుకుంది. తిరిగి తన స్వంతవేదన గురించి తలచుకుంటూ నిశ్శబ్దంగా కన్నులు మూసుకుంది.

కొద్దిసేపటి తర్వాత అతడు థర్మామీటర్ చేతిలోకి తీసుకున్నాడు. టెంపరేచర్ చూశాడు. శంకరయ్య వంక తిరిగి చెప్పాడు-

"జ్వరం కాస్త ఎక్కువగానే ఉంది. ఇప్పుడు వాడిన ఇంజక్షన్ వలన రాత్రిలోగా తగ్గిపోతుంది. అదికాక టాబ్లెట్స్ రాసిస్తాను. అవి తెప్పించుకుని వాడండి. పోతే పేషెంట్ చాలా నీరసంగా ఉంది. బలమైన ఆహారం తినిపించాలి. లేకపోతే త్వరగా కోలుకోవడం కష్టం అవుతుంది"

డాక్టర్ చెప్పినదంతా శ్రద్ధగా విన్నాడు శంకరయ్య "అలాగే డాక్టర్" అన్నాడు.

అతను ప్రిస్క్రిప్షన్ పాడ్‌మీద నాలుగు రకాల టాబ్లెట్స్, టానిక్‌లు రాసిచ్చి అవి వాడే విధానం చెప్పాడు. వివరాలన్నీ చెప్పాక అతడు లేచాడు. "దగ్గరలోనే ఉన్నాను కాబట్టి, మీకే సమయంలో అవసరంపడినా మొహమాట పడకుండా నా దగ్గరకు రండి. నేను ఉండేది మీలాంటివారి సేవకోసమే" అన్నాడు.

శంకరయ్యకు అతడి నమ్రత చాలా నచ్చింది. ఆయన అతడిని వీధివరకూ సాగనంపి తిరిగివచ్చాడు.

గదిలోనికి వచ్చాక భార్యను, చెల్లెల్ని చూస్తూ "కుర్రాడు చాలా మంచివాడిలా ఉన్నాడు పాపం... ఒంటరివాడు. మన ఇంటిలోనుండి




కూరలు, ఫలహారాలు పంపిస్తుండండి" చెప్పాడు.

తలూపింది శారదమ్మ. మౌనంగా ఉండిపోయింది శకుంతలమ్మ. వసుంధర కళ్లు తెరచి అందరి వంకా చూస్తూ, ఆ మాటలు మౌనంగా వింటూ ఉంది. రాము అక్క పక్కనే కూర్చుని ఉన్నాడు.

శంకరయ్య కూతురికి ధైర్యవచనాలు చెప్పే ఉద్దేశంతో ఆమె మంచంపక్కనే కుర్చీ లాక్కుని కూర్చున్నాడు. వసుంధర నిశ్శబ్దంగా తండ్రి వంక చూసింది. ఆయన గొంతు సవరించుకున్నాడు.

"చూడు వసూ... జరిగినదాని గురించి నువ్విలా దిగులుపడి మనోవ్యధతో మంచానపడటం అంత మంచిది కాదు. ఆ వెధవ నిన్ను... నన్ను... చివరికి కన్నతల్లిని కూడా మోసం చేశాడు. కాని మోసపోయినంతమాత్రానే మనం దిగులు పడవలసిన అవసరం లేదు. ఒకవేళ కలెక్టర్ మొగుడిని నేను నీకు తెచ్చి ఇవ్వలేకపోయినా, ఒక మంచి సంబంధాన్ని చూసి చేయలేనంత అసమర్ధుడినికాను. నీకు ఏ ఇంజనీరునో, డాక్టరునో తీసుకొచ్చి పెళ్లి జరిపిస్తాను. ఊరంతా విస్తుపోయేంత ఘనంగా నీ పెళ్లి జరుగుతుంది. ఇందుకు నా ఆస్తంతా హారతి కర్పూరంలా అయిపోయినా ఫర్వాలేదు. వాడు మోసం చేసినా... ఆ లోటు తెలియని విధంగా నీ పెళ్లి జరిగి తీరుతుంది. నా మాటనమ్ము... నువ్విలా దిగులుపడి మంచానపడి ఉంటే మేమంతా నీ బాధ చూడలేకపోతున్నాం. మాకూ మనశ్శాంతి కరువవుతుంది. నా మాట విని జరిగినదానిని మరచిపో తల్లీ..."

ఆమె మనసులోనే నిట్టూర్చింది "ఎలా మరచిపోగలను నాన్నా... చిన్ననాటినుండి కొద్ది కొద్దిగా కట్టుకుంటూ వస్తున్న మేడ ఒక్కసారి కూలిపోతే నేనెలా తట్టుకోగలను? గుండెకు అయిన గాయం అంత త్వరగా ఎలా మాసిపోతుంది. కాని... నా వలన మీరు కూడా బాధపడటం నాకిష్టంలేదు. నన్ను కబళించిన దురదృష్టపు కోరలు మిమ్మల్ని కాటేయడం నేను భరించలేను. అందుకే... అందుకే లేని సంతోషాన్ని ఉన్నట్టుగా నటిస్తాను. నా కోసం కాకపోయినా మీ ఆనందం కోసం బతుకు గడుపుతాను" మనసులోనే నిశ్చయించుకుంది వసుంధర.

తండ్రి వంక చూసి "అలాగే నాన్నా" అంది.

మరికాసేపు హితవు మాటలు చెప్పాడు శంకరయ్య. మందులు జాగ్రత్తగా వాడుకోమని కోరాడు. అన్నింటికీ తలూపింది వసుంధర.

చివరిసారిగా హెచ్చరించి ఏవో పనులు ఉండటంతో రంగయ్యను వెంటబెట్టుకుని పొలంవైపు వెళ్లిపోయాడు శంకరయ్య.

భర్త బయటకు వెళ్ళాక శారదమ్మ కూతురి పక్కనే కూర్చుంది- "వసూ... నీ మనసేమిటో నాకు తెలుసు. ఆ అబ్బాయి నిన్ను కాదన్నందుకు బాధకలగడం సహజమే. అయితే ఆ బాధ అలాగే ఉంచుకుంటే పెరుగుతుందే తప్ప తరగదు కాబట్టి నువ్వు ఆ బాధను మనసులోనుండి తొలగించు. జరిగినదాన్ని మరచిపో. నువ్వు బాధపడుతూ ఉంటే మీ నాన్నగారు ఓర్చుకోలేరు. ఆయన మనసును బాధపెట్టడం నీకు భావ్యం కాదు"

తల్లి మాటలకు కూడా తలూపింది వసుంధర "నీ మాట వింటానమ్మా" అంది ఆఖరున. ఆ తల్లికూడా సంతృప్తిపడి వెళ్ళిపోయింది.

చివరగా శకుంతలమ్మ మేనకోడలికి తన వంతు మాటలు అప్పగించేందుకు దగ్గరగా వచ్చింది "వసూ... నా కొడుకుచేసిన నేరానికి నేను తలదించుకోవలసి వస్తోంది. మీ నాన్న మంచివాడు కాబట్టి నా కొడుకు ఇంతచేసినా నన్ను బయటకు నెట్టకుండా ఇంటిలోనే ఉంచుకున్నాడు. వసూ... మీ అమ్మానాన్నా చెప్పినట్టు జరిగినదానిని మరిచిపోయేందుకు ప్రయత్నించు. మీ నాన్న చాలా పట్టుదల మనిషి. ఆయన నా కొడుకుమీద కోపంతోనైనా నీకు ఎంతో గొప్ప సంబంధం తీసుకువస్తాడు. నీది ఎంతో మంచిమనసు. నువ్వు ఎక్కడున్నా సుఖపడగలవు. నిన్ను అందరూ అభిమానిస్తారు. నీ ప్రవర్తన చూస్తే ఎవరైనా ఇష్టపడతారు. నీలాంటి అందమైన, గుణం కలిగినదానిని కాదన్నా నా కొడుకు మూర్ఖుడు. వాడి దురదృష్టా

నికి నేనే బాధపడుతున్నాను. నా మాటవిని మామూలు మనిషికా తల్లీ''

అత్తయ్య మాటలకు కూడా అంగీకారంగా తలూపింది వసుంధర.

తన బాధ్యత ముగిసినట్టుగా ఆమె కూడా ఆ గదిలోనుండి వెళ్లిపోయింది. పెద్దవారంతా తనను విడిచివెళ్ళారు. ఇక మిగిలింది తమ్ముడు రాము ఒక్కడే. వాడికి తనకు ధైర్యం చెప్పేంత వయసు లేదు. పదేళ్ళ కుర్రాడు. వయసుంటే వాడు కూడా నాలుగు మాటలు అప్పగించేవాడేమో.

అర్థగంటసేపు అక్క పక్కనే కూర్చున్నాక వాడు కూడా వెళ్ళిపోయాడు.

ఆ గదిలో ఆమె ఒక్కతే మిగిలింది.

ఆమె చుట్టూ నిశ్శబ్దం... గాఢమైన నిశ్శబ్దం.

నిశ్శబ్దం ఆలోచనలను అధికం చేస్తుందే తప్ప తుంచివేయలేదు. ఆ నిశ్శబ్ద స్రవంతిలో ఆమె దీర్ఘాలోచనా పయనం చేయసాగింది.

తనవారంతా తనకు జరిగింది మరచిపొమ్మని చెప్పి వెళ్ళారు కానీ తను తన ప్రియమైన బావను మరిచిపోగలదా అదే ఆమె ఆలోచన. ఆ సమస్య చుట్టూనే ఆమె ఆలోచనలు పరిభ్రమిస్తున్నాయి.

అయితే కాలం చాలా వింతయినది. అది శరీరానికి తగిలిన గాయాలనే కాదు మనసుకు తగిలిన గాయాలను కూడా మాన్పగలదు.



తనవారిని బాధపెట్టడం ఇష్టంలేకనో లేక మనసుకు తగిలిన గాయం బాధ కాసింత ఉపశమించడంతోనో ఆమె తన గది వదిలి బయటకు రావడం మొదలుపెట్టింది. కాసేపు వంటగదిలో కూర్చుని తల్లికి వంటపనులలో సాయపడేది. పశువులదొడ్డిలోనికి వెళ్ళి ఆవులు, గేదెలు పనులు స్వయంగా చూసేది. అవీఇవీ పనులు కలిపించుకుని పనిచేస్తూ తన బాధ మరిచిపోయేందుకు ప్రయత్నించసాగింది.

అయితే అంతమాత్రాన ఆమె తన బాధను పూర్తిగా మరచిపోలేదు. మధ్యాహ్నం వేళ అందరూ నిద్రపోయేవేళ తను ప్రేమలేఖలు రాసుకున్న మామిడిచెట్టు కింద కూర్చుని చిన్ననాడు బావతో కలసి తిరిగిన తీపిజ్ఞాపకాలు నెమరువేసుకునేది. పెద్దయిన తర్వాత తను రాసిన ప్రేమలేఖలు గుర్తుతెచ్చుకుని కుమిలిపోయేది. ''బావా... ఎంత స్వార్థం నిన్ను కమ్మినా, ఈ చిన్నారి మరదలిని మరచిపోవడం నీకెలా సాధ్యపడింది? నన్ను కాదని మరో అమ్మాయిని ప్రేమించడం నువ్వెలా చేయగలిగావు? నా ప్రేమలో నీకు కనిపించిన లోపం ఏమిటి?''

తన ప్రేమలో లోపం లేదని, అతడు ఆమెను మరచి ఏ అమ్మాయినీ ప్రేమించలేదని, కేవలం స్టేటస్‌కు తగిన అమ్మాయిని పెళ్ళాడాలన్న కారణానే ఈ కలతలన్నీ అతడు సృష్టించాడని ఆమెకు తెలియదు. అది తెలియని ఆమె తన ప్రేమలో లోపం ఉందనో లేక అతడి చేత ప్రేమింపబడిన స్త్రీ చాలా గొప్ప వ్యక్తిత్వం కలిగినదై ఉంటుందనో అనుకుంది. ఆ ఆలోచనలే ఆమెను బావమీద విరక్తి చెందేలా చేయకుండా తనను తాను నిందించుకునేలా చేస్తున్నాయి. ఆ బాధ ఆమెను వదలడం లేదు. ఆమె మనిషిమాత్రం తిరుగుతోంది తప్ప మనసు మనసులో లేదు.

రోజులు నెమ్మదిగా గడుస్తున్నాయి. ఆరోజు ఆమె వీధివాకిట ముందున్న గులాబీచెట్లకు పాదులు చేస్తోంది. పడమర సూర్యుడు ఎరుపు రంగు పులుముకుని అస్తమించేందుకు ఆయత్తమవుతున్నాడు. ఆ బంగారు కిరణాల వెలుగు ఆమె గోధుమరంగు బుగ్గలమీదపడి మరోకొత్తరంగుగా మారిపోతోంది. దగ్గరనే ఉన్న వేపచెట్టు నుండి వీచే గాలికి ఆమె నల్లని కురులు మెల్లగా ఎగురుతున్నాయి. ఆమె కట్టుకున్న





గులాబీరంగు చీర ఆమె శరీరవర్ణంతో పోటీప డలేక వెలవెలపోతోంది.

చక్కని శరీరాకృతి ఆమెది. ముఖం తీర్చిది ద్దినట్టుగా ఉంటుంది. సన్నని పొడవైన వేళ్ళు పలుగు పట్టుకుని నేలను తవ్వుతుంటే ఆమె నుదుటన స్వేదం అలముకుంటోంది. ఆమె ఆ పనిని చాలా ఏకాగ్రతగా చేస్తూఉంది.

''హలో''

ఆ పిలుపు ఆమె ఏకాగ్రతను చెదరగొ ట్టింది. ఆమె తలతిప్పి పిలుపు వినపడిన వైపుగా చూసింది.

తనున్న చోటుకు పదిగజాలదూరంలో తన ఇంటి వీధివాకిలి దగ్గరే గోడకు ఆనుకుని నిలబడి నవ్వుతూ తనవంకే చూస్తున్నాడు డాక్టర్. తనను చూసి పెదవులు మరింత వెడల్పు చేశాడు అతడు.

ఆమె మొదట తడబడింది. పల్లెటూరి అమ్మాయి కావడంతో ఆమెలో భయం ఎక్కువ. అంతేకాదు. ఆమె ఇంతవరకూ తన బావతో తప్ప మరే పరాయి యువకునితోనూ మాట్లాడి ఎరుగదు. అందుకే ఆమె మొదట కంగారు పడింది. కాని అతడు తనకు వైద్యం చేసిన డాక్టర్ కావడంమూలాన నవ్వక తప్పలేదు. పలకరింపుగా నవ్విందామె.

''మీ ఆరోగ్యం ఎలా ఉంది?'' ప్రశ్నించాడు అతడు.

''బాగుంది డాక్టర్''

''టానిక్‌లు వాడుతున్నారా?''

వాడుతున్నానన్నట్టుగా తలూపిందామె.

ఆమెతో మాటలుకలిపే ఉద్దేశమతడి మన సులో ఉన్నట్టుంది. మాటలు పొడిగిస్తూ అన్నా డు- ''నా పేరు మోహన్‌కుమార్... మరి మీ పేరు?''

''వ...వసుంధర...''

''మీ పేరులో రెండు 'వ'లున్నాయా?''

ఆమాట అర్థంకావడంతో ఆమె సిగ్గుప డింది.

ఆమెను మరింత కంగారుపెట్టడం ఇష్టంలేక కాబోలు అతడు లోపలికి వెళ్ళిపో యాడు. అతడు ఆ చోట ఉన్నంతసేపు ఆమె గుండెదడగా ఉండింది. ఇప్పుడు కాస్త ప్ర శాంతంగా తోచింది.

త్వరగా పాదులు చేసి ఇంటిలోనికి వచ్చింది. పెరడులోనికి వెళ్ళి చేతులు కడు క్కుంది. పశువుల దొడ్డివైపు చూస్తే రంగయ్య గేదెలకు పాలుపిండుతున్నాడు. ఆమె లోపలికి వెళ్ళింది. రంగయ్య చేతిలోని చెంబు అందు కుని తనే పాలు పితకసాగింది. కొద్దిసేపు ఆ పని చేసేసరికి వేళ్ళు నొప్పులు పుట్టాయి. అది గమనించిన రంగయ్య- ''ఈ శ్రమ నీకెందుకు చిన్నమ్మగోరూ! ఆ పని నేను చేస్తాగా'' అన్నాడు చిరునవ్వుతో. తన చేతిలోని చెంబు అతడికి ఇచ్చేసిందామె. అతడు పాలు పితకడం అయ్యాక తను దూడలను విప్పసాగింది.

పగలంతా శ్రమపడిన ఆకాశం ముఖానికి నల్లరంగు వేసుకోసాగింది.

పాలు పని అయిపోయాక వసుంధర ఇంటి లోనికి వచ్చింది. రాము హాలులో కూర్చుని తరగతి పుస్తకాలు చదువుకుంటున్నాడు. ఆమె తమ్ముడి పక్కనే కూర్చుని వాడికి కాసేపు చదువు చెప్పింది.

శంకరయ్య పొలంనుండి వచ్చాడు. రంగ య్యకు మర్నాడు చేయవలసిన పొలంపను లు వివరించాక అప్పుడే గుర్తుకు వచ్చిన ట్టుగా- ''ఒరే రంగా... పాపం ఆ డాక్టరు ఏం వండుకుని ఏం తింటున్నాడో. ఒక్కరోజయినా మంచి భోజనం పెడదాం, రాత్రికి భోజనానికి పిలవరా'' అన్నాడు.

రంగయ్య తలూపి ''అలాగే అయ్యగారూ! వెళ్ళి చెప్పివస్తాను'' అంటూ బయటకు కది లాడు.

శంకరయ్య వాలుకుర్చీలో కూర్చుని మధ్యా హ్నం పోస్ట్‌లో వచ్చిన పత్రికను తిరగేయసాగా డు.

పది నిముషాల తర్వాత రంగయ్య వచ్చా డు.

''ఏరా! చెప్పివచ్చావా?'' పేపర్‌లోనుండి తలతిప్పుతూ అడిగాడు శంకరయ్య అతడిని.

''చెప్పానయ్యా... ఆ బాబుగారు మహా మొ హమాటస్థుడిలా ఉన్నాడు. చాలాసేపు బతిమ లాడితేగాని వచ్చేందుకు ఒప్పుకోలేదు''



శంకరయ్య నవ్వి ఊరుకున్నాడు.

ఆ మాటలు పక్కనే కూర్చుని ఉన్న వసుంధర కూడా విన్నది. ఆమెలో ఏ భావమూ లేదు.

శంకరయ్య స్నానం చేశాడు. ఇంటిలోని వారందరి స్నానాలు పూర్తయ్యాక భోజనాలకు రెడీ అయ్యారు. శంకరయ్య రాముని పిలిచి "ఆ డాక్టర్‌ని పిలుచుకురారా" అన్నాడు. పరుగెత్తుకుంటూ వెళ్ళిపోయాడు వాడు.

ఐదు నిముషాల తర్వాత అతడిని వెంటబెట్టుకుని వచ్చాడు రాము.

అతడు వస్తూనే "ఎందుకండీ అనవసరంగా ఇంటిలోనివారిని ఇబ్బంది పెట్టడం నేనేదో వండుకు తింటున్నానుగా" నవ్వుతూ అన్నాడు.

"ఇందులో ఇబ్బంది పడటంఅంటూ ఏముంది? మీకోసం ప్రత్యేకంగా ఏమీ చేయల్లేదు. మేము వండుకు తినేదాంట్లోనే మీకూ కొంత పెడుతున్నాం"

పల్లెటూర్లలో అన్నం, కూరలు కాస్త అధికంగానే వండుకుంటారు. కాబట్టి ఒకరిద్దరు ఎక్కువయినా వండిందే సరిపోతుంది.

రాముచేతనే 'డాక్టర్ భోజనానికి వచ్చాడని' వంటగదిలోని శారదమ్మకు చెప్పి పంపాక ఆయన అతడితో కబుర్లలో పడ్డాడు. వారిద్దరూ కాస్త ఎక్కువగా మాట్లాడేవారే కాబట్టి వారి కబుర్లకు అంతే లేకుండాపోయింది. మాట్లాడుకునేందుకు టాపిక్ దొరకలేదన్న సమస్యే లేదు. జిల్లా రాజకీయాల నుండి ఐక్యరాజ్యసమితి జనరల్ ఎలక్షన్స్ వరకూ చర్చించుకున్నారు. మధ్యలో శారదమ్మ రెండుమారులు 'భోజనం సిద్ధం' అంటూ వసుంధర చేత చెప్పి పంపింది. 'వస్తున్నానమ్మా' అంటూనే ఆయన కబుర్లను కొనసాగించాడు.

సుమారు పదిగంటలవేళ మూడోసారి



పిలుపు రావడంతో ఇక తప్పనిసరయి పైకి లేచాడాయన. అప్పటికే వారిద్దరిమధ్యా చనువు ఏర్పడిపోయి ఉండటంతో "రావోయ్ భోంచేద్దాం" అన్నాడు ఆప్యాయంగా.

ఇద్దరూ వంటగదివైపు వెళ్ళారు. శారదమ్మ పీటలు వాల్చింది. అతడివంక ఆప్యాయంగా చూస్తూ- "కూర్చోబాబూ" అంది.

వారిద్దరూ కూర్చున్నారు. "పిల్లలు భోంచేశారా?" అడిగాడు శంకరయ్య.

"లేదు... మీరు భోంచేశాక భోంచేస్తామని అన్నారు" జవాబిచ్చింది శారదమ్మ.

"అరే... చాలా పొద్దుపోయింది. ఇంకా అలస్యం ఎందుకు? వాళ్ళను కూడా వచ్చి కూర్చోమనకూడదూ?"

"పిలిచి వస్తాను-" వంటగదిలోనుండి బయటకు వెళ్ళింది శారదమ్మ. ఒక నిముషం తర్వాత రాముని మాత్రమే వెంటబెట్టుకుని వచ్చి, "వనూ తర్వాత భోంచేస్తానంటోంది" చెప్పింది.

కూతురు అతడి ఎదుటపడేందుకు సిగ్గువడుతుందని అర్థమయిందాయనకు. మనసులోనే నవ్వుకున్నాడు.

శారదమ్మ ముగ్గురికీ అన్నం వడ్డించింది. రెండు కూరలు, మూడురకాల పచ్చళ్ళు, చారు, పెరుగు- అన్నీ ముందుపెట్టింది. అతడు కాస్త భోజనప్రియుడేమో అన్నికూరలూ వడ్డించుకుని లొట్టలు వేస్తూ తినసాగాడు. "అబ్బా! ఈ మధ్య చప్పిడి మెతుకులు తిని నోరు చెడిపోయి ఉందండీ! ఇదిగో ఇప్పుడు ఈ కారం, పులుసు తగలడంతో నా నాలుకకు కాస్త రుచి తెలుస్తోంది... చాలాకాలం తర్వాత మంచి భోజనం చేశానండి" శంకరయ్యతో అనసాగాడు అతడు.

ఈ కొద్దిసేపటిలోనే ఆయనకు అతడి మీద అభిమానం కలిగింది. "ఇన్నిరోజులనుండి నేను నీ గురించి ఆలోచించలేదోయ్. ఆలోచించి ఉంటే ఎప్పుడో చెప్పి ఉండేవాడిని. ఇప్పటికైనా మించిపోయిందిలేదు. ఇప్పుడు చెపుతున్నాను విను... ఈరోజు నుండి నువ్వు స్వయంపాకం చేసుకునేందుకు వీలులేదు. రేపటినుండి నీ భోజనం మా ఇంటిలోనే"

అతడు కాస్త మొహమాటపడ్డాడు. "వద్దండి... మీకు ఇబ్బంది కలిగించడం నాకిష్టంలేదు" అన్నాడతను.

"ఇబ్బందేంలేదు. మా కుటుంబసభ్యుడిలా, మా నలుగురితో కలసి భోంచేస్తావు అంతే" ఖచ్చితంగా అన్నారాయన.

ఇక తప్పదన్నట్టుగా మౌనంగా ఉండిపోయాడు అతడు.

భోజనాలు పూర్తయ్యాయి.

వారిద్దరూ లేచివచ్చి వరండాలో ఉన్న కుర్చీలలో కూర్చున్నారు.

"అన్నట్టు... మీ నాన్నగారేం చేస్తున్నారు?" ఆరాగా అడిగారాయన.

రెండుక్షణాలు నిశ్శబ్దం తర్వాత అతడు చెప్పాడు "నాన్నగారు నా చిన్నప్పుడే పోయారు నాకున్నది మా అమ్మగారొక్కరే..."

"అలాగా..." అని అరనిముషంపాటు మౌనం పాటించాడాయన. తర్వాత ప్రశ్నించాడు. "ఆస్తిపాస్తులేమయినా ఉన్నాయా?"

"మా పల్లెలో నాలుగెకరాల పొలం, పెంకుటిల్లు ఉన్నాయి. ఒక పాలేరును పెట్టుకుని మా అమ్మగారే సేద్యం చేయిస్తుంటారు."

ఆయన మరో పదినిముషాలపాటు అతడి స్వవిషయాలగురించి అడిగాడు. వివరాలన్నీ తెలుసుకున్నాడు.

చాలా పొద్దుపోయాక అతడు లేచి "ఇక వెళ్ళొస్తానండి" అన్నాడు.

"మంచిది" తనూ లేచాడు శంకరయ్య.

అతడు గేటు తీసుకుని వీధిదాటి అవతలి ఇంటిలోనికి వెళ్ళాడు.

అతడు వెళుతున్నంతసేపూ ఆ వైపే చూస్తుండిపోయాడు శంకరయ్య. ఉన్నట్టుండి ఆయనలో ఏదో ఆలోచన కలిగింది. ఆయన దాని గురించి అర నిముషంపాటు ఆలోచించాడు. "తప్పు... అలా ఆలోచించడమే తప్పు" తనలోనే తను అనుకున్నాడాయన.

ఆ ఆలోచనను వెంటనే మనసులోనుండి తుడిచేశాడు.

★ ★ ★

చంద్రశేఖరం దగ్గరనుండి ఉత్తరం





వచ్చింది. తనను జాయింట్ కలెక్టర్‌గా డ్యూటీలో జాయిన్‌కమ్మని ఆర్డర్స్ వచ్చాయనీ, డ్యూటీలో జాయిన్ అయ్యేందుకు వెళ్తున్నానని రాశాడు. శకుంతలమ్మను తన దగ్గరకు రమ్మని కోరాడు.

అది చదివిన శంకరయ్య ఉత్తరాన్ని శకుంతలమ్మకు ఇచ్చాడు. ఆమె దానిని చదివి దూరంగా విసిరికొట్టింది. 'నీచుడు... వాడు ఎంత గొప్పస్థితిలో ఉంటే మాత్రం నేనింక ఎలా సంతోషపడగలను? నా అన్నయ్యను మోసంచేసి, నా మేనకోడలి ఆశలు కూల్చిన దుర్మార్గుడు నాకు కొడుకు ఎందుకవుతాడు? వాడికీ, నాకూ ఏ సంబంధంలేదని నేను ఎప్పుడో తెగేసి చెప్పేసి వచ్చాను''

ఆమె నిర్ణయానికి అందరూ ఆశ్చర్యపడ్డారు. మాటకోసం మంచి స్టేటస్‌లో ఉన్న కొడుకును కూడా దూరం చేసుకుంటున్న ఆమె నిజాయితీని మనసులోనే అభినందించారు.

అయినప్పటికీ శంకరయ్య మంచిమనను చేసుకుని ఆమెతో చెప్పాడు: ''చూడమ్మా శకుంతలా తల్లీకొడుకుల సంబంధం విడదీయరానిది. ఈరోజు వాడు మాకేదో ద్రోహం చేశాడని నువ్వు వాడి దగ్గరకు వెళ్లననడం అంత మంచిది కాదేమో... ఆలోచించు''

''చెడు అన్నది ఎవరిదగ్గర ఉన్నా వారిని వదిలి దూరంగా ఉండాలి. చెడును రక్త సంబంధంతో ముడిపెట్టి చూడకూడదు''

ఆమె నిర్ణయాన్ని మార్చడం ఎవరివల్లా కాలేదు. ఆమె నిశ్చయానికి ఆమెను వదిలి అందరూ మౌనంగా ఉండిపోయారు.

శకుంతలమ్మకు కొడుకు దగ్గరకు పోవలసిన అవసరం కనిపించలేదు. ఆమెకు ఆ ఇంటిలోని వ్యక్తుల మంచిమనను తెలును. తన జీవితాంతం ఆ పంచనపడి ఉన్నా తన పోషణకు ఎలాంటి ఇబ్బంది ఉండదని ఆమె ఎరుగును. తనకు వచ్చే ఆ పట్నం కోడలుకన్నా ఈ పల్లెటూరి వ్యక్తులే ప్రేమాభిమానాలతో చూస్తారని ఆమె భావించింది కాబట్టే ఆమె ఆ ఇంటిని వదిలిపోకూడదనుకుంది. మొత్తంమీద చంద్రశేఖరం జాయింట్ కలెక్టరయ్యాడన్న ఆనందం ఆ ఇంటిలో ఎవరికీ కలగలేదు. అందరూ ఆ ఉత్తరాన్ని మరిచిపోసాగారు.

మరోవైపు మోహన్‌కుమార్‌కు ఆ ఇంటిలో చనువు ఏర్పడసాగింది. అతడు తన ఖాళీ సమయాన్ని ఎక్కువగా ఆ కుటుంబసభ్యుల మధ్య గడుపుతున్నాడు. ఉదయం కాఫీ మొదలుకుని రాత్రి భోజనం వరకూ అక్కడే జరిగిపోసాగింది. అతడు శారదమ్మను 'ఆంటీ' అని, శంకరయ్యను 'అంకుల్' అని పిలుస్తున్నాడు. ఈ ఇంగ్లీషు సంబోధన వారి మనసులను సంతోషపెడుతోంది. ఇంకా పెద్ద చదువులు చదువుతుండిన చంద్రశేఖరం కూడా వారిని అత్త, మామయ్య అనేవాడే తప్ప ఇలా ఇంగ్లీషు పిలుపులు పిలిచి ఎరగడు. పిలుపుల ప్రభావమో, అతడి కలుపుగోలు మనస్తత్వ పరిణామమో తెలియదుగాని అతడు ఆ ఇంటిలో ఒక కుటుంబసభ్యుడిలా మారిపోయాడు కొద్దిరోజులలోనే.

టిఫిన్ తయారుకాగానే మొదట అతడి కోసం పిలుపు వెళ్ళేది. అలాగే భోజనాలకు కూడా.

మోహన్‌కుమార్ హాస్పిటల్ నుండి ఐదు గంటలకు తిరిగి వచ్చేవాడు. స్నానం పూర్తిచేశాక ఒక గంటసేపు మెడికల్ బుక్స్ తిరగేసేవాడు. చీకటిపడుతున్నప్పుడు శంకరయ్య పొలం నుండి తిరిగి వచ్చి, పశువుల విషయం అవీ గమనిస్తాడు. ఆయన స్నానం చేసేసరికి ఎనిమిదయ్యేది. ఆ తర్వాత ఆయన వరండాలోకి వచ్చి వాలుకుర్చీలో విశ్రాంతిగా కూర్చునేవాడు. కబుర్లకోసం 'డాక్టర్‌ని పిలుచుకురారా' అని రంగయ్యను పంపేవాడాయన.

ఆయన పిలుపు అందుకుని మోహన్‌కుమార్ ఆ ఇంటికి వస్తాడు. ఆయన ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చుంటాడు. ఇక లోకాభిరామాయణం మొదలు. ఆ చర్చలకు అంతే ఉండదు. ఎంత సమయం గడిచిందో వారికి తెలియదు. శారదమ్మ రెండుమూడుసార్లు పిలుపు పంపాక ఏ పదిగంటలవేళో భోజనానికి లేచేవారు వారు.

అప్పటికీ శారదమ్మ అతడితో అనేది ''బాబూ... ఆయనతో మాటలు కలిపితే గంటల తరబడి మాట్లాడుతూనే ఉంటాడు... ఆయన మాటల వలన నీకు ఇబ్బంది కలుగు

తుందేమో''

"నేనో అంటీ... అంకుల్ చాలా అట్రాక్టివ్‌గా మాట్లాడతారు. ఆయన నాకు కూడా తెలియని విషయాలు ఎన్నో చెబుతున్నారు. రాజకీయాలు, పురాణాలు, సాహిత్యం అవేవీ నాకంతగా తెలియదు. ఆయన చెబుతుంటే చాలా ఆసక్తిగా ఉంది. అసలు టైమే తెలియడం లేదు''

అతగాడి పొగడ్తకు శంకరయ్య గుంభనంగా నవ్వుకునేవాడు. అతడు గమనించకుండా భార్యవంక చూసి కన్నుగీటి మెల్లగా మీసం దువ్వేవాడు. భర్తగారి ఉబ్బిన ఛాతీ చూసి ఆమె కూడా మనసులోనే నవ్వుకునేది. అలా ఆ దంపతులకు ఆత్మీయుడయిపోయాడు మోహన్‌కుమార్. శకుంతలమ్మ కూడా అతడిని ఆప్యాయంగా పలకరించేది. అయితే అప్పుడప్పుడూ ఏ భావమో మనసులో ముల్లులా గుచ్చుకుని బాధించేది. తన కొడుకు సక్రమంగా ప్రవర్తించి ఉంటే తన అన్నావదినలు మోహన్‌కుమార్ మీద చూపించే ఆదరాభిమానాలు తన కొడుకుకు దక్కవలసినవికదా అనుకునేది. ఆమె ఒక్కొక్కసారి మరోలా కూడా ఆలోచించేది అన్నయ్యను తన కొడుకు కాదన్నా ఇలాంటి మంచి కుర్రాడు, డాక్టర్ అల్లుడయితే అంతేచాలు అనుకోసాగింది. తన అన్నగారి మనసులో ఆ ఆలోచన ఉందేమోనని ఆమె భావించేది.

అయితే వాస్తవంలో శంకరయ్య మనసులో ఎలాంటి ఉద్దేశమూలేదు. మోహన్‌కుమార్‌ని ఆయన మామూలు దృష్టితోనే చూస్తున్నాడు. సాటిమనిషి ఇబ్బందిపడుతుంటే భరించలేని సున్నితమనస్కుడిలా ఆ యువకుడిని ఆదరిస్తున్నాడు. అతడిని చేరదీస్తున్నాడు.

ఆ గ్రామంలో శంకరయ్య అంటే అందరికీ అభిమానమే. ఆయన మంచితనం మీద గౌరవం ఉంది కాని — ఎంత మంచి వ్యక్తియినా రచ్చకీడ్చే వ్యక్తులు సమాజంలో అక్కడక్కడా ఉంటారు. వారి శరీరం నిండా అసూయ నిండి ఉంటుంది. అలాంటి అసూయపరులు ఒకరిద్దరు చిన్న పుకారు లేవనెత్తారు. "మేనల్లుడు మంచి హోదాను పొందడంతో ఆయనగారిని కాదన్నాడు. అందుకే ఆయన కనీసం డాక్టర్ అల్లుడినయినా సంపాదిద్దామని మోహన్‌కు మార్‌ని చేరదీస్తున్నాడు'' అని.

తనమీద వచ్చిన ఈ అపవాదు ఆయన చెవులవరకూ సోకింది. అది వినడంతోనే ఆయన మొదట చాలా బాధపడ్డాడు కాని వెంటనే సర్దుకున్నాడు. జీవితంలో ఎదురయ్యే ఆటుపోటులకు అప్పుడే అలవాటుపడుతున్నాడాయన. తన మీద అపవాదు వేసినవారి మీద జాలిపడి నిశ్శబ్దంగా ఉండిపోయాడు.

అయితే ఇరుగుపొరుగు ఈ విషయంలో శారదమ్మతో అన్నప్పుడు మాత్రం ఆ ఇంటిలో కొద్దిపాటి చర్చ జరిగింది.

మధ్యాహ్నం భోజనానంతరం ఆయన కునుకుతీసే సమయంలో శారదమ్మ పక్కనే కూర్చుని "ఏమండీ'' అని పిలిచింది.

ఆయన తలతిప్పి ఆమె వంక చూశాడు. మనసు హుషారుగా ఉండటంతో కాసింత చిలిపిదనం ప్రవేశించింది ఆయనలో, "ఏమిటే శారదా... పట్టపగలే పక్కన చేరావు. ఇంట్లో అందరూ ఉన్నారు. ఈ వేళప్పుడు బాగుండదే'' అని గంభీరంగానే పలికారు.

ఆమె బుగ్గలు ఒక్కసారిగా ఎరుపెక్కాయి. ఆ వయసులో కూడా సిగ్గుల మొగ్గయిందామె. భర్తగారి సరసానికి మనసులోనే నవ్వుకుని, పైకి చిరుకోపం నటిస్తూ చెప్పింది "వయసు మీదపడ్డకొద్దీ మీరు మరీ చిన్నపిల్లాడిలా మారిపోతున్నారు''

"నా వయస్సెంత... ఇంకా యాభై నిండలేదుకదా?''

"చాల్లే సరసం'' ఆమె ముద్దుగా విసుక్కుంది. "ఈ సరసాలు ఆపి అసలు విషయానికి రండి''

"ఏమిటో విషయం చెప్పు శారదా?'' అన్నాడాయన.

శారదమ్మ కాసేపు మౌనంగా ఉండి, తర్వాత చెప్పింది "ఆ అబ్బాయి- మోహన్‌కుమార్‌ని మనం చేరదీస్తుంటే లోకులు నానారకాలుగా అనుకుంటున్నారు''

ఆయన భార్య వంక అదోలా చూశాడు. 'ఈ విషయం ఇంతదూరం పాకిందా' అని అనుకున్నాడు. చిన్నగా నవ్వి, భార్య చేతిని తన




చేతిలోకి తీసుకొని బదులిచ్చాడు "శారదా... లోకులు కాకులు. వాళ్ళు నానారకాలుగా అనుకుంటూంటారు. మనం అవి పట్టించుకోకూడదు"

"అది కాదండీ... లోకులు అలా అనుకుంటూ ఉంటే విని భరించలేకున్నాను"

ఆయన ఆప్యాయంగా ఆమె చెయ్యి నిమిరాడు. "చూడు... నీ మనను నాకు తెలుసు. నా మనసు నీకు తెలుసు. మనిద్దరి మనసుల్లో అతడిని గురించిన ఎలాంటి దురుద్దేశమూ లేదు. సాటిమనిషి మీద చూపించాల్సిన ఆదరాభిమానాలు మాత్రమే అతడిమీద చూపిస్తున్నాం తప్ప అతడి నుండి మరేమిటో ఆశించి మాత్రం కాదు. ఈ విషయం నలుగురూ నాలుగు రకాలుగా అనుకోవచ్చు. కాకుల్లా కూయడం లోకుల సహజ లక్షణం. అవేమీ మనం పట్టించుకోకూడదు. మనం మన అంతరాత్మకు సమాధానం చెప్పుకోవాలే తప్ప— ఇరుగు పొరుగువారి ఎత్తిపొడుపులకు కాదు"

ఆ మాటలు ఆమెను సంతృప్తిపరచలేక పోయాయి. కాని మౌనంగా ఉండిపోయిందామె. అలాగే— తమకు చెడ్డపేరు తీసుకువస్తున్నాడని మోహన్‌కుమార్‌ను దూరం చేసుకునేందుకు కూడా ప్రయత్నించలేదు. మంచి మనసుతో మునుపటిలానే అతడిని ఆదరించసాగింది.

తన కుటుంబం మీద వస్తున్న అపవాదుకు పరిష్కారమేమిటా అని ఆలోచించసాగాడు శంకరయ్య. ఆయనకు తోచింది ఒక్కటే— తన కూతురు పెళ్ళి సంబంధాలు చూడాలనుకున్నాడు. ఆ ఆలోచన నిర్ణయించుకోవడంతోనే వసుంధర కోసం వరుడిని వెతకటం మొదలుపెట్టాడు.

జరుగుతున్న పరిణామాలన్నింటినీ నిశ్శబ్దంగా గమనిస్తోంది వసుంధర. అంతే తప్ప ఏ విషయంలోనూ సొంత అభిప్రాయాలు ప్రకటించదలచుకోలేదు. తామరాకు మీద నీటిబొట్టులా ఉండిపోదలచుకుంది. తన బావను మరచిపోయేందుకు ఇప్పుడిప్పుడే ప్రయత్నిస్తోంది.

కాలం వేగంగా ముందుకు సాగుతూ ఉంది.

మోహన్‌కుమార్ ఆ పల్లెకు చేరి అప్పటికే మూడు నెలలు పూర్తయిపోయాయి.

ఆ ఇంటిలోనివారందరూ అతడితో ఆత్మీయంగా మాట్లాడుతున్నారు. వసుంధర మాత్రం అతడితో పలకడం లేదు. అతడిని చూస్తే తప్పించుకొని తిరుగుతోంది.

మోహన్‌కుమార్‌కు మాత్రం ఆమెతో పరిచయం పెంచుకోవాలనే ఉంది. కాని ఆ ప్రయత్నం ఏదీ చేయటంలేదు తనంతట తానుగా.



శకుంతల భర్త తరపు బంధువులొకరి ఇంట్లో పెళ్ళివచ్చింది. ఆ పెళ్ళికి శకుంతలమ్మతోపాటు తమ ఇంటితరపున శంకరయ్య, శారదమ్మ కూడా వెళ్లాల్సి వచ్చింది.

శారదమ్మ కూతురికి ఇంటి బాధ్యతలు అప్పగించింది. "రెండురోజులలో తిరిగి వస్తాం... ఇల్లు జాగ్రత్త. అన్నట్టు ఆ మోహన్‌కుమార్‌ని వేళకు పిలిచి భోజనం పెట్టు. లేకపోతే నువ్వు పిలవలేదని వస్తు పడుకోవడమో లేక చేతులు కాల్చుకునే ప్రయత్నమో చేసేరకం. సిగ్గుపడవద్దు... అతడూ మన ఇంటిలోనివాడే"

అయిష్టంగానే అయినా ఆ మాటకు తలూపింది వసుంధర.

శంకరయ్య మోహన్‌కుమార్‌తో చెప్పాడు- "మేము లేమని నువ్వు మొహమాటపడవద్దు. వేళకు వచ్చి భోంచేసి వెళ్ళు"

"అలాగేనండీ" అన్నాడు మోహన్‌కుమార్.

ఆరోజు ఉదయమే వారు బస్సెక్కి వెళ్ళిపోయారు.

ఆ మధ్యాహ్నం రంగయ్య వచ్చి "చిన్నమ్మగోరు భోజనానికి పిలుస్తున్నారు బాబుగారూ" అన్నాడు.

"వస్తున్నా" అనగానే రంగయ్య వెళ్ళిపోయాడు.

అతడు ముఖం కడుక్కుని నీట్‌గా డ్రస్ చేసుకుని ఆ ఇంటి వైపు వెళ్ళాడు.

వంటగది వాకిలి దగ్గర నిలబడి ఎదురు చూస్తున్న వసుంధర అతడిని చూసి మెల్లగా "రండి" అంది.

విశాలమైన ఆ ఇంటిలో ప్రస్తుతం వారిద్దరే ఉన్నారు. అతడు వంటగదివైపు నడిచాడు. ఆమె పీటవాల్చి అరిటాకు ముందుంచింది. అతడు కూర్చున్నాక అన్నం వడ్డించి, కూరగిన్నెలు దగ్గరలో పెట్టింది. తను వెళ్ళి తలుపు దగ్గరగా నిలబడింది.

అతడు కూరలు వడ్డించుకుని మెల్లగా భోంచేయసాగాడు.

ఒకనిముషం గడిచింది. భోంచేస్తున్న అతడు ఎందుకో తలెత్తి ఆమె వంకచూశాడు.

"చూడండి..." పిలిచాడు.

ఆమె అతడివంక చూసింది. ఇద్దరిచూపులూ క్షణంపాటు కలుసుకున్నాయి. ఆమె అతడి విస్తరివంక చూసింది. అన్నం ఇంకా పూర్తికాలేదు. అందుకే ప్రశ్నార్థకంగా అతడివైపు చూసింది.

అతడు భోజనం ఆపి ఆమెతో అన్నాడు- "ఏమండీ... నేను చేసిన తప్పేమిటో నాకర్థంకాలేదు... మీకు నామీద చాలాకోపంగా ఉన్నట్టుంది".

ఆ మాటకు ఆమె కంగారుపడింది. ఉలికిపాటుతో అతడివంకచూస్తూ ప్రశ్నించింది "అలా ఎందుకనుకుంటున్నారు?"

అతడు చెప్పాడు "నేను ఈ పల్లెకు వచ్చి మూడునెలలయింది. ఈ మూడు నెలలలో మిమ్మల్ని పలకరించాలని ముప్ఫయ్‌సార్లు ప్రయత్నించానుకాని మీరు నన్ను చూడడంతోనే తప్పుకొని వెళ్లిపోతున్నారు. ఇన్నిరోజులలోనూ మీరు కనీసం మూడుసార్లు కూడా నాతో మాట్లాడలేదు"

అతడి నిష్ఠూరానికి బదులేం చెప్పాలో నిముషంపాటు ఆమెకు తోచలేదు. మెల్లగా తేరుకుని, చిన్నగా నవ్వింది.

వసుంధర నవ్వితే నన్నజాజులు రాలిపడతాయని అనుకున్నాడు అతడు. ఆమె మాటలు కూడదీసుకుంటూ చెప్పింది- "నాకు మీ మీద కోపం ఎందుకు?... కొద్దిగా బిడియం అంతే"

"నాలాంటివాడి దగ్గర మీరు బిడియపడాల్సిన అవసరంలేదు. నేను హైకల్చర్‌లో బతికినవాడిని. ఆడామగా లేకుండా అందరితో క్లోజ్‌గా మూవ్‌కాగలను... ప్లీజ్! మీరు నాతో అలా ముభావంగా ఉండకండి. మీరిలా ఉంటే నేను భరించలేకుండా ఉన్నాను... ఒక్కొక్కసారి మీ ముభావంమీద కోపంకూడా వస్తుంటుంది నాకు. అలాంటప్పుడు మీ ఇంటికే రాకూడదనుకుంటాను నేను. కాని నేను రావడంమానేస్తే ఆంటీ, అంకుల్ బాధపడతారని వస్తున్నాను..." అతడిగొంతులో బాధ ధ్వనించింది.

ఆమెకూడా తన ప్రవర్తనకు తానే నొచ్చుకుంది. తన ప్రవర్తన తోటి వ్యక్తిని అంతగా బాధించిందా అని తనూ బాధపడింది. ఆ క్షణం అనుకోకుండానే అతడిమీద అభిమానం కలిగింది. అతడు తనకెంతో దగ్గరవాడిలా అనిపించాడు.

"మీరు మరోలా భావించుకోకండి... నాకు మొదటినుండీ మగవారితో మాట్లాడటం అంతగా అలవాటులేదు. అదీకాక ఈమధ్య నా మనసుకు బాధకలిగించే సంఘటనలు జరిగి మాటలు కూడా తగ్గించాను అంతేతప్ప... మిమ్మల్ని బాధపెడుతున్నానని అనుకోలేకపోయాను".

"మీకు జరిగిన అన్యాయం గురించి నాకూ తెలిసింది. చాలా బాధపడ్డాను... అయినా మనమలలో అంత నమ్మకద్రోహం ఉంటుందని ఊహించడమే చాలా బాధాకరంగా ఉంది".

ఆమె మౌనంగా ఉండిపోయింది. అంత జరిగాక కూడా తన బావను మరొకరు నిందించడం ఆమె భరించలేకపోతోంది.

వసుంధర నిశ్శబ్దంగా ఉండిపోవడంతో అతడే అన్నాడు "జరిగినదాన్ని మీరూ మరచిపోండి... ఈ విషయంలో మీరు చింతించాల్సినపనిలేదు. మీలాంటి అందమైన, మంచి





మనసు కలిగిన అమ్మాయిని దక్కించుకోలేక పోయినందుకు అతడే నిజంగా బాధపడవల సినవాడు... పాపం! దురదృష్టవంతుడు"

ఆమె ప్రేమలో ఒకసారి దెబ్బతిన్నది. అయినా ఆమెలోని అమాయకత్వం ఇంకా తొలగిపోలేదు. కాబట్టే ఆమె కన్నెమనసు అతడి పొగడ్తకు కాస్తగా చలించింది. అతడి ఓదార్పు మాటలకు తను సేదతీరుతున్నట్లుగా కూడా అనిపించింది.

అతడి భోజనంలో మొదటిభాగం పూర్తయింది. ఆమె వెళ్ళి అన్నం వడ్డించి, పెరుగు గిన్నె ముందుకునెట్టింది. అతడు పెరుగు వేసుకున్నాడు.

ఈ ఐదునిముషాల వ్యవధిలోనే ఆమెకు అతడిముందు మునుపున్న బెరుకు తగ్గిపోయింది. అతడి భోజనం పూర్తయింది. అతడు లేచి చెయ్యికడుక్కున్నాడు.

"వెళ్ళొస్తానండి" ఆమె వైపువచ్చి చెప్పాడు అతడు.

తలూపిందామె. అతడు వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి అతడు భోజనానికి వచ్చినపుడు ఆమె మధ్యాహ్నంలా ముక్తసరిగా కాకుండా, నవ్వుతూ "రండి... రండి" అంది.

అతడికి పీటవేసి, విస్తరాకు ముందుంచింది. పక్కనే పీటవేసి తమ్ముడిని కూర్చోబెట్టింది. అన్నం, కూరలు తనే స్వయంగా వడ్డించింది.

అతడు కూర కలుపుకుని నోట్లో పెట్టుకున్నాడు. "వహ్! కూరలు అద్భుతంగా ఉన్నాయండి..." లొట్టలు వేస్తూ అన్నాడు అతడు.

ఆ పొగడ్తకు ఆమె మనసు ఆనందపడింది. "మరికాస్త వేసుకోండి" అంటూ ఇంకాస్త కూర వడ్డించింది.

"వద్దు... వద్దండి... మీరు వడ్డిస్తూ ఉంటే ఈ కూరమొత్తం తినేస్తానేమో" అతడి మాటకు ఆమె చిరునవ్వునవ్వి మరికాస్త వడ్డించింది.

అక్క ముఖంలో చాలాకాలానికి చిరునవ్వు చూశాడు రాము. తన అక్కకు, ఈ డాక్టర్‌కీ మధ్య ఇంత చనువు ఎప్పుడు పెరిగిందా అని ఆశ్చర్యపోయాడు.

అన్నం తింటున్నంతసేపూ అతడు ఎన్నోవిషయాలు ఆమెకు చెబుతూ నవ్వించాడు. ఆమె కూడా చాలా ఆసక్తిగానూ, ఆనందంగానూ ఆ విషయాలు వింది.

ఒక్కరోజులోనే అతడు ఆమెకు ఎంతో చేరువయిపోయాడు.

రెండు రోజులలో అతడు ఆమెను ఎంతగా మార్చుకోగలిగాడంటే- రెండోరోజు సాయంత్రం ఇంటి వాకిట అడుగుపెట్టిన శంకరయ్య, శారదమ్మ దంపతులు వారిద్దరూ వీధి వరండాలో కూర్చుని నవ్వుతూ మాట్లాడుకోవడంచూసి విస్మయపడ్డారు. తన సొంతబావతో కూడా ఆమె అంత చనువుగా మాట్లాడటం వారు చూసి ఎరుగరు. మూడునెలల నుండీ అతడికి ఎదుటపడనుకూడా ఇష్టపడని ఆమె, రెండురోజులలోనే అతడి ఎదురుగా కూర్చుని మనసారా నవ్వడం చూసి ఆశ్చర్యపడ్డారు.

అయితే ఆ ఆశ్చర్యంలోకూడా వారు ఒకింత ఆనందపడ్డారు. మూడునెలల నుండి దిగులుగా, ఏదో పోగొట్టుకున్నదానిలా, తనకిక భవిష్యత్తులేనట్టుగా బాధపడుతుండిన ముద్దుల కూతురు మనసారా నవ్వుకోవడం వారిని సంతోషపరిచింది. తాము ఎంత ప్రయత్నించినా ఈ లోకంలోకి రాని ఆమెను, రెండురోజులలోనే మామూలు మనిషిని చేసేందుకు అతడు ఉపయోగించిన ట్రిక్కేమిటా అని వారిలో వారు ఆలోచిస్తుండిపోయారు

వారి విశాలమైన మనసులు ఈ విషయంలో సంకుచితంగా ఆలోచించలేకపోయాయి. వారి చనువును వీరు అపార్థంచేసుకోలేకపోయారు.

ఆరాత్రి శంకరయ్య వారిద్దరినీ పక్కపక్కనే కూర్చోబెట్టుకుని భోంచేశాడు. మోహన్‌కుమార్ వల్లనయినా తన కూతురు మామూలు మనిషి కాగలిగితేచాలు అన్నది ఆయన ఆశ. ఆ ఉద్దేశంతోనే ఆయన వారిద్దరి మధ్యా చనువు ప్రోత్సహించాడే తప్ప తుంచేందుకు ప్రయత్నించలేదు. అలాగే మరే దురుద్దేశాన్నీ మనసులో నాటుకోలేదు.

వారి చనువు చూసిన ఇరుగుపొరుగు గుసగుసలాడుకోసాగారు. కాని ఆ ఇంటిలోని వారెవ

రూ ఆ గుసగుసలు పట్టించుకోలేదు. ఫలితంగా వసుంధర, మోహన్‌కుమార్‌ల మధ్య మొలకెత్తిన చనువు గాఢమైన స్నేహంగా రూపుదిద్దుకోసాగింది.

చాలాకాలం తర్వాత చంద్రశేఖరం ఆ పల్లెకు వచ్చాడు.

ఆ పల్లెకు బస్సులు తప్పకార్లు రావటం అరుదు. దుమ్మురేపుకుంటూ వస్తున్న ఆ కారును చాలామంది గ్రామస్తులు ఆసక్తిగా చూశారు. తెల్లటి మారుతికారు వెళ్లి శంకరయ్య ఇంటిముందు ఆగింది. తమఇంటిముందు వాహనం ఆగిన చప్పుడవడంతో ఆ ఇంటిలోని వారంతా బయటకు వచ్చి ఆ వచ్చింది ఎవరా అని ఆతృతగా చూశారు.

కారు డోర్ తెరచుకుని చంద్రశేఖరం కిందికి దిగాడు హుందాగా. అతడి వెనుకే పాతికేళ్ళ మరో యువతి దిగింది. డ్రైవింగ్ సీటులో నుండి యాభైఏళ్ళ వ్యక్తికూడా కారు దిగాడు.

వారంతా హుందాగా, ఠీవిగా ఉన్నారు. ఖరీదైన దుస్తులలో దర్జాగా ఉన్నారు. చంద్రశేఖరంను చూడడంతోనే ఆ ఇంటిలోనివారు కలవరపడ్డారు. తేరుకున్న వసుంధర నెమ్మదిగా తన గదిలోకి తప్పుకుంది వారెవరికీ కనిపించకుండా.

అతడు శంకరయ్య దగ్గరగా వచ్చి "నమస్కారం మామయ్య" అన్నాడు.

శంకరయ్య మెల్లగా తలూపాడు. ఎంత నమ్మకద్రోహం చేసినా గడపతొక్కి వచ్చినవాడిని కాదు పొమ్మనడం భావ్యం కాదనుకున్నాడు. "లోపలికిరారా" అన్నాడాయన.

చంద్రశేఖరం వాకిలిదాటి లోపలికి అడుగుపెట్టాడు. తల్లి దగ్గరకు వెళ్ళి ఆమె కాళ్ళకు నమస్కరించాడు. తనతోటి వచ్చిన యువతిని కూడా ఆవిధంగా చేయమని సైగచేశాడు. ఆ యువతి కూడా శకుంతలమ్మ కాళ్ళకు నమస్కరించింది.

ఎంతయినా పుత్రవాత్సల్యం కొంత ఉండక మానదు. కాని కొడుకు చేస్తున్న పనిని హర్షించలేక, ఆప్యాయంగా దీవించలేక ఆమె బొటబొటా కన్నీరు కార్చింది.

ఆమె సందిగ్ధం గమనించిన శంకరయ్య "వాళ్లని ఆశీర్వదించు శకుంతలా" అన్నాడు గంభీరంగా.

శకుంతలమ్మ ఆయన వంక అదోలా చూసింది "ఇంత చేశాక కూడా నీకింకా వీడిమీద ప్రేమెందుకన్నయ్యా" అని కళ్ళతోనే ప్రశ్నించింది.

ఆయన కన్నులతోనే ఆమెకు సర్దిచెప్పాడు. 'పగవారిని కూడా ప్రేమించు' అనే సందేశం ఉందాచూపులో.

శకుంతలమ్మ తన మనసుకు సర్దిచెప్పుకుని, ఆ ఇద్దరి తలలమీదా చేతులుఉంచి మనసులోనే ఏదో ఆశీర్వదించింది. తర్వాత వారిద్దరూ శంకరయ్య దంపతులకు కూడా ఆ విధంగానే నమస్కరించారు. గుండెలోతులలో ఎంత బాధ దాగిఉన్నా ఆ ఇద్దరినీ మనస్ఫూర్తిగానే ఆశీర్వదించాడు ఆయన.

ఆవిధంగా ఆశీర్వాదాల కార్యక్రమం ముగిసింది.

అప్పటివరకూ ప్రేక్షకుడిలా దూరంగా ఉన్న ఆ మధ్య వయస్కుడు శంకరయ్య దగ్గరకు వచ్చి ఆయన చేతిని తన చేతిలోకి తీసుకుని అన్నాడు "నాపేరు రాజారావు... ఆమె నా కూతురు గాయత్రి, ఐ.పి.యస్"

ఆయనకు తన మేనల్లుడితోపాటు వచ్చిన వారెవరో అర్థమయింది. విషయం బోధపడింది. నమస్కారాలు, పరిచయాల వెనుకగల అసలు కారణమేమిటో ఆయన ఊహించగలిగాడు.

రాజారావు పరిచయానికి జవాబుగా నవ్వి "రండి కూర్చుందాం" అన్నాడాయన కుర్చీల వైపు నడుస్తూ. వారు వరండా దాటి హాలులోకి వెళ్ళారు. అక్కడున్న కుర్చీలలో శంకరయ్య, రాజారావు, చంద్రశేఖరం కూర్చున్నారు. గాయత్రి కూడా వారి ఎదురుగా మరో కుర్చీలో కూర్చుంది.

"మీగురించి చంద్రశేఖర్ చాలా చెప్పాడు. తను ఇప్పుడుండే స్థితికి కారణం మీరేనని అన్నాడు. మీ మంచితనాన్ని ఎప్పుడూ పొగుడుతూ ఉంటాడు" అన్నాడు రాజారావు.

శంకరయ్య విరక్తిగా నవ్వాడు. "వాడు నా మంచితనాన్ని పొగడుతాడు. కాని ఈ మంచితనానికి తగిన విలువ ఇవ్వలేకపోయాడు. అత




డి ఉన్నతస్థితికి కారణం నేనేనని చెప్పుకుంటు న్నాడు. కాని నాస్థితినే తారుమారు చేశాడు. మాటలతో కృతజ్ఞతలు చెప్పుకోవటంకాదు. చేతలతో కూడా కృతజ్ఞత చూపించగలగాలి' మనసులోనే అనుకున్నాడాయన.

ఒక నిముషంపాటు శంకరయ్యను పొగిడాడు రాజారావు. అతడి పొగడ్తలు విని పొంగిపోలేదు శంకరయ్య. 'ఇతగాడు మంచికారాయుడిలా ఉన్నాడే' అనుకున్నాడు మనసులో.

పదినిముషాలు తర్వాత రాజారావు అసలు విషయంలోకివచ్చాడు."శంకరయ్యగారూ! మా అమ్మాయి గాయత్రికి, మీ మేనల్లుడు చంద్రశేఖరంకు పెళ్ళి నిశ్చయమయింది. చంద్రశేఖరంకు పెద్దలుగా మీరుతప్ప మరెవరూ లేరని అన్నాడు. కాబట్టి ఈ పెళ్ళి మీ చేతులమీదుగా జరిపించాలి... ఏదో విషయంలో మీకు, అతడితో కొద్దిపాటి మనస్పర్ధలు ఉన్నాయన్న విషయం కూడా చెప్పాడు నాకు. కాని... జరిగిపోయిన సంగతులు గతం అనుకోండి. అవేవీ మనసులో పెట్టుకోకండి. మీ మేనల్లుడిని మునుపటిలానే ఆదరించి ఈ పెళ్ళి జరిపించండి...".

ఆయన బలవంతంగా నవ్వాడు. చూపులు భార్యవైపు సారిస్తే, ఆమె చప్పున తలదించుకుంది. శకుంతలమ్మను చూస్తే ఆమె తటస్థంగా ఉన్నట్టుగా అనిపించింది. ఆయన కన్నులు వసుంధర కోసం వెతికాయి. "ఆమె ఎవరికీ కనిపించకుండా ఏ గదిలో దాక్కుని ఉందో? పాపం! ఆ పిచ్చిపిల్ల తను ఉండవలసిన స్థానంలో మరొక యువతినిచూసి ఎంతగా కుమిలిపోతోందో ఏమో!" మనసు లోతులలోనే నిట్టూర్చారాయన.

తర్వాత ఎదుట నిలచిన సమస్యను గురించి అరనిముషంపాటు ఆలోచించాడు 'ఇప్పుడు తనీ పెళ్ళికి రాలేనంటే, అది తన మనసులోని స్వార్థాన్ని తెలియచేస్తుంది. తన కూతురిని కాదన్నాడని, మేనల్లుడి పెళ్ళికి కూడా వెళ్ళని పెద్దమనిషి శంకరయ్య అని గ్రామమంతా అనుకుంటుంది... లోకం అనుకుంటుంది అని కాకపోయినా అంత సంకుచితంగా ఆలోచించడం ఆయనకు చేతకాకపోయింది. ఆయనది మొదటినుండీ పెద్దమనసు. శత్రువును కూడా ఆప్యాయంగా చూడగలిగిన గొప్పగుణం. అందుకే-

"అలాగే... తప్పకుండా ఈ పెళ్ళి నా చేతులమీదుగా జరిపిస్తాను" అన్నాడాయన. ఆ మాటలు మాట్లాడేప్పుడు ఆయన గొంతు జీరపోయింది. తన్నుకువచ్చే వేదనను అతికష్టంమీద అణచుకున్నాడు.

"మీది చాలా గొప్పమనసు" చెప్పాడు రాజారావు.

శారదమ్మ, శకుంతలమ్మలు భోజన ఏర్పాట్లుకోసం వంటగదిలోకి వెళ్ళారు.

రాజారావు తన స్వంత విషయాలు చెప్పసాగాడు.

ఆయనొక కాంట్రాక్టరు. రాజకీయనాయకులతో మంచి పరిచయం ఉంది. నగరంలో రెండు బిల్డింగులు, రెండుకార్లు ఉన్నాయి. బేంక్‌లో ఎప్పుడూ రెండులక్షలు బేలన్స్ ఉంటుంది. ఆయనకు ఇద్దరు బిడ్డలు. కొడుకు డాక్టర్. అమెరికాలో సెటిల్ అయ్యాడు. కూతురు గాయత్రి ఐ.పి.యస్. పాసయి ఎ.ఎస్.పి.గా డ్యూటీలో జాయిన్ అయి ఆరునెలలే అయింది.

ఆయన కుటుంబ ఘనచరిత్ర విన్న శంకరయ్య 'ఇంత గొప్పకుటుంబంలోని యువతి పరిచయమయ్యాక, ఉన్నతాధికారిణిని పెళ్ళిచేసుకోగలిగిన అవకాశం వచ్చాక ఇంకా సాధారణ కుటుంబంలో, ఒక పల్లెటూరి పిల్లను పెళ్ళిచేసుకునేందుకు ఎవడు ఇష్టపడుతాడు?' మనసులోనే అనుకున్నాడాయన.

అయితే ఆ కుటుంబంలోనివారంతా అనుకుంటున్నదేమిటంటే గాయత్రి చంద్రశేఖరంలది లవ్‌మేరేజ్ అనే. అంతేతప్ప అది అరేంజ్డ్ మేరేజ్ అని వారు ఊహించనైనా లేదు.

జాయింట్ కలెక్టర్‌గా డ్యూటీలో జాయిన్ అయిన చంద్రశేఖరం, ఒక రాజకీయనాయకుడి ద్వారా ఆ సంబంధం గురించి విన్నాడు. రాజారావుకు కూడా చంద్రశేఖరం పొజిషన్ నచ్చింది. పెళ్ళిచూపుల ఏర్పాట్లు జరిగాయి. వధూవరులు ఒకరినొకరు చూసుకున్నారు. ఇష్టపడ్డారు. అంతే పెళ్ళి నిశ్చయమయిపో

యింది.

ఇదేదీ శంకరయ్యకు తెలియదు. చంద్రశేఖరం చెప్పిన అబద్ధాన్నిబట్టి వారిద్దరికీ ఎలాగో పరిచయం అయింది. వారు ప్రేమించుకున్నారు పెళ్ళిచేసుకోవాలని అనుకుంటున్నారు అన్నదే ఆయన ఊహ.

ఒక గంట మాటలు గడిపాక చంద్రశేఖరం లేచాడు. "మామయ్యా! వసుంధర ఎక్కడుంది?" అడిగాడు చుట్టూ పరిశీలిస్తూ.

"లోపల గదుల్లో ఉంటుంది చూడు" బదులిచ్చాడు శంకరయ్య.

చంద్రశేఖరం ముందుకు నడిచి ఒక్కోగది చూసుకుంటూ వెళ్ళాడు. తనగదిలోనే బోర్లావడుకుని ఉందామె మంచంమీద. నిద్రపోతుందో, మేలుకునిఉందో అర్థంకావడంలేదు. క్షణం తటపటాయించాడు.

గుమ్మానికి ఆనుకుని "వసూ" అన్నాడు అతడు.

చివ్వున తలతిప్పి చూసింది ఆమె. చప్పున పైకిలేచి నిల్చుంది. తల దించుకుని నేలచూపులు చూడసాగింది.

అతడు లోపలికి వచ్చాడు. ఆమెకు మూడు అడుగుల దూరంలో నిలబడి "ఏమిటి... నేను వచ్చి గంటసేపయినా, కనిపించకుండానే దాక్కున్నావు... ఈ బావకు కనుపించకుండా తప్పించుకోవాలనుకుంటున్నావా?" నవ్వుతూ అడిగాడు.

స్వార్థంతో తన మనసును ముక్కలుచేసిన అతడు, ఏమీ ఎరుగని నంగనాచిలా అలా ప్రశ్నిస్తుంటే ఆమెకు విస్మయం కలిగింది. చేసిన ద్రోహాన్ని ఇంత త్వరగా మరచిపోవటం ఎలా సాధ్యమా అని ఆశ్చర్యపడింది.

"అలాంటిదేమీ లేదు బావా" అందామె ఆలోచనలను అణచుకుంటూ.

"నేను చేసినపని నీకు కోపం తెప్పించిందా?" లాలనగా అడిగాడు అతడు. జవాబుగా మౌనం పాటించిందామె.

"నేను చేసినపని నీకేకాదు, మామయ్యకు కూడా బాధకలిగించిందని నాకు తెలుసుకాని ఏం చేయను? ఈ విషయంలో అసమర్థుడినయిపోయాను" చెప్పాడతను బాధగా.

'ఈ విషయంలో నువ్వు అశక్తుడివి ఎందుకు కావలసివచ్చింది?' అని ఆమె ప్రశ్నించలేదు. వాదిస్తే అతడు ఓడిపోవలసివస్తుంది అని కూడా ఆమెకు తెలుసు. వాదనల వలన ప్రయోజనంలేదనీ, పరిస్థితి పూర్తిగా చెయ్యిదాటిపోయిందనీ ఆమెకు అర్థమవుతూనే ఉంది. అందుకే అతడికి వీలయినంత దూరంలో ఉండటం మంచిదని భావిస్తోంది.

"నువ్వు రాసిన ప్రేమలేఖలన్నీ నాకు అందేవి. కాని నీకు నేను రిప్లయ్‌రాసేవాడిని కాను. కారణం మరేమిటో కాదు ఇదే. మరొకరిని పెళ్ళాడబోతూ నీ మనసుతో ఆటలాడుకోవడం ఇష్టంలేకపోయింది. అలా అని నిక్కచ్చిగా అలాంటి లేఖలు రాయవద్దని నీకు రాయలేకపోయాను. ఆ విధంగా రాసి నీమనసు బాధపెట్టడం నాకిష్టంలేకపోయింది"

'మనసును బాధపెట్టడం కాక ఇప్పుడు మాత్రం నువ్వుచేసిందేమిటి?' లోపలే అనుకుందామె. అయినా తనకీ వివరణలన్నీ ఎందుకిస్తున్నాడో ఆమెకు అర్థంకావడంలేదు. తనను కాదనుకున్న వ్యక్తి ఇక తనకు సంజాయిషీ చెప్పుకోవలసిన అవసరం ఏముంది... అదే ఊహించలేకుందామె.

అతడు చాలా తెలివైనవాడు. మనుషుల్ని ఎలా ఉపయోగించుకోవాలో అతడికి బాగా తెలుసు. అనవసరంగా ఎవరినీ శత్రువుల్ని చేసుకోవటానికి అతడిష్టపడడు. లోకంలో ఎలా బతకాలో తెలసినవాడు కాబట్టే, ఒక్కొక్కమెట్టు ఎక్కి పైపైకి ఎగబాకగలుగుతున్నాడు... పాపం. ఆ కుటుంబసభ్యులు అమాయకులు. ఎంతో హోదా కలిగి, మరెంతో గొప్పస్థితికి ఎదగబోతున్న అతడు తమ ఇంటికి రావటం అతడి మంచితనం అనుకుంటున్నారే తప్ప, అలా మంచి చేసుకోవటం అన్నది తెలివైనవారికున్న ఒక ముఖ్యలక్షణమని వారికి తెలియదు. ఎదుటివారిని మంచి చేసుకోవడం ద్వారా వారేమి పొందుతారన్నది వృథా ప్రశ్న.

ప్రస్తుతం చంద్రశేఖరం ఆ కుటుంబసభ్యులను మంచి చేసుకోవడం వెనుక ఉద్దేశం మాత్రం, జరగబోతున్న తన పెళ్ళి ఎలాంటి లోటులేకుండా జరిపించుకోవాలన్న కోరిక. తెలివయినవారు తమ కోరికలను ఎలాగయినా




సాధించుకోగలరు.

వారిద్దరూ ఆ గదిలో ఉన్నప్పుడే గాయత్రి అక్కడికి వచ్చింది. చంద్రశేఖరం ఆమెను చూసి లోపలికి పిలిచాడు. గదిలోపలికి వచ్చాక వసుంధరను పరిచయం చేశాడు.

"నా మరదలు వసుంధర"

ఆమె చేతులు జోడించింది. వసుంధర కూడా ప్రతి నమస్కారం చేసింది. "కూర్చోండి" అంది.

కూర్చున్నాక ఆమె వంక పరిశీలనగా చూసింది వసుంధర.

గాయత్రి ఐదు అడుగులా తొమ్మిదంగుళాల వరకూ ఉంది. తెల్లటి తెలుపు. విజ్ఞానంతో కాబోలు కన్నులు చాలా తేజస్సు కలిగి ఉన్నాయి. ముఖంలో ఏదో కనిపించీ కనిపించని నిర్లక్ష్యం కదలాడుతోంది. అది పోలీస్ ట్రైనింగ్ వలన వచ్చిన నిర్లక్ష్యం కావచ్చు. శరీరాకృత తీర్చిదిద్దినట్టుంది.. బావ సెలక్షన్ బాగానే ఉంది అనుకుంది వసుంధర. అంతే తప్ప ఆమెను తనతో పోల్చుకునే పని మాత్రం చేయలేదు.

"మా వసుంధరకు ఈ ఊళ్ళో చాలా మంచిపేరుంది. ఎవరికి ఏ కష్టం కలిగినా ఈవిడే ముందుంటుంది" గాయత్రి వంక చూస్తూ నవ్వుతూ చెప్పాడు చంద్రశేఖరం.

"నిజమా?" వసుంధర వంక చూసి నవ్వుతూ అడిగింది గాయత్రి.

సిగ్గుపడి తలవంచుకుంది వసుంధర.

పదినిముషాలు ఆ గదిలో కూర్చున్నాక, "వసూ... గాయత్రికి మన ఇల్లు చూపిస్తావా?" అన్నాడు చంద్రశేఖరం.

"అలాగే" తలూపి లేచింది వసుంధర.

చంద్రశేఖరం వెళ్ళి మగవారి పక్కనే కూర్చుంటే, వసుంధర గాయత్రిని వెంటబెట్టుకుని ఇల్లంతా చూపించింది. పెరటిలోనికి తీసుకువెళ్ళి తను నాటి పెంచుతున్న పూల మొక్కలను, మూడురోజుల క్రితమే ఈనిన కోడెదూడను అన్నీ చూపించింది.

వారు తిరిగి ఇంటిలోకొచ్చేసరికి భోజనానికి రమ్మని పిలుపు వచ్చింది. శంకరయ్యే మోహన్‌కుమార్‌ని కూడా పిలిపించాడు.

తను మళ్ళీ భోంచేస్తానని మొత్తుకుంటున్నా గాయత్రి బలవంతం చేయడంతో అందరితోపాటు తనూ కూర్చోక తప్పలేదు వసుంధరకు. శంకరయ్య, చంద్రశేఖరం, రాజారావు, మోహన్‌కుమార్‌లు ఒకవైపు; గాయత్రి, వసుంధర, రాములు ఒకవైపు భోజనానికి కూర్చున్నారు.

శారదమ్మ, శకుంతలమ్మలు భోజనం వడ్డించారు. అలా వడ్డిస్తున్నప్పుడే శకుంతలమ్మ తన కొడుకు, కోడలు వంక ఆప్యాయంగా చూసుకుంది. వారిద్దరిదీ సరయిన జోడు అనుకుంది. కొడుకు చేసిన నమ్మకద్రోహాన్ని ఆమె మరచిపోసాగింది.

శకుంతలమ్మ మాత్రమే కాదు శంకరయ్య, శారదమ్మలు కూడా అతడు చేసిన తప్పు మరచిపోగలుగుతున్నారు. అయితే అతడు చేసిన ద్రోహాన్ని అసలు మరచిపోలేకున్నది వసుంధర ఒక్కతే. కారణం అతడు చేసిన తప్పుకు శిక్ష అనుభవిస్తున్నది ఆమే.

భోజనాలు పూర్తయ్యాయి.

అందరూ వరండాలోనికి వచ్చాక మోహన్ కుమార్ చంద్రశేఖరంతో తనను తాను పరిచయం చేసుకున్నాడు. అతడు చంద్రశేఖరంను తన గదికి కూడా తీసుకువెళ్లాడు.

సాయంత్రం అయింది. వచ్చినవారు బయలుదేరసాగారు.

పెళ్ళికి తప్పక వచ్చేలా శంకరయ్య దగ్గర నుండి మాట తీసుకున్నాడు చంద్రశేఖరం. రాజారావు కూడా బతిమిలాడాడు.

"నా పెళ్ళికి రావా వసూ" అని చంద్రశేఖర్ అడిగితే, రాబోయిన దుఃఖం అపుకుని అతికష్టం మీద నవ్వి ఊరుకుంది వసుంధర.

ముగ్గురూ కారెక్కారు. వారి దగ్గర వీడ్కోలు తీసుకుని కారు బయలుదేరదీశారు.

కారు కదిలి వెళ్ళిపోయింది

ఆ రాక వలన కొందరి మనసులు కాస్త ఊరట చెందితే, మరికొందరి మనసులు మరింతా వ్యాకులత చెందాయి.

★ ★ ★

"మీరు నవలలు, వారపత్రికలు చదవరా?" అడిగాడు మోహన్‌కుమార్.

"చదువుతాను. కాని పెద్ద ఆసక్తేమీ లేదు" చెప్పింది వసుంధర.

మిట్టమధ్యాహ్నం వేళ అది. వారిద్దరూ వరండాలోని కుర్చీలలో కూర్చుని ఉన్నారు. శంకరయ్యా తదితరులుంతా హాలులో మధ్యాహ్నం నిద్రలో మత్తుగా మునిగిఉన్నారు.

హాస్పిటల్‌కు వెళ్ళబోతున్న మోహన్‌కు మార్ వరండాలో కూర్చుని ఉన్న ఆమెను చూసి అటుగా వచ్చాడు. అతడిని చూసి ఆమె ఆహ్వానించింది. అతడు ఆమె ఎదురు కుర్చీలో కూర్చున్నాడు. ఇద్దరూ కబుర్లలో పడ్డారు.

"మీరు చదవదలచుకుంటే నా దగ్గర చాలా తెలుగు నవలలున్నాయి. తెప్పించుకుని చదవండి... జస్ట్ టైమ్ పాస్ కోసం, అలాంటివి చదువుకోవడం! బాగుంటుంది"

ఆమె తలూపింది "అలాగే"

"మా ఇంటికి రండి. నచ్చిన నవలలు చూసి తెచ్చుకుందురుగాని" అతడు లేస్తూ చెప్పాడు.

ఆమె ఇబ్బందిగా చూసింది అతడివంక. ఆమె ఎప్పుడు కూడా ఆ గడపదాటి బయటకు అడుగుపెట్టి ఎరుగదు. అటువంటిది ఇప్పుడు ఎదురింటిలోనికి వెళ్ళాలంటే, అందులోనూ ఒక బ్రహ్మచారి ఇంటికి... భయం కూడా వేసింది.

అతడు ఆమె ఇబ్బంది గమనించినట్టుగా "మీరింతవరకూ మా ఇల్లు ఎలా ఉందో చూడలేదుకదా మా ఇల్లు చూసినట్టుగానూ, పుస్తకాలు తెచ్చుకున్నట్టుగానూ ఉంటుంది... రండి" పిలిచాడు.

"ఈరోజు కాదు... మరో రోజు వస్తాలెండి" చెప్పిందామె.

"మరో రోజు ఏమిటి... ఎదురింటిలోకి వెళ్ళేందుకు కూడా ముహూర్తం కావాలా? ఓ రెండు నిముషాలలో వచ్చేయొచ్చు రండి" చనువుగా అన్నాడు.

అతడి మీద గౌరవమో, తిరస్కరించలేని అశక్తతతో తెలియదు. ఆమె 'కాదు' అని ఖచ్చితంగా చెప్పలేకపోతోంది.

"రండి వెళ్దాం" మరోసారి పిలిచాడు అతడు.

అయిష్టంగానే లేచిందామె. ఎందుకో తెలియదు ఆమె గుండె వేగం పెరిగింది.

అతడు ముందుకు అడుగువేశాడు. తడబడే అడుగులతో అనుసరించిందామె.

వీధి వాకిలి దగ్గరకొచ్చి చూసింది. వీధిలో ఎవరూ తిరుగాడటం లేదు.

ఆమె వడివడిగా ఆ ఇంటివైపు నడిచింది. పల్లెటూరి ఆడపిల్లలకు ఆ మాత్రం భయం ఉండటం సహజం.

అతడు ఆమె ముఖంలోని భావాలను గమనించలేదు. తలుపు దగ్గర నిలబడి తాళం తీసి, లోపలికి అడుగుపెడుతూ "లోపలికి రండి" అన్నాడు.

ఆమె గడపదాటి లోపలికి అడుగుపెట్టింది. నిలబడే చుట్టూ పరికించింది. బ్రహ్మచారి గదయినా నీట్‌గా ఉంది. ఎక్కడ ఉండవలసిన వస్తువులు అక్కడ ఉండి తీర్చిదిద్దినట్టుంది.

వసుంధర నిలబడి ఉండటం గమనించి, "కూర్చోండి" అన్నాడు అతడు. ఆమె పక్కనే ఉన్న కుర్చీలో కూర్చుంది.

అతడు అల్మెరాలోనుండి బిస్కెట్ పాకెట్ తీసి ప్లేట్‌లో ఉంచి ఆమె ముందుంచాడు.

"వద్దండి" అంటూ మొహమాటపడింది వసుంధర.

"తీసుకోండి" బలవంతం చేశాడతడు. ప్లేట్‌లో చెయ్యిపెట్టక తప్పింది కాదు ఆమెకు.

ఐదునిముషాల తర్వాత అతడు ఆమెను మరో అల్మెరా దగ్గరకు తీసుకువెళ్ళాడు. అన్నట్టుగానే అందులో చాలా తెలుగునవలలున్నాయి. కొద్దిగా ఇంగ్లీషు నవలలు, తెలుగు, ఇంగ్లీషు మేగజైన్స్ ఉన్నాయి.

అవన్నీ చూసి వసుంధర కొద్దిపాటి ఆశ్చర్యంతో "మీరు పుస్తకాలు చాలా ఎక్కువగా చదివేట్టున్నారే" అంది.

అతడు సన్నగా నవ్వి "నిజమే... నేను పుస్తకాలు ఎక్కువగా చదువుతాను. కొన్ని సమయాలలో పుస్తకాలే మంచిమిత్రులనిపిస్తాయి"

ఆ మాటలలోని నిజం అర్థంకాకపోవటంతో,




మౌనంగా ఉండిపోయింది వసుంధర.

"మీకు కావలసిన పుస్తకాలు తీసుకోండి" ఆమెతో చెప్పాడు అతడు.

ప్రముఖ రచయితలుగా తను వినివున్న వారి పుస్తకాలు రెండు తీసుకుని "వెళ్తాను" అంది వసుంధర.

"వెళ్ళవచ్చు... మరికాసేపు కూర్చోకూడదూ..."

"మీరు హాస్పిటల్‌కి వెళ్ళాలికదా"

"ఈ సమయంలో పేషెంట్స్ ఎవరూ ఉండరు కాబట్టి కాసేపు ఆలస్యమయినా ఫర్వాలేదు"

ఆమె అతడికి కాస్తదూరంలో గోడకు ఆనుకుని నిలబడింది. ఇద్దరి మధ్యా ఒక నిముషంసేపు నిశ్శబ్దం ప్రవహించాక అతడు మెల్లగా అన్నాడు- "చూడండి... నేను... నేను మిమ్మల్ని 'వసూ' అని పిలవవచ్చా?"

వసుంధర ఉలికిపడింది. అతడికి అంత చనువు ఇవ్వటం తనకు క్షేమకరమేనా అని ఆలోచించింది.

అంతలోనే అతడు అన్నాడు "మీ అభిమానం, అమాయకత్వం చూస్తుంటే నాకు మీ మీద ఎంతో ఆప్యాయత కలుగుతోంది. మీకు ఒక మంచి మిత్రుడిలా మీతో మరింత చనువుగా మసలుకోవాలనిపిస్తుంది. కాని..." రెండు క్షణాలు ఆగి ఆ వాక్యాలు పూర్తిచేశాడు..." ఒక స్నేహితుడిలా మీతో చనువుగా మసలుకునే అవకాశం మీరు నాకివ్వలేదు. కనీసం మిమ్మల్ని చనువుగా కూడా పిలవలేకపోతున్నాను"

అతడు చెప్పినతీరు ఆమె సందిగ్ధాన్ని తొలగించింది. ఒక మంచి వ్యక్తి తనకు మిత్రుడు కావడంకన్నా కావలసిందేముంది అనుకుంది. అతడిని ఒక శ్రేయోభిలాషిలా భావించింది.

"అలాగే... ఇకనుండి మీరు నన్ను 'వసూ' అని పిలవండి. ఇందులో తప్పేంలేదు" చెప్పిందామె.

"థాంక్స్ వసూ" వెంటనే అన్నాడతడు. "పోతే నేను నిన్ను 'వసూ' అన్నట్టుగానే, నువ్వు నన్ను 'మోహన్' అంటూ పిలవాలి"

ఆమె కంగారుపడింది "వద్దొద్దు... మీరు నాకన్నా పెద్దవారు. మిమ్మల్ని అలా పిలవకూడదు తప్పు"

వసుంధర కంగారుకు అతడు పకపకా నవ్వాడు.

నవ్వాపి "మనిద్దరి మధ్యా పెద్దగా వయసుల తేడాలేదు. స్త్రీ పురుషుల మధ్య ఆమాత్రం వయసుల తేడాఉన్నా ఒకరినొకరు చనువుగా పేరుతో పిలుచుకోవచ్చు అది పెద్ద తప్పేంకాదు"

అతడు మెల్లగా తనను ఏ లక్ష్యంవైపు నడిపిస్తున్నాడో ఆమెకు తెలియటంలేదు. అతడు మొదట ఆమెను స్నేహితులుగా ఉందాము అన్నాడు. రెండో వాక్యంలోనే మనిద్దరం స్త్రీ పురుషులం అని గుర్తుచేశాడు... స్త్రీ పురుషుల స్నేహం మధ్య లింగబేధం గుర్తుకు రాకూడదు. అలా గుర్తురావడం అంటూ జరిగితే, అది నిజమైన స్నేహం కాదు.

ఆ విషయం వసుంధరకు తెలియదు. ఏమీ ఎరుగని ఆ పల్లెటూరి అమాయకపు పిల్ల అతడి మాటలు నమ్మింది. నమ్మి "సరే... మీ ఇష్టం" అందామె.

"ఏదీ... నన్నొక్కసారి ముద్దుగా మోహన్ అని పిలువు" అడిగాడు అతడు.

ఆమె చాలా సిగ్గుపడింది "ఇప్పుడు కాదు" తప్పించుకోజూసింది.

"ప్లీజ్" బతిమలాడాడు అతడు, దీనంగా ముఖంపెట్టాడు.

ఆమె తలదించుకుని కాలి బొటనవేలితో నేలను రాస్తూ మెల్లగా గొంతుపెగుల్చుకుని చెప్పింది "మోహన్"

అతడి ముఖంలో ఒక ఆనందవీచిక బలంగా వీచింది "థాంక్యూ వసూ" అన్నాడు అతడు.

"ఇక వెళ్దామా" అడిగింది వసుంధర.

"అలాగే వసూ" అన్నాడతడు 'వసూ' అన్న పదం నొక్కిపలుకుతూ.

ఇద్దరూ గది బయటకు నడిచారు. అతడు తలుపుకు తాళం వేశాడు.

"సాయంత్రం కలుద్దాం" వీధివాకిలి దాటేప్పుడు చెప్పాడు మోహన్‌కుమార్.



తలూపింది వసుంధర.

అతడు హాస్పిటల్ వైపు సాగిపోయాడు.

ఆమె తన ఇంటివైపు పరుగులాంటి నడకతో వెళ్ళిపోయింది.

జీవితంలో ఏపనయినా తొలిసారి చేయటమే బాధ కలిగిస్తుంది; ఆ తర్వాత ఆ తప్పును అనుసరించడం అంతబాధగా అనిపించదు.



చంద్రశేఖరం, గాయత్రిల పెళ్ళి మరో వారంరోజులలో జరగవలసి ఉంది.

తనకు పొలంపనులు ఎక్కువగా ఉండడంతో శకుంతలమ్మను ముందుగా బయలుదేరదీశాడు శంకరయ్య.

శకుంతలమ్మ కొడుకును మొదట 'ద్రోహి, కృతఘ్నుడు' అని తిట్టిందిగాని ప్రస్తుతం ఆమెకు కొడుకు మీద మునుపటంత కోపంలేదు. కోడలి స్థితిగతులు చూశాక కొడుకు మాట తప్పడంలో కాసింత అర్థం ఉంది అనుకుంది. ఇది లోకసహజం. అత్యధికశాతం మనుషులలో ఆమాత్రం స్వార్థం ఉండితీరుతుంది. కాలం మనుషులలో చాలా మార్పు తెస్తుంది. చేసిన మేలు మరిచిపోయేలా చేస్తుంది. నిన్న 'చెడ్డ' అన్న వ్యక్తిని నేడు దగ్గరకు తీసుకునేలానూ చేయగలదు. శకుంతలమ్మకు అన్నగారి మీద ఆప్యాయత తగ్గిపోలేదు. అయితే కొడుకు మీద కోపం తగ్గిపోయింది. తెంచేసుకున్నాను అనుకున్న సంబంధం తిరిగి కలుపుకోవాలనుకుంటోంది.

అన్నగారు తనను ప్రయాణానికి సన్నాహం చేసేప్పుడు మాత్రం "నేనొక్కదాన్నే ఎందుకులే అన్నయ్యా... అందరం కలిసే వెళ్దాం" అంది.

"అలాకాదులే అమ్మా... ముందుగా నువ్వు వెళ్తే వాడికి పనులలో కొంత సహాయపడినట్లుగా ఉంటుంది. నేను నాలుగురోజులాగి పెళ్ళికి రెండురోజులు ముందుగానే వస్తాను. ఇప్పుడే కదిలి వద్దామంటే... చూస్తున్నావుగా పొలంపనులన్నీ ఒక్కసారిగా వచ్చాయి. ఇప్పుడు కనుక వరికోత కోయకపోతే భారీవర్షాలు పడే సూచనలు కనిపిస్తున్నాయి"

"సరేలే అన్నయ్యా" అందామె. ఆరోజే చెల్లెల్ని తీసుకుని బస్సెక్కాడు ఆయన. టౌన్‌లో దిగాక రైల్వేస్టేషన్‌కు తీసుకెళ్ళి టిక్కెట్ తీసిచ్చి రైలు ఎక్కించాడు.

ఆ తర్వాత మూడునాలుగురోజులలో పొలంపనులన్నీ త్వరగా పూర్తిచేసి, భార్యాపుత్రసమేతంగా బస్సెక్కాడు.

ఆయన చేరేప్పటికే పెళ్ళి ప్రయత్నాలు జోరుగా జరుగుతున్నాయి. రాజారావే ఇరుపక్షాల వైపు పెద్దమనిషిలా వ్యవహరిస్తూ అన్ని ఏర్పాట్లు చేస్తున్నాడు. శంకరయ్య వెళ్ళడంతో ఆయనకు కొద్దిగా భారం తగ్గింది.

చంద్రం ఆయనను చూడడంతో "మామయ్యా... వసుంధర రాలేదా?" అన్నాడు.

"ఎలారా లంకంత కొంపను, పాడి పశువులను ఎవరూ లేకుండా వదిలేసిరావడం కష్టంకదా అందుకే వసుంధర ఇంటిదగ్గరే ఉండిపోయింది"

చంద్రం రెట్టించలేదు. ఆ జవాబుతో మౌనంగా ఉండిపోయాడు.

పెళ్ళి ఏర్పాట్లు జోరుగా జరుగుతున్నాయి. కళ్యాణ మండపాన్ని బుక్‌చేసి పెట్టుకుని ఉన్నారు. భోజన ఏర్పాట్ల కోసం ఓ హోటల్ వారికి ఆర్డరిచ్చారు. ఆహూతులు పెద్దసంఖ్యలోనే వస్తారని ఊహిస్తున్నారు. ఆహూతులలో ఎక్కువమంది రాజారావు పరిచయస్తులు, కాంట్రాక్టులకు సంబంధించిన అధికారులు, బంధువర్గం ఉన్నారు. గాయత్రి తన ఫ్రెండ్స్ సర్కిల్‌లో ముఖ్యులను కొందరిని పిలిచింది. అలాగే తన డిపార్ట్‌మెంట్‌లోని పైఅధికారులను, కింది ఉద్యోగస్తులను ఆహ్వానించింది. చంద్రశేఖర్ తన బంధువులను అందరినీ పిలవలేదు.మరీ దగ్గర సంబంధం అనుకున్న





వారికి పదిమందికి తెలియచేశాడు. ముఖ్యుల యిన స్నేహితులను కొందరిని ఆహ్వానించాడు.

పెళ్ళిరోజు కళ్యాణ మంటపం రాజకీయనాయకులు, ఇంజనీర్లు, పోలీస్ అధికారులు, కలెక్టర్లతో కళకళలాడ బోతుందని వారూహిస్తూ ఉన్నారు.

పెళ్ళిరోజు కల్యాణ మండపంముందు ఎక్కువ సంఖ్యలోనే వాహనాలు వచ్చి ఆగాయి. ఖరీదైన వ్యక్తులు చాలామంది వచ్చారు.

వచ్చిన జనాన్ని చూసి శకుంతలమ్మ మురిసిపోయింది. తన కొడుకు ఎదిగినస్థాయి తలచుకుని ఆనందపడింది. తన కొడుకు చేసిన నమ్మకద్రోహం ప్రస్తుతం తప్పుగా అనిపించడంలేదు ఆమెకు.

ఘనంగా జరుగుతున్న ఆ పెళ్ళితంతు చూస్తుంటే శారదమ్మకు మాత్రం మనసులో బాధ ముల్లులా గుచ్చుకుంటోంది. గాయత్రి పెళ్ళిపీటలమీద చంద్రం పక్కనే కూర్చున్నప్పుడు ఆమె ఎవరూ చూడకుండా కంటినీరు తుడుచుకుంది. గాయత్రి కూర్చున్న స్థానం తన కూతురిది కదా అని దుఃఖపడింది.

మనసులోకి ఏ భావమూ రానివ్వకుండా ఉన్నవాడు శంకరయ్యే ఒక్కడే. జరుగుతున్న కార్యాన్ని ఆయన నిర్మలమైన మనసుతో చూస్తున్నాడు. జరిగిపోయినది తన దురదృష్టమని అనుకుంటున్నాడే తప్ప, జరుగుతున్నది చేజారిపోతున్న తన అదృష్టమని ఆయన అనుకోవడంలేదు. అంతేకాదు ఏ క్షణాన్నయినా తన కూతురి దీనమైన ముఖం కనులముందు కదలాడినా, ఆయన ఆ ప్రతిబింబాన్ని మనసులోనుండి తుడిచివేసేందుకే ప్రయత్నిస్తున్నాడు. ఆహూతులను పలకరిస్తూ తన బాధ మరచిపోయాడు.

పురోహితుడు మంత్రాలు చదువుతున్నాడు. మరోపక్క మంగళవాయిద్యాలు మోగుతున్నాయి.

ఒక మూలగా నిలబడి ఎవరితోనో మాట్లాడుతున్న శంకరయ్యే ఎవరో అపరిచితుడు తనను పలకరించడంతో అటుగా చూశాడు.

అతడికి పాతికేళ్ళ వయస్సుంటుంది. చంద్రశేఖరంకన్నా అందంగా, హుందాగా ఉన్నాడు.

శంకరయ్యే తనవైపు చూడటంతో అతడు చేతులు జోడించి "నమస్కారమండి! నాపేరు భానుమూర్తి- చంద్రంకు స్నేహితుడిని... మీరు చంద్రం మేనమామగారు కదూ"

అవునన్నట్టుగా తలూపాడాయన. ఆ క్షణమే అతడిని ఎక్కడో చూసినట్టుగా అనిపించింది. 'చంద్రం రూమ్‌కి వచ్చినప్పుడు ఎదురయిన వ్యక్తికదా!' అని వెంటనే గుర్తు తెచ్చుకున్నాడు ఆయన. అయినా ఆ యువకుడితో మాటలు కలిపే ఉద్దేశంతో అడిగాడు- "నేను మీకెలా తెలుసు?"

"నేను, చంద్రం చాలాకాలంపాటు కలసి ఒకే రూమ్‌లో ఉన్నాం. ఆ సమయంలో చంద్రం మీ గురించి, వసుంధరగారి గురించీ ఎక్కువగా చెపుతుండేవాడు. ఆరోజు మీరు పెళ్ళి విషయం ప్రస్తావించేందుకు వచ్చినప్పుడు, తిరిగి వెళ్ళేప్పుడు నేను మీకు ఎదురుపడ్డాను. 'ఎవరని' ప్రశ్నించితే 'మీరని' చెప్పాడు చంద్రం. ఆరోజు నుండి మిమ్మల్ని గుర్తుపెట్టుకుని ఉన్నాను"

అతడి మాటలలోని సంస్కారం ఆయనను ఆకర్షించింది. అంతేకాకుండా తనను గుర్తుపెట్టుకుని పలకరించటంతో అభిమానం కలిగింది.

"ఏం.చేస్తున్నావు బాబూ?" అడిగాడాయన.

"మీ చంద్రం ఆఫీసర్‌గా ఉండిన బాంక్‌లోనే కేషియర్‌గా ఉంటున్నానండి... పోతే పోస్ట్‌గ్రాడ్యుయేషన్ పూర్తయింది. చంద్రంను చూశాక మరింత పై చదువులు చదవాలని పట్టుదల కలిగింది. ప్రస్తుతం నేనూ ఐ.ఎ.యస్ పరీక్షకు తయారవుతున్నానండీ" చెప్పాడు అతడు నమ్రతగా.

"అలాగా... మంచిది. బాగా కష్టపడు. కష్టానికి తగిన ఫలితం ఎప్పుడూ ఉంటుంది"

అతడు నవ్వి ఊరుకున్నాడు. ఇద్దరిమధ్యా ఒక నిముషంపాటు నిశ్శబ్దం.

మంగళసూత్రధారణకు మరో అర్ధగంట సమయం ఉంది. పెళ్ళితంతు చూస్తున్నవారు కొద్దిమందే. ఎక్కువమంది అల్పాహారవిందు చేస్తున్నారు.



"టిఫిన్ తిన్నావా?"

"లేదండి... అక్కడ జనం తొక్కిడి ఎక్కువగా ఉంది. కొన్త ఆలస్యమయినా ఫర్వాలేదనుకుని ఇటుగా వచ్చి మిమ్మల్ని పలకరించాను"

అయన అన్నాడు "భలేవాడివే! 'తిండికి ముందు, తగాదాకు వెనుక' అన్న సామెత వినలేదా నువ్వు... రా టిఫిన్ చేద్దువుగాని"

అతడు నవ్వుకుని ఆయనను అనుసరించి అటుగా వెళ్ళారు. శంకరయ్యే పేపర్ ప్లేట్స్‌లోకి టిఫిన్ తనే అందుకుని అతడి దగ్గరకు తెచ్చారు. "చాలా థాంక్సండి" అందుకుంటూ చెప్పాడు భానుమూర్తి. అతడు టిఫిన్ తింటుంటే ఆయన ఎదురుగా నిలబడ్డాడు.

భానుమూర్తి టిఫిన్ తింటూ మధ్యలో అడిగాడు- "వసుంధరగారు బాగున్నారా?"

ఆయన ముఖంలో ఒక బాధావీచిక కదలాడి మాయమయింది. అది అతడు గమనించాడు. అతడికి కూడా కొద్దిగా బాధగా అనిపించింది.

"బాగుంది బాబూ"

"ఈ విషయంలో చంద్రంను నేను చాలావరకూ నచ్చచెప్పాలని చూశాను. ఒక కన్నెపిల్ల మనసును ముక్కలు చేయవద్దని ప్రాధేయపడ్డాను. కాని అతడు వింటే కదా! స్వార్థం అతడికళ్ళు కప్పేసింది. ఆడంబరాలమీద వ్యామోహం తనను నమ్మకద్రోహం చేసేలా చేసింది. అతడు మానవత్వం మరచిపోయాడు"

"పోనీలే బాబూ... వాడు నాకు నమ్మకద్రోహం చేశాడని నేను బాధపడటంలేదు. ఎవరు చేసిన ఖర్మ వారు అనుభవించక మానరు" నిర్వేదంగా చెప్పాడు ఆయన.

ఘోరమైన నమ్మకద్రోహం చేసిన వ్యక్తిని

కూడా క్షమించగలిగిన ఆయన పెద్దమనసుకు అతడు జోహార్లర్పించాడు.

కొద్దిసేపు తర్వాత అతడు అన్నాడు "నేను మీ పల్లెకు రావాలని అనుకుంటున్నాను"

ఆయన ఆ మాటను మరోలా అర్థం చేసుకుని- "ఎందుకు మా పల్లెకు రావడం? అక్కడ ఏముందని?" అన్నాడు నవ్వుతూ.

అతడు కూడా నవ్వుతూ "పల్లెను చూడాలని కాదండి..." అని ఆగి రెండు క్షణాల తర్వాత తను చెప్పదలచుకున్న వాక్యం పూర్తి చేశాడు "మీతో ఓ విషయం గురించి మాట్లాడాలని"

ఆయన అతడివంక అదోలా చూశాడు. "ఏమిటి బాబూ... ఏమిటి నాతో మాట్లాడేది?" అడిగాడు ఆసక్తిగా.

"ఇప్పుడు కాదండి... కొద్దిరోజుల తర్వాత నేను మీ పల్లెకు వస్తాను. అక్కడే చెప్పదలచుకున్నదీ నా మనసులో ఉన్నదీ మీకు చెబుతాను"

అతడి మాటలు వింతగా అనిపించాయి ఆయనకు. ఆసక్తి కలిగినా విషయమేమిటని రెట్టించి అడగలేకపోయాడు.

భానుమూర్తి టిఫిన్ చేయటం పూర్తయింది. అప్పుడే మంగళవాయిద్యాలు వేగంగా మోగసాగాయి. పురోహితుడి వేదమంత్రాలు బిగ్గరగా వినిపించసాగాయి.

"సూత్రధారణ జరుగుతున్నట్టుంది... రండి వెళ్దాం"

వారిద్దరూ అటుగా నడిచారు.

చంద్రశేఖరం లేచి గాయత్రి మెడలో తాళి కడుతున్నాడు. అందరికీ అక్షింతలు పంచారు. తాళికట్టి కూర్చున్నాక ఆహూతులందరూ నూతన వధూవరుల మీద అక్షింతలు చల్లారు.

చంద్రం, గాయత్రిల పెళ్లి జరిగిపోయింది.

మరో పది నిముషాలు ఆగాక "వెళ్లొస్తానండి" అంటూ బయలుదేరాడు భానుమూర్తి.

"మంచిది బాబు" చెప్పాడు శంకరయ్య.

పార్కింగ్ ప్లేస్‌లో ఉన్న తన స్కూటర్ స్టార్ట్ చేసుకుని వెళ్లిపోయాడు అతడు.

శంకరయ్య అతడు వెళ్లిన వైపే చూస్తూ, అతడి గురించీ అతడి మాటల గురించీ ఆలోచిస్తుండిపోయాడు.

★ ★ ★

ఉదయం తొమ్మిది గంటలయింది.

ఆకాశంలో దట్టంగా మబ్బులు కమ్మి ఉన్నాయి. వర్షం ఈ క్షణమో మరో క్షణమో పడేలా ఉంది.

విశాలమైన ఆవరణ మధ్యగా ఉన్న ఆ పాతకాలంనాటి ఇంటిలో వసుంధర ఒక్కర్తే ఉంది. రంగయ్య ఉదయాన్నే చద్ది అన్నం భోంచేసి పొలానికి వెళ్లాడు. ఎనిమిది గంటలకు వచ్చి టిఫిన్ చేసి తన ఇంటికి వెళ్లిపోయాడు మోహన్‌కుమార్.

టిఫిన్ చేసిన పొయ్యి మీదనే అన్నం వండి వార్చేసింది. తమ ముగ్గురికీ కూరలు చేసేసింది. వంటపని త్వరగా పూర్తయింది.

ఆమె హాలులోనికి వచ్చి కుర్చీలో కూర్చుండి తల వెనక్కు వాల్చి పైకప్పు వంక చూస్తూ ఆలోచనల్లోకి జారుకుంది.

'తొమ్మిది గంటలయింది... అంటే ఈసరికి బావ పెళ్లి జరిగిపోయి ఉంటుంది. తన మెడలో తాళి కట్టవలసిన చంద్రం బావ మరెవరి మెడలోనో తాళికట్టి ఉంటాడు. తనెంత దురదృష్టవంతురాలు. ప్రేమించినవ్యక్తిని పొందలేని నష్టజాతకురాలు'

ఆమెలో బాధ సుడులు తిరుగుతోంది. తన పరిస్థితిమీద తనకే అసహ్యం వేస్తోంది. ఆమెకు అసహనంగా ఉంది. ఆ ఆలోచనలను అణచుకోవాలని ఎంత ప్రయత్నిస్తున్నా ఆమెకు సాధ్యపడటం లేదు. పెదవులు బిగబట్టి మనసులోని బాధను బయటపడనివ్వకుండా ఆపుకుంటోందామె.

ఆ సమయంలో తన బాధను మరిపించగలిగిన వ్యక్తి ఎవరయినా దొరికితే బాగుణ్ణు అనుకుందామె. ఎవరితోనయినా మాటలు కలిపితే మాటలమధ్య తన వ్యధ మరచిపోవచ్చు అనుకుంటోందామె.

సరిగ్గా అప్పుడే వాకిలి దగ్గర చప్పుడయింది. ఆమె చప్పున తలతిప్పిచూసింది. మోహన్‌కుమార్ వాకిట దగ్గర నిలబడి నవ్వు





తూ ఉన్నాడు.

"రండి... రండి" లేస్తూ ఆహ్వానించింది వసుంధర.

అతడు లోపలికి వచ్చి ఆమె ఎదురుగా కుర్చీలో కూర్చున్నాడు. "దీర్ఘాలోచనలో మునిగి పోయి ఉన్నారే"

ఆమె నవ్వి ఊరుకుంది.

అతడు కాసేపు నిశ్శబ్దంగా ఉండి, అప్పుడే గుర్తుకువచ్చినట్టుగా అన్నాడు "ఈసరికి మీ బావగారి పెళ్లి జరిగిపోయి ఉంటుంది కదూ?"

మౌనంగా తలాడించింది ఆమె. వాస్తవానికి అతడు ఆ ప్రస్తావన తీసుకురావడం ఆమెకి ష్టం లేదు. మరచిపోవాలనుకుంటున్న జ్ఞాపకా న్ని కెలికినట్టుగా అనిపించింది.

ఆమె మౌనంగా ఉండడంతో ఆ టాపిక్ ఆమెకిష్టం లేదని అతడు ఊహించాడు. అందుకే తిరిగి ఆ విషయం ప్రస్తావించకుండా కాసేపు మౌనం పాటించాడు.

బయట సన్నగా వర్షం చినుకులు మొదల య్యాయి. ఇద్దరి మధ్యా నిశ్శబ్దం అలము కుంది. చలిగాలి ఉండుండి లోపలికి దూసుకు వస్తోంది.

వయసులో ఉన్న ఇద్దరు స్త్రీ పురుషుల మధ్య అలాంటి మాటలు దొరకని స్థితి రాకూద దు. మాటలు సాగుతున్నంతసేపు మనసులో కల్మషం ఏర్పడదు. మౌనంతోపాటే భావ సంచ లనం మొదలవుతుంది.

"బయట వర్షం మొదలయినట్టుంది" ఏదో మాట్లాడాలి కనుక అన్నాడు అతడు.

"అవును" బదులిచ్చిందామె. లేచి వెళ్లి కిటికీ తలుపులు మూసి వచ్చింది. లోపలికి జల్లు కొట్టకుండా తిరిగి వచ్చి అతడి ఎదు రుగా కూర్చుంటూ అడిగింది "ఈరోజు హాస్పి టల్‌కి వెళ్లలేదా?"

"లేదు వసూ... ఒంట్లో కాస్త నలతగా అని పించి హాస్పిటల్‌కు సెలవు పంపించాను." చెప్పాడు అతడు.

"ఏం బాగులేదు" వెంటనే ప్ర శ్నించిందామె.

"మరేమీ లేదు. జస్ట్ నీరసంగా ఉంది అంతే"

"జ్వరం ఉందా?"

"ఏమో... చూసుకోలేదు"

ఆమె చప్పున లేచి అతడి నుదుట మీద చెయ్యి వేసి చూసింది వేడిగా అనిపించలేదు. ఆమె చెయ్యి తీసెయ్యబోతుంటే అతడి చెయ్యి ఆమె చేతిమీద పడింది. ఆమె ఉలికిపడి అతడి కన్నులలోకి చూసింది.

మోహన్‌కుమార్ చూపులు తనవంక జా లిగా చూస్తున్నాయి. ఆ చూపులు తనను దేనికోసమో ప్రార్థిస్తున్నట్లుగా ఉన్నాయి. అతడి చూపులకు అర్థమేమిటో ఆమెకు వెంటనే బోధ పడింది.

వసుంధర తన చేతిని చప్పున వెనక్కు లాక్కునేందుకు ప్రయత్నించింది. కాని అతడి చెయ్యి తన చేతిని మరింత గట్టిగా బిగించింది. అతడు గొణిగినట్టుగా అన్నాడు "ప్లీజ్ వసూ"

పరాయి పురుషుడు తనను తొలిసారిగా తాకాడు. ఆ స్పర్శ ఆమెకు కొత్తగా అని పించింది.

అయితే ఆ స్పర్శానుభవం దానికన్నా ఆమె మెదడు తన ఉనికికి భంగం కలిగించుకోవ ద్దని హెచ్చరించసాగింది.

"వద్దు... వద్దు" అంటూ అతడి నుండి దూరంగా జరిగే ప్రయత్నం చేయసాగిందామె.

అతడు తన మరో చేతిని ఆమె నడుము చుట్టూ పోనిచ్చి మరింత దగ్గరకు తీసుకోసాగా డు.

"వసూ... ఒక్కసారి... ఒకే ఒక్కసారి"

"వద్దు... ఇలా చేయడం తప్పు" అతడి నుండి తప్పించుకునే ప్రయత్నంలో గింజుకో సాగిందామె.

"నేను... నేను నిన్ను పెళ్లిచేసుకుంటాను"

ఆ స్థితిలో కూడా ఆమె ఆశ్చర్యపడింది. ఒక్కక్షణం అచేతనురాలయి అతడి వంక చూసింది.

అతడి చూపులు జాలిగా, తనను నమ్మమ న్నట్టుగా చూస్తున్నాయి.

ఆమెలో అమాయకత్వంపాలు జాస్తి. ఎదు

టివ్యక్తిని నమ్ముతుంది. ఆ క్షణం కూడా ఆమెకు పెళ్లిమీద కోరిక లేదు. కామం అసలే కాదు. కాని... కాని ఏ బలహీనతతో ఆమెను కనురెప్పపాటు కాలం సందిగ్ధావస్థలో పడేసింది.

మగవాడికి ఆ క్షణకాలం చాలు మనిషిని లొంగదీసుకునేందుకు. అతడి చేతులు ఆమెలోని స్పందనాకేంద్రాలను మృదువుగా తడుమసాగాయి. ఆమెలో భావసంచలనం మొదలయింది. విచక్షణ నశించిపోసాగింది.

"వద్దు... వద్దు..." ఆ పరిస్థితిలో కూడా గొణిగిందామె.

అయితే అతడు ఆగలేదు. తన పని తను చేసుకుపోసాగాడు.

బయట వర్షం జోరుగా కురవసాగింది. ఒక మెరుపు మెరిసింది. వెంటనే ఆకాశం భయంకరంగా ఉరిమింది.

ఆమె ప్రతిఘటించడం పూర్తిగా మానేసింది అలా అని సహకరించనూలేదు. అతడు ఆమెన్ను ఆక్రమించుకోసాగాడు... మొత్తం మీద విజయం సాధించాడు. విజయగర్వంతో ఆమె శరీరంతో ఆటలాడుకున్నాడు.

ఆ గదిలోని గాలి జరుగుతున్న విషయాన్ని నిశ్శబ్దంగా చూస్తోంది.

బయట వర్షం ఆగింది.

అతడి వేడి తగ్గింది.

పెరటి లోపల ఉన్న కొబ్బరిచెట్టు మీద వాలిన వర్షపునీరు మెల్లగా కిందికి జారుతుంటే జరిగిన పనిపట్ల ఆ చెట్టు రోదిస్తున్నట్టుగా ఉంది.

ఒంటికి బట్ట చుట్టుకున్న వసుంధర ఓ మూలగా గోడకు ఆనుకుని వెక్కివెక్కి ఏడవసాగింది. విచక్షణ మరచో, అతడి మాటలకు కరిగో ఆ క్షణం అతడికి లొంగిపోయిందిగానీ ఇప్పుడు ఆలోచిస్తుంటే తనెంత ఘోరమయిన నేరంచేసిందో ఆమెకు అర్థమవుతూ ఉంది. ఆ తప్పుపట్ల ఆమె వణికిపోతోంది.

అతడు ఆమె దగ్గరగా వచ్చి భుజం మీద చెయ్యివేశాడు. లాలనగా "వసూ... జరిగిపోయింది తప్పే. తెలియని ఆవేశంలో నేనూ పొరపాటుగా ప్రవర్తించాను అందుకే నేనిప్పుడు బాధపడుతున్నాను కాని ఈ తప్పును తప్పుగా మిగిలిపోనివ్వను. దానిని సరిదిద్దే ప్రయత్నం చేస్తాను" అన్నాడు.

ఆమె అతడి వంక నిస్తేజంగా చూడసాగింది. మాట కూడా పలుకలేనంత అశక్తురాలయిందామె. ఆమెను మరింత నమ్మించే ప్రయత్నంలో అతడు... "నా మాటను నమ్ము వసూ... నేను నిన్ను మోసం చేయను. నిన్ను పెళ్లిచేసుకు తీరతాను" అన్నాడు.

ఆ మాట ఆమె మనసును కాస్త ఊరట చెందేలా చేయసాగింది. హిమపర్వతంలా పెరిగి ఉన్న దుఃఖం అతడి వెచ్చని మాటలకు మెల్లగా కరిగిపోసాగింది.

ఆమె గొంతు పెగల్చుకుని, అతి కష్టంమీద మాటలు కూర్చుకుని అడిగింది "మోహన్... నువ్వు... నువ్వు పెళ్ళాడి తీరతావుకదూ?"

అతడు ఆమె చెయ్యి అందుకుని చేతిలో చెయ్యివేశాడు "నేను నిన్ను తప్పకుండా పెళ్ళాడి తీరతాను"

ఆమె రోదన ఆగింది. అగాధంలో కూరుకుపోతున్న మనిషికి చిన్న ఆధారం దొరికి ఒడ్డుకుచేరి 'అమ్మయ్యా... బతికి బయటపడ్డాను' అని అనుకున్నట్లుంది. అప్పుడు జరిగిపోయిన దాన్ని మరిచిపోయి జరగబోతున్న మంచిని తలచుకుని ఊరట చెందసాగింది. అంతకన్నా తను చేయగలిగింది మరేమీ లేదని ఆమెకు అర్థమయిపోయింది.

"ఐ లవ్ యూ సోమచ్ వసూ" ఆమెను దగ్గరకు తీసుకుంటూ అన్నాడు అతడు. ఆమె అప్రయత్నంగానే అతడి కౌగిలిలో ఒదిగిపోయింది.

కాస్త తెరపిచ్చిన వర్షం తిరిగి మొదలయింది.

మధ్యాహ్నం వరకూ ఆమెతో గడిపిన అతడు, ఒకేసారి భోంచేసుకుని తన ఇంటికి వెళ్ళిపోయాడు.

ఆమె తన పడకగదిలో ఒంటరిగా కూర్చుని అనుభూతిని నెమరువేసుకోసాగింది. ఆ అనుభూతి తాలూకు ఆనందమే కాదు, మనసులో సన్నని బాధ కూడా కదలాడుతోంది. చాలాసేప

టివరకూ మనసంతా ఉద్వేగంతో నిండిపోయి ఉంది.

మధ్యాహ్నం రంగయ్యే వచ్చాడు- "చిన్నమ్మగోరూ... భోజనం పెడుదురు రండి" అని పిలిచాడు.

వసుంధర లేచి వెళ్ళి అతడికి భోజనం వడ్డించింది. భోంచేస్తున్న రంగయ్యే తలెత్తి ఆమెవంక పరీక్షగా చూశాడు. అది గమనించిన ఆమె కొన్త తడబడి "ఏమిటి రంగయ్యా" అంది.

"ఈ రోజు మీరు కొత్తగా కనిపిస్తున్నారమ్మా" అన్నాడు.

ఆమె ఘరింత కంగారుపడి "అలాంటిదేమీ లేదులే" అంది ఏమని బదులిచ్చిందో ఆమెకే అర్థంకాలేదు.

అతడు అదోలా ముఖంపెట్టి చెప్పాడు- "మీ తలకు దుమ్ము అంటుకుని ఉంది. మీ నుదుట బొట్టు చెదిరిపోయి ఉంది... అవి సరిచేసుకోండి చిన్నమ్మా"

అతడు తన తప్పును కనిపెట్టాడో లేక మరోలా ఊహించి చెప్పాడో ఆమెకు అర్థం కాలేదు. ఆమె భయపడింది. అంతకుమించి సిగ్గుపడింది.

ఆమె వేగంగా పడకగదిలోనికి పరుగెత్తింది.

రంగయ్యే భోంచేసి ఆమె గది ముందుకు వచ్చాడు. "పొలానికి వెళుతున్నా నమ్మా" చెప్పాడు. ఆమె జవాబు ఆశించనివాడిలా ముందుకు సాగి వెళ్ళిపోయాడు.

ఆ సాయంత్రం రంగయ్యే పొలం నుండి తిరిగి వచ్చాక కూడా అతడికి తన ముఖం చూపించేందుకు సిగ్గుపడింది వసుంధర. అతడిని వీలయినంతవరకూ తప్పించుకుని తిరిగింది.

★ ★ ★

"పెళ్ళి బాగా జరిగిందా?" ప్రశ్నించాడు మోహన్‌కుమార్.

"ఆ(! బాగానే జరిగింది" చెప్పాడు శంకరయ్యే.

వారిద్దరూ వీధి వరండాలో కుర్చీలు వేసుకుని కూర్చుని ఉన్నారు.

పొలాల నుండి తిరిగివస్తున్న పశువులు ఆ వీధమ్మట వెళుతూ ఉన్నాయి. వాటి కాలి నుండి లేచిన దుమ్ము పైకెగిరి వాతావరణంలో కలిసిపోతూ ఉంది.

ఆరోజు మధ్యాహ్నమే శంకరయ్యే, శారదమ్మలు పెళ్ళినుండి తిరిగి వచ్చారు. కొడుకు బలవంతం చేయడంతో శకుంతలమ్మ అక్కడే ఉండిపోయింది.

హాస్పిటల్ నుండి తిరిగి వస్తున్న మోహన్ కుమార్ ఆయనను చూసి పలకరించి, అటుగా వచ్చి కూర్చున్నాడు. మాట్లాడుతూ ఉంటే, లోపల నుండి వసుంధర రెండు ప్లేట్స్‌లో ఫలహారం తీసుకువచ్చి వారి ముందుంచింది. ఆయన అన్నాడు "తీసుకో మోహన్".

అతడు ఆమె వంక ఓరగా చూస్తూ ఆ ప్లేట్ అందుకున్నాడు. ఆ చూపులు గమనించిన వసుంధర కనిపించీ కనిపించకుండా నవ్వింది.

టిఫిన్ పూర్తయ్యాక, కాఫీలు వచ్చాయి.

వారు కాఫీ తాగుతున్నప్పుడే రంగయ్యే పొలం నుండి వచ్చాడు. శంకరయ్యే పక్కనే కూర్చుని ఉన్న మోహన్‌కుమార్‌ని చూసి ముఖం చిట్లించాడు. అయితే అతడి ముఖంలోని భావాలు వారిద్దరూ చూడలేదు.

"ఎప్పుడొచ్చారయ్యాగారూ" వరండా మెట్లు దగ్గరగా నడిచి అడిగాడు అతడు.

"మధ్యాహ్నం నువ్వు భోంచేసి ఇటు పొలానికి వెళ్ళావట, నేనిటు వచ్చాను. పొలం వరకూ రావాలనుకుంటే, ప్రయాణ బడలికగా ఉంది అలాగే నిద్రపోయాను" చెప్పి తర్వాత అడిగాడు "పొలం పనులు ఎంతవరకూ వచ్చాయి?"

"వరి కుప్ప నూర్పిడి కోసం ఏర్పాట్లన్నీ చేసి పెట్టానయ్యా, ఇక ఈరోజో, రేపో ట్రాక్టర్‌తో కుప్ప తొక్కించడం మిగిలి ఉంది. నేనూ మీ కోసమే ఎదురు చూస్తున్నాను"

"నారుమడి విషయం?"

"నీళ్ళుపెట్టి, దుక్కి దున్ని పెట్టాను. ఇక విత్తనాలు చల్లుకోవడమే ఆలస్యం"

"సరే... రేపటి నుండి ఆ పనులు త్వరగా పూర్తి చేద్దాం... ఇక నువ్వెళ్ళు" రంగయ్యే మోహన్‌కుమార్ వంక అదోలా చూసి, పశు

వుల దొడ్డివైపు వెళ్ళాడు.

"నేనూ స్నానం చేసి తర్వాత వస్తాను" అంటూ మోహన్‌కుమార్ కూడా లేచాడు. తలూపాడు శంకరయ్య. అతడు వెళ్ళిపోయాడు.

మోహన్‌కుమార్ వెళ్ళిపోయాక ఆయన కొద్దిసేపు అలాగే కూర్చుండి పోయాడు. తర్వాత పైకి లేచి పశువుల దొడ్డి వైపు వెళ్ళాడు.

రంగయ్య వామిలో గడ్డి పెరికి పశువులకు వేస్తున్నాడు. పశువులు ఆ గడ్డిని ఆత్రంగా తింటున్నాయి. శంకరయ్య వెళ్ళి పశువుల దొడ్డిలో ఒక మూలగా నిలబడ్డాడు. ఆయనను చూసి రంగయ్య అడిగాడు "ప్రయాణం కులాసాగా సాగిందయ్యా"..

"బాగానే సాగిందిరా"

తర్వాత అతడు పెళ్ళి విషయాలు గురించి అడుగుతుంటే, ఆయన బదులివ్వసాగాడు. ఆ మాటలు వింటూనే రంగయ్య తన పని పూర్తి చేశాడు.

ఆ క్షణం రంగయ్య మనసు కొద్దిగా ఊగిసలాడింది. తన 'చిన్నమ్మగోరి' మీద తన అనుమానం ఆయనకు చెప్పాలనిపించింది. ఆ మోహన్‌కుమార్‌ని ఇంటికి రానివ్వకుండా చూడమని కోరాలనిపించింది.

అతడి గుండె మోహన్‌కుమార్ మీద కసితో మండిపడుతోంది. కొద్దికాలం క్రితం వరకూ ఆ కుటుంబంలోని వ్యక్తులు సంతోషాన్ని తప్ప, దుఃఖం అనుభవించి ఎరుగరు. ఆ ఇంటిలోని వారికి సాటివారి మీద అభిమానం, ఆప్యాయత కలిగి ఉంటారు. వారు పరులకు ఉపకారమే తప్ప అపకారం చేసి ఎరుగరు. అలాంటి ఆ కుటుంబంలోని వ్యక్తులకు ఏదో దుర్దశ ప్రారంభమయినట్టుంది. వారి ఉప్పు తిన్నవారే, వారి పట్ల కృతఘ్నులయి ప్రవర్తిస్తున్నారు. తొలుత మేనల్లుడే ఆ కుటుంబంలో చిచ్చుపెడితే, ఇప్పుడీ మోహన్‌కుమార్ ఆ చిచ్చును రాజేసి భోగిమంటగా మారుస్తున్నాడు. తిన్న ఇంటి వాసాలే లెక్కపెట్టే ఈ దుర్మార్గులవలన ఆ ఇంటిలోని వ్యక్తులకు ఏ కీడు జరగబోతుందో? ఆ ఇంటి పరువు ఏం కాబోతుందో?

రంగయ్యకు భయం వేస్తోంది. జరుగుతున్నదేమిటో జరుగబోతున్నదేమిటో తెలియక అతడికి కంగారుగా ఉంది.

అతడు చిన్నప్పటి నుండీ ఆ ఇంటి ఉప్పు తిన్నవాడు. ఆ కుటుంబసభ్యులలో ఒక సభ్యుడిగా కలిసిపోయినవాడు. ఆ ఇంటిలోని పిల్లలను ఎత్తుకుని పెంచినవాడు. కాని అతడు చదువుకోలేదు. కాబట్టే అతడికి కృతజ్ఞత తప్ప, కృతఘ్నత అన్నపదం తెలియకుండాపోయింది. ఆ ఇంటిలో పెరిగిన చంద్రశేఖరంలా అతడు వారిని మోసం చేయలేదు. ఆ ఇంట అన్నంతింటున్న మోహన్‌కుమార్‌లా ఆ ఇంటిలోనివారినే కాటేయలేదు.

అతడికి చిన్నమ్మగారి పని ఏమీ నచ్చడంలేదు. ఆనోటా ఈ నోటా అతడు మోహన్‌కుమార్ గురించి కొన్ని విని ఉన్నాడు. అతడికి 'ఆడదాని వ్యామోహం' ఎక్కువ. కాంపౌండర్‌ని గుప్పిట్లో పెట్టుకుని హాస్పిటల్‌లో కూడా అరాకొరా తప్పుడు పనులు చేస్తుంటాడని విని ఉన్నాడు. అందుకు కాంపౌండర్ సహకరిస్తుంటాడు.

అటువంటి వ్యక్తితో తన చిన్నమ్మగారు మాట్లాడటమే అతడికిష్టం ఉండేది కాదు. అలాంటిది ఆ రోజు ఆమె చెదిరిన బొట్టు, నలిగిన శరీరం చూశాక మనసు బ్రద్దలయింది. అది అనుమానం కాదు. నిజమని ఖచ్చితంగా తెలుస్తూ ఉంది.

అతడి వలన రేపటిరోజు ఇంటి పరువు బజారుకెక్కబోతుందేమోనని అతడు భయపడుతున్నాడు. తన భయాన్ని యజమాని చెవినవేయాలని ఆరాటపడుతున్నాడు కాని.... మనసు మూలల ఏదో సంకోచం.

మేనల్లుడి నిర్వాకం వలన ఇప్పటికే ఆయన మానసికంగా దెబ్బతిని ఉన్నాడు. అటువంటి వ్యక్తికి ఈ విషయం తెలిస్తే మరింత కుంగిపోతాడు. జరిగిన సంఘటన తాలూకు బాధ నుండి ఇప్పుడిప్పుడే కోలుకుంటున్న ఆ కుటుంబసభ్యులు జరుగుతున్న తప్పును గురించి తెలుసుకుంటే తిరిగి మరింత వేదనకు గురవుతారు.

అందుకే అతడు తను చెప్పదలచుకున్న




విషయాన్ని మనసులోనే తొక్కిపెట్టి తన పని తాను చూసుకోసాగాడు.



శంకరయ్యే మంచివాడే తప్ప మరీ అంత అమాయకుడేం కాదు. వసుంధర, మోహన్‌కుమార్‌లు ఎక్కువ చనువుగా మాట్లాడుకోవటం చూస్తూనే ఉన్నాడు. ఆమె అప్పుడప్పుడూ అతడి ఇంటికి వెళ్ళడం గమనిస్తూనే ఉన్నాడు. 'ఎక్కడికెళ్ళావమ్మా' అంటే 'డాక్టర్ ఇంటికి వెళ్లి పుస్తకాలు తెచ్చుకొంటున్నాను నాన్నా' అని చేతిలోని పుస్తకాలు చూపిస్తూ బదులిచ్చేది. 'రాముని పంపించి తెప్పించుకోలేకపోయావా' అని నోటివరకూ వచ్చినా మింగేసేవాడు ఆయన ఆ మాటను. కూతురి మనసు నొప్పించడం ఆయనకు ఎట్టి పరిస్థితిలోనూ ఇష్టముండదు. ఆయన తన కూతురిని అంత అల్లారుముద్దుగా పెంచాడు.

అందుకే ఆయన మొదటిసారిగా మరో కోణం నుండి ఆలోచించాడు. ఒకవేళ వారిద్దరూ ఒకరినొకరు ఇష్టపడుతున్నారేమోనని అనుమానించాడు. ఆ ఉద్దేశంతోనే ఆ వైపు నుండి విషయాన్ని నరుక్కు రావాలనుకున్నాడు. ఒకరోజు మాటల మధ్య యధాలాపంగా అడిగినట్టుగా అడిగాడు "అన్నట్టు మోహన్... నీ పెళ్ళి ఎప్పుడు? మాకు విందు భోజనం ఎప్పుడు పెడతావు?" అప్పటివరకూ ఆయన ఏనాడూ అతడిని 'పెళ్లయిందాకాలేదా?' అని కూడా అడిగి ఎరగడు.

శంకరయ్య ప్రశ్న వినడంతోనే మోహన్‌కుమార్ ఉలిక్కిపడ్డాడు. అతడి ముఖంలో కంగారు కనిపించింది. అయితే అతడి ఫీలింగ్స్‌ను బయటకు కనపడనివ్వకుండా జాగ్రత్తపడ్డాడు. మెల్లగా నవ్వేస్తూ చెప్పాడు "భలేవారే.... నేనింకా బ్రహ్మచారిననుకుంటున్నారా? నేనో... నాకు ఎప్పుడో పెళ్లయిపోయింది. నా భార్య మా పల్లెలో మా అమ్మగారి దగ్గరే ఉంది"

ఈసారి అదిరిపడటం శంకరయ్య వంతయింది. ఆయన ముఖం తెల్లగా పాలిపోయింది. అయినా తమాయించుకున్నాడు. "నీకు... నీకు పెళ్లయిందా?" అప్పటికీ విస్మయంగానే ప్రశ్నించాడు.

"నేను అబద్ధం ఎందుకు చెబుతాను?"

ఆయన తన భావాలను అణచుకున్నాడు "అరే... నేనింకా నీకు పెళ్లి కాలేదనుకుంటున్నాను" అన్నాడు.

"రెండు సంవత్సరాలక్రితమే నా పెళ్ళి జరిగిపోయిందండీ" చెప్పాడు అతడు.

శంకరయ్య మనసులోనే నిట్టూర్చాడు. తర్వాత ఆ టాపిక్‌పట్ల అంత ఇంట్రెస్ట్ లేనివాడిలా విషయం మార్చి మాట్లాడాడు.

కొద్దిసేపు మాట్లాడాక మోహన్‌కుమార్ వెళ్ళిపోయాడు.

ఆయన అసహనంగా హాలులోకి వచ్చి కూర్చున్నాడు. ఈ విషయం తన భార్యాకూతుర్లకు చెప్పాలనిపించింది. అతడు బ్రహ్మచారి కాదని తెలిస్తే, తన కూతురు అతడి మీద ఏవైనా ఆశలు పెంచుకుంటూ ఉంటే తెంచుకుంటుందని ఆయన ఉద్దేశం. కాని అప్పటికే ఆమె తన సర్వస్వం సమర్పించిందని ఆయనకు తెలియదు.

ఏదో పని మీద అటుగా వచ్చిన శారదమ్మను పిలిచాడాయన "ఏమే... నీకీ విషయం తెలుసా? మోహన్‌కుమార్‌కి ఇంకా పెళ్లికాలేదని కదూ మనం అనుకుంటున్నాం. లేదు... అతడికి పెళ్లయిందట. ఈరోజు మాటల మధ్య అతడే చెప్పాడు" అన్నాడాయన.

శారదమ్మ ఆ మాటలు విన్నది. ఆమే కాదు ఆ సమయానికి అటుగా వచ్చిన వసుంధర కూడా వింది.

మొదట ఆమె తన చెవులను తానే నమ్మలేకపోయింది. తన తండ్రి అబద్ధం చెబుతున్నాడేమోననుకుంది. కాని ఆయన ఏనాడూ ఎవరితోనూ హాస్యాలాడడు. అందుకే ఆ మాటలు ఆమెను కలవరపరిచాయి. ఆశ్చర్యాందోళన

లకు గురయింది వసుంధర.

ఆమె గుండెలలో బాంబు పేల్చిన శంకరయ్య పొలానికి వెళ్ళిపోయాడు. శారదమ్మ వంట గదిలోకి వెళ్లింది.

వసుంధర గుండె వేగంగా కొట్టుకుంటోంది. ఇది నిజమా... మోహన్‌కుమార్‌కి నిజంగానే పెళ్లయిందా? మరి... మరి అతడు తనను పెళ్ళిచేసుకుంటానని ప్రమాణం చేశాడుకదా? అంటే తనకు అబద్ధం చెప్పాడా? లేకపోతే పెళ్ళయిన వ్యక్తి తనను పెళ్ళాడతానని ఎలా అనగలిగాడు? అతడు తనను మోసంచేశాడా? అలా చేయడం ఎందుకు? కేవలం తన పాడు ఆవేశం చల్లార్చుకునేందుకేనా... హే భగవాన్... ఏమిటి నాకీ పరీక్ష?'

ఆమె మనసులో ఎన్నో ప్రశ్నలు... మరెన్నో అనుమానాలు.

వెంటనే వెళ్లి మోహన్‌కుమార్‌ను ఈ విషయం గురించి అడగాలని ఉంది. విషయం అడిగి, అందులోకి నిజానిజాలు తెల్సుకునేవరకూ మనసులోని ఆందోళన తగ్గేలా లేదు.

ఆమె ఆ ఇంటివైపు చూస్తే అతడు హాస్పిటల్‌కు వెళ్ళి ఉన్నాడు. తను కూడా హాస్పిటల్‌కు వెళ్ళాలన్నంత ఆతృత కలిగిందిగాని ఆ ఆలోచనను అణచుకుందామె.

అతడి కోసం ఎదురుచూస్తూ కూర్చుంది.

మధ్యాహ్న భోజనానికి వచ్చాడు మోహన్‌కుమార్. వీధి వాకిటనే నిలబడి ఉన్న వసుంధర అతడి వంక తీక్షణంగా చూసింది. అతడికి ఆ చూపులకు అర్థమేమిటో తెలిసిపోయింది. చూపులను తప్పించుకుని లోపలికి వెళ్ళాడు అతడు.

శారదమ్మకు తండ్రీకూతుళ్ళ మనోభావాలు తెలియవు. ఆమె అతడితో మామూలుగానే ప్రవర్తించింది. అయితే ఆ ఉదయమే తనొక కొత్తవిషయం విన్నది కాబట్టి, ఆ విషయ ప్రస్తావన మాత్రం తెచ్చింది.

"మోహన్... నీకు పెళ్ళయిపోయిందట కదా! మధ్యాహ్నం మీ అంకుల్‌గారు అన్నారు"





నోట్లో పెట్టుకున్న ముద్ద అతికష్టంమీద మింగాక అతడు బదులిచ్చాడు-

"అవును ఆంటీ... నా పెళ్ళెప్పుడో జరిగిపోయింది"

"అయితే ఆ మాట మాతో ఎప్పుడూ అనలేదేం?"

అతడు వళ్ళికిలించాడు. "ఏదీ... ఆ ప్రస్తావన మన మధ్య ఇంతవరకూ రానే లేదుకదా! 'పెళ్ళయిందా?' అని మీరు అడగలేదూ, 'పెళ్ళయిందని' నేనూ చెప్పలేదు. ఈరోజు అంకుల్ ప్రస్తావిస్తే ఆ విషయం చెప్పాను"

ఆమె అడిగింది "అమ్మాయి చదువుకుందా బాబూ?"

"పదవ తరగతివరకూ చదువుకుంది ఆంటీ! ఆమె ఎవరోకాదు మా మేనమామ కూతురే. మా మామయ్య నన్ను చిన్నప్పటి నుండీ పెంచి పెద్దచేశాడు. నన్ను చదివించింది కూడా ఆయనే. ఆ కృతజ్ఞతతోనే ఆమెను పెళ్ళాడాను. వాస్తవంలో... మా ఆవిడ అంతగా అందంగా కూడా ఉండదు కాని ఎలాగో అడ్జస్ట్ అయిపోతూ ఉన్నాను"

"ఒక అమ్మాయి మెడలో తాళికట్టాక అందం గురించీ, ఐశ్వర్యం గురించీ ఆలోచించటం అంత మంచిదికాదు బాబూ" ఆ భార్యాభర్తల మధ్య తగాదాలు ఉన్నాయని, కాబట్టే అతడు ఇంతకాలం తన భార్య గురించి చెప్పలేదని ఆమె అనుకున్నది. అందుకే అతడికి అలా నచ్చజెప్పింది.

అతడు చెప్పాడు "అందం, ఐశ్వర్యం గురించే కాదండీ... మా ఆవిడకు చాలా గర్వం కూడా. ఈ రోజుకు కూడా ఆవిడ నన్ను ఎత్తిపొడుస్తుంది 'నిన్ను చదివించి ఇంతవాడిని చేసింది మా నాన్నేకదా?', 'మా నాన్నే లేకపోయి ఉంటే నువ్వీనరికి ఏ కూలిపనికో వెళ్తుండేవాడివికదా!' అంటుంది. ఆ మాటలు వింటుంటే నాకు అసహ్యం వేస్తుంది. ఇంతకాలమయినా నాకా ఇల్లు గుర్తుకురాకపోవడానికి కారణం అదే! ఎవరికయినా నా పెళ్ళి గురించి చెప్పుకోవాలన్నా నాకు బాధ కలిగేది అందుకే..."

అతడి మనసులోని వ్యథ ఆమెకు అర్థమయింది. 'పాపం... కలహాల కాపురం కాబోలు' అనుకుంది. ఆమెకు అతడి మీద కొద్దిగా జాలి

కూడా కలిగింది.

వసుంధర వంటగది బయటచేరి లోపల సంభాషణంతా వింటోంది. ఆమె అలా వింటోందని లోపలున్న మోహన్‌కుమార్‌కి తెలుసు. ఆ కారణానే అతడు తన జరిగిపోయిన పెళ్ళి వెనుక ఉన్న కథను జాలిగొలిపేలా చెబుతున్నాడు. తెలివైనవాడు తను చేసిన తప్పును కూడా ఒప్పు అనిపించేలా పరిస్థితులను సృష్టించుకోగలడు. చంద్రశేఖర్ లోగడ చేసింది కూడా అదే.

"పోనీలే నాయనా... ఆ అమ్మాయి తెలిసీ తెలియనితనంతో నిన్ను బాధపెడుతున్నా నువ్వదేమీ పట్టించుకోకు. భార్యాభర్తలలో ఎవరో ఒకరు సర్దుకుపోవాలి. లేకుంటే ఆ సంసారం జరగడం చాలా కష్టం. ఈ విషయంలో కాస్త నువ్వే సర్దుకుపో"

అతడు తల అడ్డంగా ఆడించాడు- "లేదు ఆంటీ... నేను సర్దుకుపోవాలని ప్రయత్నించేకొద్దీ తను మరింత కొండెక్కి కూర్చుంటోంది. ఇప్పటికే నేను చాలా ఓపిక ప్రదర్శించాను. ఆమెను మార్చుకోవాలని ప్రయత్నించాను. ఈ విషయంలో నేను పూర్తిగా ఫెయిలయ్యాను. ఇక నాలో ఓపిక నశించిపోయింది. అందుకే నేనొక నిర్ణయానికి వచ్చేశాను..." ఆగాడు అతడు.

"ఏమిటది?" ఆసక్తిగా అడిగింది శారదమ్మ. బయట ఉన్న వసుంధర కూడా చెవులు రిక్కించింది.

అతడు బలంగా ఊపిరి పీల్చుకుని చెప్పాడు "నేను... నేను నా భార్యకు విడాకులు ఇచ్చేయాలనుకుంటున్నాను"

ఆ చోట ఒక్కసారిగా గాఢమైన నిశ్శబ్దం ఆవరించింది.

వింటున్న వసుంధర ఉలిక్కిపడింది. 'తనను పెళ్ళాడతానన్న మాటకోసం ఇలా ప్రవర్తిస్తున్నాడా? అందుకోసమే ఈ విధమైన నిర్ణయం తీసుకున్నాడా?'- అన్న అనుమానం ఆమెలో కలిగింది.

శారదమ్మ మెల్లగా అంది "తప్పు బాబూ... ఎన్ని కష్టాలుపడినా కట్టుకున్న భార్యను వదిలేస్తాననడం భావ్యం కాదు"

"మీకు తెలియదు ఆంటీ నేను ఎంతగా విసిగిపోకపోతే ఇలాంటి నిర్ణయానికి వచ్చానో మీరూహించలేరు"

"ఎంతయినా భార్యకు విడాకులు ఇవ్వటం అంత మంచి పని కాదు"

"అది తప్పనిసరి పరిస్థితి"

అతడి వెనుక ఉన్న చరిత్ర ఇది కాబోలు అనుకుంది శారదమ్మ. అతడి కష్టాలమీద జాలిపడాలో, అతడు తీసుకున్న నిర్ణయానికి బాధపడాలో ఆమెకు అర్థంకాలేదు. కాసేపు నచ్చచెప్పాక ఆమె మౌనంగా ఉండిపోయింది.

మోహన్‌కుమార్ భోజనం పూర్తయ్యాక లేచాడు. చేతులు కడుక్కున్నాక "వెళ్ళొస్తాను ఆంటీ" అని చెప్పాడు. ఆమె తలూపింది.

అతడు వంటగదిలోనుండి ఇవతలకు అడుగుపెట్టాడు. గోడవారగా ఉన్న వసుంధరను చూశాడు. అయినా ఆమెను గుర్తించనట్టుగానే తన ఇంటివైపు సాగిపోయాడు.

వసుంధర అరనిముషంపాటు అలాగే ఉండిపోయింది. అతడు చెప్పిన విషయాలు ఆమె మనసును కల్లోలపరిచాయి... అతడికి పెళ్ళయిందని చెపుతున్నదానినిబట్టి రుజువయింది. 'పెళ్ళయిన అతడు తనను ఎందుకు మోసగించాడు? మోసగిస్తూ తనను పెళ్ళాడుతాననడంలోని అసలు అర్థమేమిటి?' ఆ వివరాలు తెలుసుకోనిదే ఆమె మనసు ఊరుకునేలా లేదు.

ఆమె వీధివాకిలి దగ్గర నిలబడింది. అటు ఇటు చూసి ఆ ఇంటివైపు నడిచింది.

వసుంధర వెళ్ళేసరికి అతడు కుర్చీలో కూర్చుని పేపర్ తిరగేస్తున్నాడు. ఆమెను చూడటంతోనే పేపర్ మడిచి పక్కన పడేశాడు. ఆమెవైపు చూస్తూ అదోలా నవ్వాడు. "రా వసూ! కూర్చో" అన్నాడు.

అప్పటికే అతడు ఆమెకు సర్దిచెప్పడం ఎలా అన్నది రిహార్సల్ చేసుకుని ఉన్నాడు.

ఆమె కూర్చోలేదు. గోడకు ఆనుకుని నిలబడి చేతులు కట్టుకుంది. సూటిగా అతడి వంక చూస్తూ అడిగింది "మోహన్! నీకు... నీకు పెళ్ళయిందా?"

అతడు కూడా సూటిగానే జవాబు చెప్పాడు.

''అవును వసూ... నాకు పెళ్ళయిపోయింది. ఈ విషయం నీకు చెప్పాలనుకుంటూనే, చెప్పలేక పోయాను. ముఖ్యంగా ఆ అనుకోని సంఘటన జరిగిపోయాక నా పెళ్ళి గురించి నీతో చెప్పాలంటే భయంవేసింది. ఆ విషయం విని నువ్వు అపార్థం చేసుకుంటావేమోనని నేను భావించాను''

ఆమె అతడి మాటలు మధ్యలోనే తుంచుతూ అడిగింది ''మరి నన్ను పెళ్ళిచేసుకుంటానని మాట ఎందుకిచ్చావు? నన్ను ఎందుకు మోసం చేశావు?'' ఆ మాట అడిగేప్పుడు ఆమె గొంతు జీరపోయింది.

''...నిన్ను మోసం చేయాలనే ఉద్దేశం నాకు లేదు. అలాగే నా భార్యకు విడాకులు ఇవ్వాలనే నిర్ణయం కూడా నేనప్పటికి తీసుకోలేదు. ఆరోజు అనుకోకుండా ఆ సంఘటన జరిగిపోయింది. ఆ సమయంలో ఆవేశంతోనే అయినా నేను స్థిరమైన నిర్ణయం తీసుకున్నాను. నా భార్యవలన నాకు సుఖంలేదు. ఆమె అంటే నాకిష్టంలేదు. అటువంటప్పుడు ఆమెను విడిచిపెట్టి నిన్ను చేపట్టాలనే ఆలోచన నాకు కలిగింది. ఆ ఆలోచన సరయినదని నిర్ణయించుకున్నాకే నేను నీకు మాట ఇచ్చాను. నా మాట నమ్ము... నేను నిన్ను పెళ్ళిచేసుకుంటాను. ఆ పొగరుబోతుకు విడాకులు ఇస్తాను.''

ఆమె మౌనంగా ఉంది. అతడు ఆమె ముఖంలోని భావాలు చదవాలని ప్రయత్నించి విఫలమయ్యాడు. ఆమె ముఖం భావరహితంగా ఉంది.

అతడు ఆమెను మరింత ఇంప్రెస్‌చేసే ఉద్దేశంతో చెప్పాడు... ''వసూ! నువ్వంటే నాకెంతో ఇష్టం. తొలిసారి నిన్ను చూసినప్పుడే 'ఇలాంటి అందమైన, అణకువ గలిగిన యువతి నా భార్య అయితే ఎంత బాగుండును' అనుకున్నాను. నేనొక బ్రహ్మచారిని అయివుంటే బాగుండేదనిపించింది. నా భార్య గుర్తుకువచ్చినప్పుడు మాత్రం మనసు బాధతో మూలిగింది. కొద్దిరోజులపాటు నిన్ను పలకరించాలని, నీతో చనువుగా మాట్లాడాలని పరితపించిపోయాను. నువ్వేమో మొదట్లో ముభావంగా ఉండిపోయేదానివి. మొత్తంమీద నువ్వు నన్నెంతగానో ఆకర్షించావు. ఎలాగో నీ పరిచయ భాగ్యం కలిగింది నాకు. అయితే ఆరోజు ఆ కలయికను నేను ముందుగా ఊహించలేదు. అనుకోకుండా దగ్గరయినప్పుడు కోరిక తీర్చుకోవడంకోసమే కాదు, నిన్ను నిజంగా పెళ్ళాడాలనే నేను నీకా మాట ఇచ్చాను. ఇప్పుడు నేను నిన్ను పెళ్ళిచేసుకోవాలనే అనుకుంటున్నాను... నన్ను నమ్ము...''

ఆమె గొంతు మెల్లగా పలికింది. ''నీకు పెళ్ళి కాలేదని చెప్పి, నాలో భ్రమను కలిగించి నన్ను చాలా మోసం చేశావు''.

అతడు తల అడ్డంగా ఆడించాడు. ''నువ్వు నన్ను అపార్థం చేసుకుంటున్నావు. నాకు పెళ్ళి కాలేదనే భ్రమను నీలో కలిగించాలనే ఉద్దేశం నాకు ఎంతమాత్రమూ లేదు. వాస్తవంలో మన మధ్య ఆ చర్చ ఎన్నడూ రాలేదు. ఒకవేళ వచ్చిఉంటే మాత్రం నేను నిజం చెప్పిఉండేవాడిని''.

అది ఘోరమైన అబద్ధం. ఎన్నో సమయాలలో చర్చ పెళ్ళివైపు వెళ్ళి ''మీకు పెళ్ళయిందా?'' అని తను ప్రశ్నిస్తే, అతడు నవ్వి ఊరుకునేవాడు. కాని ఆ మాటమీద ఆమె వాదించదలచుకోలేదు.

ఆమె మౌనంగా ఉండిపోవడం చూసి అతడు అన్నాడు ''వసూ... నీకిప్పుడు జరిగిన అన్యాయం ఏముంది? నేనిప్పటికీ నిన్నుపెళ్ళి చేసుకుంటాననే అంటున్నానుకదా? ఇందులో మోసం ప్రసక్తి కూడా లేదు''.

వసుంధర ఆ స్థితిలో కూడా నవ్వింది. అది నవ్వడంకాదు. దుఃఖం అధికమయితే అది నవ్వుగా కూడా మారుతుంది.

ఆమె నవ్వుతుంటే అతడు ఆమెవంక వింతగా చూశాడు. బహుశా ఈమెకు పిచ్చిపట్టలేదుకదా! అనుకున్నాడు.

వసుంధర నవ్వు ఉన్నట్టుండి ఏడుపుగా మారింది. ఆమె వెక్కివెక్కి ఏడవసాగింది. ''మోహన్... నువ్వంటున్నది ఏమిటి... నాకిప్పుడు అన్యాయం జరగలేదనా? పిచ్చివాడా! నాకు జరిగింది అన్యాయంకాక మరేమిటి? నువ్వొక బ్రహ్మచారివని, నన్ను పెళ్ళిచేసుకుంటావనే ఆశతోనే నేను నీకు సర్వం సమ





ర్పించాను. నన్ను నేనుగా నీకు అర్పించుకున్నాను. కాని చివరకు నాకు దక్కబోతున్నదేమిటి? ఒకవ్యక్తికి రెండవ భార్యను అయ్యే అవకాశం రావడం. నేనిది ఊహించలేదు. నేను ఒకవ్యక్తికి భార్యను కావాలనుకున్నానేతప్ప మరో ఇల్లాలి భర్తను నేను సొంతం చేసుకోవాలనుకోలేదు. ఒకవేళ ఆ వ్యక్తి 'నేను నీ సొంతమే' అన్నా కూడా నాకా సవతి జీవితం వద్దు. మరో ఇల్లాలి నోటి దగ్గర కూడు లాక్కుని తినేంత నీచురాలనుకాను నేను. ఒక ఇల్లాలికి సవతిమీద ఉండే క్రోధావేశాలు ఎటువంటివో నేను అర్థంచేసుకోగలను. ఆడది ఈ లోకంలో ఏదయినా భరిస్తుందిగాని, తన భర్తను మరొకరితో వంచుకోవడానికి ఎట్టి పరిస్థితిలోనూ ఇష్టపడదు...''

అతడు ఆమె మాటలు కట్ చేశాడు. "నేను నిన్ను ఆమెతో కలసి కాపురం చేయమనడంలేదు. ఆమెను విడిచిపెడతాను మనిద్దరం కలసి కాపురం చేద్దాం''.

ఆమె తల అడ్డంగా ఆడించింది. "వద్దు... ఆ నీచం నాకు వద్దు. మరో ఇల్లాలు నా కారణంగా రోడ్డుకీడ్చబడటం నాకిష్టం లేదు. మరో ఇల్లాలి బతుకు నా కారణంగా కష్టాలపాలు కావడం నేను భరించలేను. మీ ఇంటిలో నా కారణంగా కలతలు రావడం నేను సహించలేను'' ఆమె రోదన ఏమాత్రం తగ్గలేదు.

అతడు కొంచెం ఆగి అన్నాడు ''ఇందులో నీ తప్పేం లేదు. ఆమె మహా గర్విష్టి. ఆ గర్విష్టితో కాపురం చేయటం నాకు సాధ్యపడటం లేదు. అందుకే ఆమెను వదిలించుకోవాలని అనుకుంటున్నాను''

"మీరెన్ని చెప్పినా సాటి ఆడదాని బతుకు నా కారణంగా బాధలమయం కావడం నేనొప్పుకోను. ఇన్నాళ్ళూ మీరు ఆమెను భరించారు. ఈ రోజు వదిలేస్తామంటున్నారు. అందుకు కారణం నేనుగాక మరొకరని నేనెలా అనుకోగలను ఈ వసుంధరకు ఒకరికి పెట్టడం తెలుసేతప్ప మరొకరిని దోచుకోవడం తెలియదు. నీ భార్య దగ్గరనుండి నిన్ను నేను లాక్కోలేను వదిలేసెయ్... నాకు ఇచ్చిన మాటను వదిలెయ్. ఈ వసుంధర అన్ని విషయాలలో అదృష్టవంతురాలే. కాని పెళ్ళివిషయంలోనే దురదృష్టవంతురాలుగా ఉంది. నేను ప్రేమించిన బావ నన్ను కాదన్నాడు. నన్ను నేను సమర్పించుకున్న వ్యక్తిని, మరో ఆడదానిమీద కనికరంతో నేనే కాదంటున్నాను''

"నువ్వు పిచ్చిదానివి'' కాసింత కోపంగా అన్నాడు అతడు.

ఆమె రోదన కొద్దిగా తగ్గింది "నిజమే... నేను పిచ్చిదానిని. అంతేకాదు - నా శీలం చెడినా, దానిని కప్పిపెట్టుకునే ప్రయత్నంలో మరో ఆడదాని సంసారం చెడగొట్టలేని అమాయకురాల్ని''

"నీ చేతులారానే నీ భవిష్యత్తుని చెడగొట్టుకుంటున్నావు''

"నా భవిష్యత్తు చెడినా సాటి ఆడదాని బతుకుతో ఆటలాడుకోను'' స్థిరంగా చెప్పిందామె.

అతడు నిశ్శబ్దంగా ఉండిపోయాడు.

ఆమె గిర్రున వెనుతిరిగి తన ఇంటివైపు పరుగెత్తింది.

మోహన్‌కుమార్ అలాగే నిల్చుండిపోయాడు కొద్దిసేపు. తర్వాత వెళ్ళి మంచంమీద పడుకున్నాడు. ఇప్పుడు అతడి పెదాలమీద సన్నటి నవ్వు కదలాడుతోంది. చేసిన ప్రమాణం నుండి తెలివిగా తప్పించుకున్నాడు. ఆమె మనసు ఎప్పుడూ సాటివారి గురించే ఆలోచిస్తుందని అతనికి తెలుసు. ఆమె సైకాలజీ తెలుసుకునే ఆమె సెంటిమెంట్ మీద ట్రిక్ ప్లేచేశాడు. ఫలితంగా ఆమెనుండి మంచిగానే దూరమయ్యే అవకాశం పొందాడు.

కాముకులకు స్త్రీమీద జాలి ఉండదు. వారు తమ హీనమైన కోరికను తీర్చుకోవడంకోసం ఎన్ని అబద్ధాలయినా చెబుతారు. తమ కోరికను తీర్చుకునే ప్రయత్నంలో అవతలివారి బతుకు నాశనమవుతుందని కూడా ఆలోచించరు.

మోహన్‌కుమార్‌కి స్త్రీవ్యామోహం ఎక్కువ. తన క్షుద్రమైన కోరికను తీర్చుకోవడంలో ఉచ్ఛనీచాలు, పాపభీతి మరచిపోతాడు. ఆ సమయంలో కృతజ్ఞత అన్నది అతడి దరిచేరదు.

ఈ చివరి ఘట్టంలో పరిణామాలెలా




ఉంటాయో అతడూహించలేకున్నాడు. అందుకే అవసరవడితే ఆ ఊరు వదిలి వెళ్ళిపోయేందుకు నర్వం సిద్ధం చేసుకున్నాడు. ట్రాన్స్‌ఫర్ కోసం ప్రయత్నించసాగాడు. మరీ గొంతుమీదకు వస్తే సెలవు మీదయినా వెళ్ళిపోయి, తర్వాత ట్రాన్స్‌ఫర్ చేసుకోవచ్చని అతని ఆలోచన.

కొన్నిరకాల కోరికలు తీర్చుకునేందుకు కొంతమంది ఎంతకయినా తెగిస్తారు. అందుకోసం ఎలాంటి రిస్కునయినా ఎదుర్కుంటారు. ఆ మనస్తత్వం ఉన్న వ్యక్తే మోహన్‌కుమార్.

మోహన్‌కుమార్ మనస్తత్వాన్ని అర్థంచేసుకోలేకపోవడం వసుంధర తన జీవితంలో చేసిన తొలి తప్పు.

* * *

ఆమె కన్నీటికి తలదిండు పూర్తిగా తడిసిపోయింది. కన్నులు గంగాప్రవాహంలా సాగిపోతూ ఉన్నాయి. వేదనతో గుండెలు ఎగిరెగిరి వడుతున్నాయి.

వసుంధర మంచంమీద బోర్లావడుకుని ఏడుస్తోంది. ఏడవడం తప్ప తను చేయగలిగింది మరేమీ కనిపించడంలేదు.

మోహన్‌కుమార్ కథ తెలిశాక ఆమె అచేతనురాలయింది. ఆమె మనను మరోసారి ముక్కలయింది. ఆ ఘోరాన్ని తట్టుకోలేక ఆమె ఆత్మహత్య చేనుకోవాలనుకుంది. కాని తల్లిదండ్రులను తలచుకుని ఆమె ఆ ప్రయత్నాన్ని విరమించుకుంది.

ఆ వల్లెలో శంకరయ్యగారి కుటుంబం అంటే గౌరవాభిమానాలున్నాయి. అలాంటి కుటుంబంలో ఒక పెళ్ళికాని అమ్మాయి ఆత్మహత్య చేనుకుందంటే, ఆ ఇంటి గౌరవం ఒక్కసారిగా అడుగంటిపోదా? అదే జరిగితే తన తండ్రి గ్రామంలో ఇక తలెత్తుకుని తిరగగలడా? అసలు తన ముద్దుల కూతురు మరణించిందంటే ఆ వార్త విన్నప్పుడే ఆయన గుండె ఆగిపోతుందేమో? ఒకవేళ ఆ నమయంలో తట్టుకుని నిలబడినా ఆ తర్వాత కుళ్ళి, కృశించి నశించిపోతాడు ఆయన.

కనిపించిన ఆ తల్లిదండ్రులకు తను ఇచ్చే ఫలితం ఇదా? ఆమె మనను అంగీకరించలేదు. తన వేదనను, రోదనను మరొకరికి వంచడం ఆమెకు ఇష్టం లేకపోయింది. అందుకే ఆ బాధ మననులోనే దాచుకోదలచుకుంది. ఆత్మహత్యా ప్రయత్నాన్ని విరమించుకుంది.

దుఃఖానికి కూడా ఒక అంతం అంటూ ఉంటుంది. ఏడ్చిఏడ్చి ఆమె కన్నులలోకి నీరు ఇంకిపోయాయి.

ప్రస్తుతం ఆమె చుట్టూ శూన్యం!

ఏం చేయాలి తనిప్పుడేంచేయాలి? తన బతుకు గమ్యం ఎటువైపు? తన భవిష్యత్తు అగమ్యగోచరంగా కనిపిస్తూ ఉంది.

ఏమిటి తన బతుకు ప్రశ్నించుకుందామె. ఒకరు తన మననును ముక్కలుచేశారు; మరొకరు తన శీలాన్ని పాడుచేశారు. మనను శరీరాల స్వచ్ఛతను కోల్పోయింది తనిప్పుడు. అందుకు కారకులయిన వ్యక్తులు మాత్రం తనను తమాషాగా మోసంచేశారు. ఒకరు తనను కాదంటే, మరొకరిని తనే కాదనేలాంటి వరిస్థితులు సృష్టించబడ్డాయి.

చాలాసేపు అలాగే వడుకున్నాక ఏమీ తోచక లేచింది వసుంధర.

ఆమె తన గది వాకిట వరకూ వచ్చింది. తలుపుకు ఆనుకుని హాలులోకి చూసింది. తన తల్లిదండ్రులు గాఢంగా నిద్రపోతూ ఉన్నారు.

ఆమె నిట్టూర్చింది 'పావం... వారికి తను శీలం కోల్పోయిన విషయం తెలియదు కాబట్టే ఇంత నిశ్చింతగా నిద్రపోగలుగుతున్నారు అలా చూస్తుంటే వారిమీద ఆమెకు జాలి కలిగింది. 'లేదు... నన్ను కని పెంచినవారి నిశ్చింతను ఎట్టి వరిస్థితిలోనూ పోగొట్టను' అనుకుంది ఆమె.

అయితే తను చేసిన తప్పు త్వరలోనే ఆ ఇంటిలోని వ్యక్తులకు తెలుస్తుందని, ఆ కారణంగా మరోసారి ఆ ఇంటిలో బాధా ప్రవంచం సృష్టించబడుతుందని ఆమె ఊహించలేకపోయింది ఆ క్షణం.

ఆ సాయంత్రం వశువుల దొడ్డిలో రంగయ్యా వనిచేసుకుంటున్నప్పుడు శంకరయ్య అక్కడికి వచ్చాడు. వారిద్దరూ అప్పుడప్పుడు కాసింత చనువుగా మాట్లాడుకుంటూ ఉంటారు. ఆ

మాటలు మధ్య ఆరోజు మోహన్‌కుమార్ విషయం ప్రస్తావనకు వచ్చింది.

"రంగా... మనం ఇంతవరకూ అతడిని బ్రహ్మచారి అనుకుంటూ ఉన్నాంకదూ? కాదట. అతడికి పెళ్ళయిందని ఈరోజే చెప్పాడు"

ఆ మాట వినడంతోనే చప్పున తలతిప్పి చూశాడు రంగయ్య. "నిజమా అయ్యగారూ?" అన్నాడు నమ్మలేనట్టు.

"నిజంరా... మొదట నేనూ ఇలాగే ఆశ్చర్యపోయాను. అయినా అతడు పెళ్ళికానివాడిలానే కనిపిస్తుంటాడుకదూ?"

అతడు మిగిలిన మాటలు వినలేదు. స్వగతంగా అనుకోబోయి పైకే అనేశాడు "ఓరి దరిద్రుడా!"

శంకరయ్య అతడివంక వింత చూశాడు. మోహన్‌కుమార్‌కి పెళ్ళయిందని తెలిస్తే వాడు అతడిని అలా తిట్టడం ఎందుకో ఆయనకు అర్థంకాలేదు.

"రేయ్ రంగా... ఎందుకు అతడిని అలా అన్నావు?"

రంగయ్య ఆ మాటలు కూడా వినిపించుకోలేదు. అప్పటివరకూ అతడిలో ఏ ఆశో మిణుకు మిణుకుమంటుండింది. తన చిన్నమ్మగారూ, అతడూ శారీరకంగా కలుసుకుంటున్నారంటే ఒకవేళ వారిద్దరూ పెళ్ళిచేసుకుంటారేమోనని. కాని ఈ విషయం తెలిశాక అతడింక ఆవేశాన్ని అపుకోలేకపోయాడు. అందుకే తన యజమాని కుటుంబం పరువు నడివీధిలోకి ఈడ్చకముందే ఆ సంబంధాన్ని అరికట్టాలనుకున్నాడు. ఆ కారణానే ఆయనతో అన్నాడు

"అయ్యగారూ... ఈరోజు నుండి ఆ నీచుడిని మన ఇంటి దరిదాపులకు కూడా రానివ్వద్దు"

శంకరయ్యకు వాడి ప్రవర్తనేమీ అర్థంకావడంలేదీరోజు. ఆ డాక్టర్ మీద కసి ఉన్నట్టుగా వాడెందుకంటున్నాడో ఊహించలేకపోతున్నాడు.

"అదేమిట్రా రంగా... అతడికి పెళ్ళయిందని తెలియటంతోనే నువ్వతనిమీద ఒక్కసారిగా విరుచుకువడ్డావు. అతడికి పెళ్ళయినంతమాత్రాన్నే మన ఇంటి దరిదాపులకు రానివ్వద్దనడంలో నీ ఉద్దేశం ఏమిటి?"

"మీకు తెలియదు అయ్యగారూ! అతడు చాలా దుర్మార్గుడు. ముఖ్యంగా స్త్రీల విషయంలో..."

ఆయన అతడి మాటలను మధ్యలోనే అవుచేస్తూ "అవతలివాడికి ఎన్ని బలహీనతలు ఉంటే మనకేంరా?! ఏదో సామెత చెప్పినట్టు మన బంగారం మంచిదయితే ఎవరూ ఏం చేయలేరు" చెప్పాడాయన. తన కూతురి మీద ఆయనకు అంత నమ్మకం.

యజమానికి చిన్నమ్మగారి విషయం తన నోటితోనే ఎలా చెప్పాలో తెలియడంలేదు. కాని చెప్పక తప్పని పరిస్థితి. అప్పటికీ "అయ్యగారూ... నా మాట వినండి. అతడిని ఇంటికి రాకుండా చూడండి" బతిమలాడాడు.

"అదేలారా... ఇంతకాలం మనింట్లో మనలో ఒకడిగా కలిసిపోయినవ్యక్తిని అకారణంగా 'ఇంటికి రావద్దు' అంటే ఏం బాగుంటుంది చెప్పు?"

"అకారణంగా కాదు బాబుగారూ... నకారణంగానే..." ఆయన మాటలు మధ్యలోనే అవుచేసి చెప్పాడు అతడు.

ఆయన వెంటనే అన్నాడు "నేనూ అడగబోతున్నది అదే... ఆ కారణమేమిటో చెప్పు. అది నరయిన కారణమే అనుకుంటే నేను అతడిని మనింటికి రావద్దని చెబుతాను"

"అయ్యగారూ... నేను ఒకరిమీద అనవసరంగా చాడీలు చెబుతానా? మీరింతకాలంగా నా గురించి అర్థంచేసుకుంది ఇంతేనా?"

ఆయన తలూపాడు "నీ గురించి నాకు తెలుసురా రంగా! అనవసరంగా నువ్వేమాటా మాట్లాడవనే నేనింతసేపూ నీ మాటకు విలువనిస్తుండేది. కాని నువ్వొక్కటి ఆలోచించు ఏ కారణం చూపకుండానే నేను అతడితో 'నువ్వు మా ఇంటికి రావద్దు' అని చెప్పడం ఎట్లా? అసలు అతడిని మనింటికి రానీయకుండా చేయవలసిన అవసరం ఏమొచ్చింది? అది చెప్పు నాకు ముందు..."

రంగయ్య మళ్ళీ మొదటికి వచ్చాడు "అమ్మాయిల విషయంలో అతడు చాలా నీచంగా




ప్రవర్తిస్తాడు''

ఆయన అన్నాడు- "నేను ముందే చెప్పానుగా రంగా! మన బంగారం మంచిదయితే ఎవరూ ఏమీ చేయలేరని''

ఇక ఆవేశాన్ని ఆపుకోలేక అతడు అనేశాడు- "బంగారంలాంటి మన చిన్నమ్మగోరిని చెడగొట్టాడు కాబట్టే నాకీ బాధ''

ఒక క్షణంపాటు అతడు అన్నదేమిటో ఆయనకు అర్థం కాలేదు. అర్థంకాగానే విసురుగా వెళ్లి అతడి చెంపను ఛెళ్లుమనిపించాడు. "వెధవ గాడిదా... వయసులో ఉన్న ఆడా మగా చనువుగా మాట్లాడుకుంటే చాలు మీకు రంకుతనాలు గుర్తుకువస్తాయా? వారిద్దరూ చనువుగా మసలుకుంటున్నారని వారిద్దరికీ అక్రమసంబంధం అంటగట్టావా?'' కోపంగా అరిచాడు. ఆవేశంలో ఆయన అలా అరిచాడేగాని మనసు మూలల ఏదో అనుమానం భయంకరంగా తొలుస్తోంది. మాటజారని రంగడు ఇలా అన్నాడంటే వేరేగా ఊహించుకోవడం ఎలా? కన్నకూతురిలా ఎత్తుకుని సాకిన వసుంధర మీదనే వాడెలా అబద్ధంచెప్పగలడు... ఆయన మనసు పరిపరివిధాల ఆలోచిస్తుంది.

యజమాని తనను కొట్టినందుకు రంగయ్య బాధపడలేదు. చెంపపట్టుకుని అరనిమిషంపాటు అలాగే ఉండిపోయాడు. తన జీవితంలో యజమానిచేత చెంపదెబ్బ తినడం అదే మొదటిసారి. అయినా అతడు అదేమీ పట్టించుకోకుండా అన్నాడు "అయ్యగారూ... మీరు నన్నుకొట్టినందుకు నాకేం బాధగా లేదు. కాని మీరు అతడిని నమ్మి ఇలాగే మనింటికి రానిస్తుంటే ఈ వ్యవహారం ఎంతదూరం వెళుతుందో, ఎందరి నోళ్ళలో నానుతుందోనని నేను భయపడుతున్నాను. నేను కళ్లారా చూడకుండా ఉండివుంటే ఈ లోకమంతా ఒకటిగా నిలచి నాకు చెప్పినా నేను చిన్నమ్మగోరిని చెడుగా ఊహించి ఉండను. నేను... నేను... నా కళ్ళతో చూశాను అయ్యగారూ... ఈ పాపిష్టి కళ్ళతో ఆ దృశ్యాన్ని చూశాను. ఆరోజే మీకు చెప్పాలనిపించింది కాని వారిద్దరూ ఒకరినొకరు ఇష్టపడుతున్నారేమో, పెళ్ళిచేసుకోవచ్చేమో అనుకున్నాను. మరి పరిస్థితులు ఇలా మారిపోతే ఇంకా ఆ రహస్యాన్ని మనసులో దాచుకుని నేనెలా బాధపడగలను. రేపు ఈ వ్యవహారం రచ్చకెక్కితే తెలిసీ అడ్డుకోని తప్పు నాదే అవుతుంది'' మాట్లాడుతున్న రంగయ్య మెల్లగా తలెత్తి చూశాడు. అప్పటికే శంకరయ్య ముఖం సంధ్యవేళ సూర్యుడిలా ఎర్రగామారి ఉంది. రంగయ్యకు భయంవేసింది. అతడు ఆయన ముఖంలో కోపంచూడటం అదే ప్రథమం.

శంకరయ్య చప్పున వెనుతిరిగాడు. వడివడిగా నడుచుకుంటూ ఇంటివైపు సాగాడు. ఆవేశంలో ఆయన ఏంచేస్తాడోనని యజమాని వెనుకే పరిగెత్తాడు రంగయ్య.

ఆయన వేగంగా వసుంధర గదిముందుకు వెళ్లాడు. వాకిటకు రెండుచేతులూ ఆన్చి లోపలికి చూశాడు. ఆయన కన్నులు నిప్పులు వర్షిస్తున్నాయి. ఆవేశంగా లోపలికి చూసిన ఆయన ముఖం చప్పున ముడుచుకుపోయింది. నిప్పులు వర్షిస్తున్న కన్నులు చల్లబడిపోయాయి. ఆమెను భీకరంగా పిలవబోయిన ఆయన గొంతు జీరపోయింది.

లోపల—

మంచంమీద బోర్లాపడుకుని ఉంది వసుంధర... ఏడుస్తున్నట్టుగా ఆమె శరీరం ఎగిరెగిరి పడుతోంది.

ఆయన నాలుగు క్షణాలపాటు స్తబ్దంగా ఉండిపోయాడు... వసుంధర ఎందుకు ఏడుస్తోంది? మోహన్‌కుమార్ విషయం ఆమెకు తెలిసిందా?

అప్పటివరకూ కూతురిమీద ఉన్న కోపం ఆమెను ఆస్థితిలో చూడగానే ఒక్కసారిగా చల్లబడిపోయింది. ఆయన ఆ కూతురిని ఎంతో ప్రేమించాడు. ఆమె కంట కన్నీరు ఏమాత్రం చూడలేదు.

ఆయన గొంతు ఒక్కసారిగా ఆప్యాయంగా పలికింది "వసూ''

వసుంధర చివ్వున తలతిప్పి చూసింది. తండ్రిని చూడటంతోనే కన్నీరు తుడుచు

కుంది.

కాని అది ఆయన దృష్టిని దాటిపోలేదు.

ఆమె మంచంమీదనుండి పైకి లేచి నిలబ డింది. తలదించుకుని ఆయనవంక చూడ కుండానే ప్రశ్నించింది "ఏం కావాలి నాన్నా?"

ఆయన ఆమెవంక అదోలా చూశాడు. మెల్లగా నడుచుకుంటూ లోపలికివెళ్లాడు. ఆమె దగ్గరగా నిలబడి కూతురి తలమీద చెయ్యి ఉంచాడు.

రంగయ్య వాకిటవరకూ వచ్చి, లోపలి దృశ్యాన్ని చూసి బయటే నిలబడిపోయాడు.

"అమ్మా వనూ... ఇప్పుడే మన రంగయ్య నీ గురించి ఒక విషయం చెప్పాడు. వాడు అబద్ధంచెప్పడని నీకూ తెలుసు కాని... నేనే ఆమాటను నమ్మలేక రుజువుపరచుకునేందుకు నీదగ్గరకు వచ్చాను. చెప్పమ్మా... వాడు చెప్పిన విషయం నిజమేనా." ఆయన గొంతు అతి మృదువుగా పలికింది.

ఆమె వంచిన తలను ఎంతసేపటికీ పైకెత్త లేదు. బొటనవేలితో నేలమీద గీతలు గీస్తూ ఉండిపోయింది. చాలాసేపు తర్వాత మెల్లగా తలపైకెత్తి చెప్పింది "నిజమే నాన్నా"

ఆయన నిలుచున్నచోట భూమి కిందికి కుంగిపోతున్నట్టుగా అనిపించింది; పైకప్పు విరిగి మీదపడుతున్నట్టుగా తోచింది. తనలోని శక్తి మొత్తం పోయినట్టుగా నిలబడలేకపోయాడాయన- ఆయన మరేమీ మాట్లాడలేదు. నిశ్శబ్దంగా వెనుతిరిగాడు.

వాకిట దగ్గరున్న రంగయ్య ఆయన ముఖంలోకి చూశాడు. ఆయన ముఖం నిస్తేజంగా ఉంది. క్షణంక్రితమే కిరీటాన్ని రాజ్యాధికారాన్ని కోల్పోయిన చక్రవర్తి ముఖంలా దీనంగా కనిపించింది. ఆయన ఏ ఘోరం తలపెడతాడోనని భయపడి ఆయనను అనుసరించాలను



కున్నాడు రంగయ్య. కాని ఆయన అలాంటిదే మీ చేయలేదు. మౌనంగా వెళ్ళి హాలులోని కుర్చీలో కూర్చున్నాడు.

అటుగా వచ్చిన శారదమ్మ ఆయన వంక చూసింది. చాలా దిగాలుగా కూర్చుని ఉన్నాడా యన. ఆయనను అలాంటిస్థితిలో ఏనాడూ చూడలేదామె. చివరికి చంద్రశేఖరం కాదన్న రోజు కూడా ఆయన గంభీరంగానే ఉన్నాడు తప్ప ఇంతగా దిగాలువడలేదు. అందుకే ఆమె ఆయన దగ్గరగా వచ్చి "ఏమిటండీ అలా ఉన్నారు?" అంది.

ఆయన జవాబు ఇవ్వలేదు. ప్రశ్న తనను కాదన్నట్టుగా మరో లోకంలో ఉండిపోయాడు. ఆమె మనసు కీడుశంకించింది.

ఆమె రంగయ్య వంక చూస్తూ "ఏమిట్రా... ఈ అయ్యగారికి ఏమయింది?" ప్రశ్నించింది గాభరాగా.

రంగయ్య తడబడ్డాడు. తన నోటినుండి ఈ విషయం ఆమెకు చెప్పడం ఎలాగా అని ఆలోచించాడు. ఆమె కంగారు చూసి చెప్పక తప్పని పరిస్థితి అయింది. ఆమె ఆ ప్రశ్నను మరోసారి రెట్టించింది.

అరనిమిషం తర్వాత అతడు ఆమెను పక్కకు తీసుకువెళ్ళాడు. బలంగా ఊపిరి పీల్చుకుని, జరిగినదంతా ఆమెకు వివరించాడు.

అది వినడంతోనే ఆమె తత్తరపడింది. అంతకుమించి ఆశ్చర్యపడింది. 'లోకులు కాకులై కూసిన అపవాదులు తన కూతురు నిజం చేసిందా?' అని ఆందోళనపడింది. ఆమె వేగంగా వెనుతిరిగి గదివైపు వెళ్ళింది.

ఆమె వెళ్ళేసరికి వసుంధర ఎప్పటిలాగే వెక్కివెక్కి ఏడుస్తోంది. ఆమెకు క్షణంపాటు కూతురిమీద జాలి కలిగింది. కాని తను చేసిన పనికి వెంటనే ఆవేశం కూడా కలిగింది. ఆమె వేగంగా లోపలికి వెళ్ళి కూతుర్ని జుట్టు పట్టుకుని పైకి లేపింది. ఆవేశంగా ఆ చెంపా ఈ చెంపా గట్టిగా వాయించింది. ఆ లేత బుగ్గల మీద ఆమె చేతివేళ్ళు అచ్చుగా పడ్డాయి. అయినా ఆమె ఆగలేదు. కూతుర్ని వంచి వీపు మీద పిడిగుద్దులు గుద్దింది.

వసుంధర ఏడుపును అదిమిపట్టింది. బాధను పళ్ళ బిగువున అవుకుంది. తనను తల్లి ఏనాడూ చిన్నమాట కూడా తిట్టి ఎరగదు. అలాంటిది ఏకంగా కొడుతోందంటే మాత్రం మనసు చాలా బాధపడింది.

ఇందులో తన తప్పెంత? తనేమీ వళ్ళు కొవ్వెక్కి, కామంతో కళ్ళు మూసుకుపోయి ఆ పనిచేయలేదు. కేవలం ఒక వ్యక్తిమీద గౌరవంతో అతడి మాటలు నమ్మింది. పెళ్ళి చేసుకోబోతున్నాంకదా అనే నమ్మకంతోనే అతడికి సర్వం అర్పించింది.

కొట్టడం పూర్తయ్యాక శారదమ్మ రొప్పుతూ తిట్టడం ప్రారంభించింది "ఎంత బరితెగించావే... వళ్ళు అంతగా కొవ్వెక్కి వుంటే మాతో చెబితే ఏ వెధవనో తెచ్చి నీకు కట్టబెట్టి ఉండేవాళ్ళం కదా ఇప్పుడు నువ్వు చేసిన పని నలుగురికీ తెలిస్తే ఆయన తలెత్తుకుని తిరగగలడా? మనం ఈ పల్లెలో కాపురం చేయగలమా? ఎందుకే... ఎందుకే ఇంత ఘోరానికి తెగించావు?"

వసుంధర మనసు బాధగా ఆక్రోశించింది "అమ్మా... నేను కోరి ఈ తప్పు చేయలేదమ్మా. సాటి వ్యక్తిని నమ్మి మోసపోయానమ్మా"

తిట్టి తిట్టి అలసిపోయింది శారదమ్మ. 'ఇదంతా నా ఖర్మ' అనుకుంటూ తల కొట్టుకుంటూ అవతలికి వెళ్ళిపోయింది.

వసుంధర తిరిగి మంచంమీద వాలిపోయింది.

రాము వచ్చాడు. తన అక్క ఏడుస్తుండటం చూసి "ఎందుకక్కా ఏడుస్తున్నావ్?" అని ప్రశ్నించాడు.

ఆ పసివాడికి ఏంజవాబు చెప్పాలో తోచక మౌనంగా ఉండిపోయింది వసుంధర. వాడు తల్లి దగ్గరికి వెళ్ళి 'అక్క ఏడుస్తోందని' చెప్పినట్టున్నాడు. ఆమె కసురుకోవడం వసుంధరకు వినిపించింది.

ఆ రాత్రి ఆ ఇంటిలో పొయ్యి రాజుకోలేదు. అసలు చాలా పొద్దుపోయేవరకూ దీపంకూడా వెలిగించనే లేదు. ఆ ముగ్గురిలో ఒకరు హాలులోని కుర్చీలో, మరొకరు వంటగదిలో నేలమీద, ఇంకొకరు తన గదిలో మంచంమీద ఎవరి దుఃఖంలోవారు ఉండిపోయారు. రాము మాత్రం కాలుగాలిన పిల్లిలా అటుఇటూ తిరు





గుతూ ఉండిపోయాడు.

చాలా చీకటిపడ్డాక రంగయ్యే వచ్చి ఇంటి లోని లైట్ స్విచ్‌లు ఆన్‌చేశాడు. మెల్లగా శంకరయ్యగారి దగ్గరకు వెళ్ళి "అయ్యగారూ" అన్నాడు. ఆయన పలకలేదు. ఆయన నుండి ఎంతకూ సమాధానం రాకపోవడంతో తిన్నగా శారదమ్మ దగ్గరకు వెళ్ళి "అమ్మగారూ... మీరు ఇలా దిగులుపడితే ఎలా? లేచి పొయ్యి రాజే యండమ్మా" అన్నాడు. ఆమె కూడా బదులు పలకలేదు. ఎంత మాట్లాడించినా మాట్లాడలే దు. ఇక తను చేయగలిగింది ఏమీలేక లేచా డు.

గది పక్కగా వెళ్తుంటే లోపలి నుంచి వసుంధర ఏడుపు వినిపించింది. అతను చిన్నగా లోపలికి వెళ్ళాడు. మంచం దగ్గరగా నిలబడి "చిన్నమ్మగోరూ" అన్నాడు. ఆమె తలెత్తి చూడలేదు.

"చిన్నమ్మగోరూ... నేను నాన్నగారికి చెప్పా నని కోపంగా ఉందా?"

ఆమె బదులివ్వలేదు.

అతడే తిరిగి అన్నాడు "నీ మీద నాకేం కోపం లేదమ్మగోరూ. నా బాధంతా మన ఇంటి పరువు బయటపడుతుందనే. ఆ ఉద్దేశంతోనే నేను నాన్నగారికి చెప్పాను. అందుకే మీకు నామీద కోపం అయితే..."

ఈసారి వసుంధర తలెత్తి చెప్పింది "నీ మీద నాకు కోపం ఏమీ లేదు రంగయ్యా. నాన్నగారికి ఈ విషయం ఎలా చెప్పాలా అని నేను ఆలోచిస్తుంటే దానికి నువ్వే చెప్పి నాకెంతో సాయం చేశావు"

"ఏదయినా మీరు చేసినపని అంత మంచిది కాదమ్మా. మీరు చేసిన ఆ పని వలన ఇంటిలోనివారంతా ఎంతగా బాధపడవలసి వచ్చిందో ఒక్కసారి ఆలోచించండి" తనకున్న కొద్దిపాటి చనువు వలన మృదువుగా మంద లించాడు అతడు.

"ఆలోచించాను రంగయ్యా... నేను చేసిన తప్పువలన నా ఇంటి గౌరవానికి ఎంతటి అగౌరవం వస్తుందో ఆలోచించాను. కాని... ఇందులో నా తప్పు చాలా తక్కువ. అమాయ కంగా మోసపోయాను నేను. ఆ సంగతి తెలు సుకునేటప్పటికి ఆలస్యమయిపోయింది నేనేం చేయను"

"ఆ డాక్టరుగాడు మోసగాడని నేను ముందే ఊహించానమ్మా. నేను విన్న విషయాలు కూడా నా నమ్మకాన్ని బలపరచాయి. అప్పుడే మిమ్మల్ని హెచ్చరించి ఉండవలసింది నేనూ పొరపాటు చేశాను"

ఆమె విరక్తిగా నవ్వింది. ఆ మాటలకు ఇద్దరిమధ్య కొద్దిక్షణాలు నిశ్శబ్దం. తర్వాత అతడు అన్నాడు "అమ్మా నాన్న చాలా దిగు లుపడిపోయి ఉన్నారు. ఇంటిలో వెలుగే పోయింది. పొయ్యి కూడా వెలిగించలేదు. పోనీ మీరయినా లేచి వెళ్ళి వారిని ఓదార్చండ మ్మా"

"చిన్నదాన్ని... నాకు ధైర్యం చెప్పవలసిన వారే దిగాలుపడితే వారిని ఓదార్చే శక్తి నాకెక్క డిది?"

"ఏమిటో... ఈ ఇంటికి ఏదో శని పట్టిన ట్టుంది. లేకుంటే నాలుగునెలలు నిండక ముందే రెండు దుర్వార్తలు మనలను బాధపె ట్టడం ఏమిటి?"

ఆమె మౌనంగా ఉంది.

అతడు మరికాసేపు నిలబడ్డాక- "వెళ్లొస్తాన మ్మా" అని చెప్పి వెళ్లిపోయాడు.

ఆరోజు చాలా పొద్దుపోయేవరకూ శంకర య్య హాలులోనే అలాగే కూర్చుండిపోయాడు. బాగా చీకటిపడ్డాక ఒక స్థిరనిర్ణయానికి వచ్చా డు. నెమ్మదిగా లేచి ఎదురింటివైపు వెళ్లాడు.

సీరియస్‌గా ఉన్న ఆయన ముఖం చూసి మోహన్‌కుమార్ మొదట కంగారుపడ్డాడు. 'వ సుంధర తమ సంబంధం చెప్పేసిందా?' అని ఆందోళన పడ్డాడు. అయినా ముఖంమీదికి నవ్వు పులుముకుని "రండి... రండి" అన్నా డు.

ఆయన లోపలికి వెళ్లి గోడకు ఆనుకుని నిలబడ్డాడు.

"కూర్చోండి అంకుల్" చెప్పాడు అతడు కుర్చీ చూపిస్తూ.

ఆయన కూర్చోలేదు. తీక్షణంగా అతడివైపే చూడసాగాడు.

మోహన్‌కుమార్ ఆయన చూపులను గమ

నించాడు. అతడి గుండెలు వేగంగా కొట్టుకో వడం మొదలెట్టాయి.

"ఏమయ్యా... నీకు నేనేం కీడు చేశానని నా కుటుంబానికి ఇంత ద్రోహం తలపెట్టావు?" ఆయన గొంతు కఠినంగా ప్రశ్నించింది.

అతడు తడబడ్డాడు. జరిగిన విషయమే మిట్లో లీలగా అర్థమయింది "ఏ... ఏమ యింది అంకుల్?" అప్పటికీ బుకాయించా లని చూశాడు.

ఆయన తల అడ్డంగా ఆడించాడు- "చూ డూ... నన్నింకా బుకాయించాలని చూడకు నాకంతా తెలిసింది" అన్నాడాయన.

మోహన్‌కుమార్ తల దించుకున్నాడు. నీళ్ళు నమలసాగాడు.

ఆయన అన్నాడు- "నేను చాలా మంచివా డిని కానీ కోపం వస్తే అంతే దుర్మార్గంగా కూడా ప్రవర్తించగలను. నీవు నా కూతురిని మోసం చేశావు. అందుకు ప్రతిగా నీ శవం ఈ ఊరి చెరువులో తేలేలా చేసివుందును. మా రంగ డిని ఉసిగొల్పినా చాలు- వాడికి ప్రస్తుతం నీ మీదున్న కసికి ఎంత పనయినా చేసేయగల డు. కాని నేను మంచివాడిని. ఆ మంచిత నంతోనే నువ్వు నాకు చేసిన ద్రోహాన్ని మనసు లోనే దాచుకుని నీకొక అవకాశమిస్తున్నాను. నాకు ద్రోహం చేసిన నువ్వు నా కళ్ల ఎదురుగా తిరుగుతుంటే నేను చూసి భరించలేను. అందుకే వెళ్లిపో... ఈ ఊరు విడిచి మాకు కనిపించకుండా వెళ్లిపో. రేపు తెల్లారేలోగా నువ్వు వెళ్ళిపోవాలి అలా చేయకుంటే ఆ తర్వాత నువ్వు ఈ శంకరయ్య ఎంత దుర్మా ర్గంగా ప్రవర్తించగలడో చూస్తావు;" ఆయన కళ్లు ఎర్రగా రక్తాన్ని వర్షిస్తున్నట్టుగా ఉన్నాయి. ఆ కన్నులు చూసి భయపడిపోయాడు మోహ న్‌కుమార్.

శంకరయ్య చెప్పదలుచుకున్న నాలుగుమా టలు చెప్పాక, చప్పున వెనుదిరిగి వడివడిగా తన ఇంటివైపు వెళ్లిపోయాడు.

మోహన్‌కుమార్ చెడ్డవాడే కాదు పిరికివా డు కూడా. అతడికి పల్లెటూరి వ్యక్తుల మనస్త త్వాలు బాగా తెలుసు. అందులోనూ శంకర య్యలాంటి వ్యక్తుల సైకాలజీ మరింత బాగా తెలుసు. అలాంటి వ్యక్తులు మంచిగా వుంటే ప్రాణం ఇస్తారు; మంచి తప్పితే ప్రాణం తీస్తా రు. నిజం తెలిసిన శంకరయ్య ఏకంగా తనను హత్య చేసేందుకు ప్రయత్నించకుండా పారిపో యేందుకు తనకొక అవకాశం ఇవ్వడం తన అదృష్టం అనుకున్నాడు. అతడు ముందుగా ఆ పల్లెనుండి ప్రాణాలతో పట్నం చేరితే ఆ తర్వాత సెలవుపెట్టుకుని మెల్లగా ట్రాన్స్‌ఫర్ చేయించుకోవచ్చు. ఆ ఆనందంతోనే అతడు తన బట్టలు సూట్‌కేస్‌లో సర్దుకోసాగాడు. వస్తు వులను తర్వాత మనిషిని పంపి తెప్పించుకోవ చ్చు అనుకున్నాడు. అన్నీ సర్దుకున్నాక నిశ్చింతగా కూర్చున్నాడు.

ఆ రాత్రి శంకరయ్య నిద్రపోలేదు. హాలులో కూర్చుని వీధివాకిలి నుండి అతడి చర్యలు గమనిస్తూ వున్నాడు.

తెల్లారింది. ఊరంతా ఇంకా నిద్రలేవక ముందే పల్లెనుండి వెళ్లే తొలిబస్సులో అతడు పట్నం వెళ్లిపోయాడు.

శంకరయ్య అది చూశాక గాఢంగా నిట్టూ ర్చాడు.

కాసింత ఎండబడినాక పనిలోకి వస్తూ ఆ ఇంటివైపు చూసిన రంగయ్యకు తలుపుకు తాళం వేసి ఉండటం కనబడింది. అతడు పరుగున ఇంటిలోకి వచ్చి శంకరయ్యతో అన్నా డు "అయ్యగారూ... ఆ నీచుడు ఊరు వదిలి పారిపోయినట్టున్నాడు"

శంకరయ్య తలూపాడు "అది నాకు తెలు ను... నేనే అతడిని ఊరు వదిలి వెళ్లమని హెచ్చరించాను"

"అలా ఎందుకయ్యగారూ?" అడిగాడు రంగయ్య.

"అతగాడి ముఖం చూస్తుంటే నాకు నా కూతురికి జరిగిన ఘోరమే ఎప్పుడూ గుర్తుకు వస్తూ ఉంటుంది. అది గుర్తుకువస్తే నా మన సు నరకయాతన అనుభవిస్తుంది. ఆ మాన సికయాతన తట్టుకోలేకనే నేను అతడిని నాకు కనిపించకుండా వెళ్లిపొమ్మని బెదిరించాను"

రంగయ్య తలూపాడు "మంచిపని చేశారు అయ్యగారూ" అన్నాడు.

ఆయన అన్న మాటలు రంగయ్య ఒక్కడే





కాదు శారదమ్మ, వసుంధరలు కూడా విన్నారు. శారదమ్మ మనసులో ఎలాంటి భావమూ కద లాడలేదుగాని, వసుంధర మాత్రం దీర్ఘంగా నిట్టూర్చింది.

కొద్ది సమయం గడిచాక ఎవరూ లేనివేళ హాలులోకి వచ్చి కిటికీలోనుండి ఆ ఇంటివైపు చూసింది.

ఆ ఇంటికి వేసిన తాళంకప్ప తనను వెక్కి రిస్తున్నట్టుగా అనిపించింది. తను ఇప్పుడు శీలవతి కాదు అన్న నిజం లోకులకు తెలియని వ్వకుండా ఆ తాళంకప్ప రహస్యాన్ని దాస్తున్న ట్టుగా అనిపించింది.

అయినా తనెంత దురదృష్టవంతురాలు? మోసపోవటం తన జన్మహక్కు కాబోలు... ఆమె కంటిలో నీరు రావటంలేదు. గుండె మాత్రం రక్తాశ్రువులు వర్షిస్తోంది.



డాక్టర్ మోహన్‌కుమార్ శెలవుపెట్టి వెళ్ళిపో యాడని ఊరంతా తెలిసిపోయింది. అతడు ఆ ఊరునుండి ట్రాన్స్‌ఫర్ చేయించుకోవాలను కుంటున్నాడని కూడా ఎవరి ద్వారానో ఆ గ్రామస్తులు విన్నారు. అతడి ట్రాన్స్‌ఫర్ ప్రయ త్నానికి కారణం పర్సనల్ ప్రాబ్లమ్స్ అనుకు న్నారే తప్ప, వసుంధర కుటుంబంలో జరిగిన గొడవ అని వారికి తెలియదు. మోహన్‌కు మార్, వసుంధరల సంబంధం గురించి తెలి సిన వారు ముగ్గురే. శంకరయ్య, శారదమ్మ, రంగయ్యలు. తల్లిదండ్రులు ఎప్పుడు కూడా తమ బిడ్డల తప్పులను బయటపెట్టుకోరు. రంగయ్య కూడా వసుంధరను తన బిడ్డగానే భావించాడు కాబట్టే ఆ ఇంటి గుట్టును సొంత పెళ్లానికి కూడా చెప్పలేదు. గుట్టు తెలిసిన ఆ ముగ్గురిలోనే ఆ నిజం సమాధి కావటంతో ఆ విషయం బయటకు పొక్కేందుకు అవకాశంలే కుండాపోయింది. లోకులు కాకులు కాబట్టి ఒకరిద్దరు ఏదో కూసినా నిజం తెలిసి మాట్లాడి నవారు ఎవరూలేరు.

మోహన్‌కుమార్ ఊరు విడిచి వెళ్ళేందుకు తను కారకుడని ఊరివారికి తెలియకపోవ డంతో శంకరయ్య కాస్త తృప్తిగా ఫీలయ్యాడు. ఆ విషయమే కనుక ఊరివారందరికీ తెలి సివుంటే, తను ఆ పల్లెను విడిచిపెట్టి వెళ్ళిపో వలసినంత అవమానకర పరిస్థితులు ఎదుర య్యేవి. అంతవరకూ తను అదృష్టవంతుడేన నుకున్నాడు ఆయన. అయితే తన దురదృ ష్టం పసికందు రూపంలో కూతురి కడుపులో పెరుగుతోందని ఆయనకు తెలియదు. అది తెలియని ఆయన ఒక గండం గడిచిందని ఒకింత సంతోషపడుతున్నాడు. కానీ మనసు మూలలమాత్రం తన కూతురు శీలం పోగొట్టు కుందనే బాధ గుండెలను పిండిచేస్తూనే ఉంది.

ఆ ఇంటిలో ఒక రకమైన స్తబ్దత అలము కుని ఉంది. శారదమ్మ లేచి వంటపని, ఇంటి పనీ చేస్తోందేగానీ ఆమెలో మునుపటిలా ఉత్సాహంలేదు. దెబ్బమీద దెబ్బ తగలటంతో ఆమె పూర్తిగా కుంగిపోయింది. చంద్రశేఖరం, మోహన్‌కుమార్‌లు ఇద్దరూ తమ కుటుంబా న్ని మోసంచేశారు. ఆ ఇంటిలో భోంచేసి, ఆ ఇంటిలోని వ్యక్తులకే ద్రోహం తలపెట్టారు. ఆమె ఇప్పుడు ఎవరితోనూ ఇదివరకటిలా సంతోషంగా మాట్లాడలేకపోతోంది. ఇరుగుపొ రుగులతో అసలు మాట్లాడటమే మానివే సింది. వారు మాట్లాడించినా ముక్తసరిగా మాట్లాడి పంపించేసేది. ఇప్పుడు ఆమె వసుంధర ముఖం చూసేందుకు కూడా ఇష్టప డటంలేదు. కూతురి ముఖం చూస్తుంటే బాధ, దుఃఖం ఎగదన్నుకు వచ్చేవి. కన్నబిడ్డే తన కళ్లకు ఒక శత్రువులా కనిపించేది. కూతురే ఒకవేళ 'అమ్మా' అని ఆప్యాయంగా పిలిచినా ఆమె చప్పున తల తిప్పుకుని తనపనిలో మునిగిపోయేది. ఆ క్షణం ఆ తల్లిమనసు ఒకింత జాలిపడినా, కూతురు చేసిన ఘోర మైన తప్పు ఆమె మనసును క్షణంలోనే కఠి నంగా మార్చివేసేది. దాంతో ఆమె బిడ్డను

అప్యాయంగా పలకరించలేకపోయేది.

దగ్గరలో ఎవరూలేని వేళ ఆమె భర్తతో మాత్రం మాట్లాడేది. "ఏమిటండీ ఇది? చక్కగా సాగుతున్న మన సంసార నౌక ఒక్కసారిగా ఒడిదుడుకులకు లోనయిందేమిటి?" అని ఆయనను ప్రశ్నించేది.

అందుకు ఆయన బలవంతంగా నవ్వేవాడు. "ప్రతి మనిషికీ ఏదో ఒక సమయంలో కష్టాలు రాక తప్పవు. ఇంతకాలం ఆనందంగా గడిపాము. మనకిప్పుడు కష్టాలు మొదలయినట్టున్నాయి"

"అంటే మన కష్టాలకు కారణం వసుంధర అని మీ ఉద్దేశమా?"

"లేదు... లేదు" వెంటనే అన్నాడాయన. "ఈ విషయంలో వసుంధరని మనం అర్థంచేసుకునేందుకు ప్రయత్నించాలి. ఇందులో దాని తప్పు కొంతమాత్రమే ఉంది. అతడికి పెళ్ళికాలేదనీ, తనను పెళ్ళిచేసుకుంటాడనే నమ్మకంతోనే అలా ప్రవర్తించింది తప్ప కేవలం కోరికలు తీర్చుకునే ఉద్దేశంతో శీలాన్ని పాడుచేసుకోలేదు"

"ఏమయినా అది కాలుజారడం చేయకూడని తప్పు"

"తప్పుని తప్పుగానే కాకుండా, ఆ తప్పు ఎలాంటి పరిస్థితిల్లో జరిగింది అన్నది కూడా మనం ఆలోచించాలి"

"తప్పు జరిగిందనే కాదు. అదొక దురదృష్ట జాతకురాలిగా నాకనిపిస్తుంది"

"అదీ నిజమే అయి ఉండవచ్చు. కొన్ని విషయాలలో కొందరిని దురదృష్టం వెక్కిరిస్తుంది. మిగతా అన్ని విషయాలలో వారు అదృష్టవంతులుగానే ఉంటారు. మన వసుంధర పుట్టినప్పటినుండే మనకు అదృష్టం కలసివచ్చింది. మన ఇల్లు కళకళలాడటం మొదలుపెట్టింది. లక్ష్మి మన ఇంట పుట్టిందని అప్పట్లో మనం అనుకున్నాం. అన్ని విధాలా అదృష్టవంతురాలయిన వసుంధర తన పెళ్ళి విషయంలోనే దురదృష్టజాతకురాలిలా తోస్తుంది నాకు" చెప్పాడాయన.

ఆ విధంగా వారిద్దరూ కూతురి గురించి చర్చించుకునేవారు. ఆ అమ్మాయి మీద జాలి పడేవారు.

వసుంధరకు వారు తనమీద జాలిపడటం గురించి తెలియదు. తల్లిదండ్రులు తనతో పలకటంలేదనే వ్యధ ఆమెను బాధిస్తుంది. 'అమ్మా' అని పిలిస్తే తల్లి పలకటంలేదు. తండ్రి గంభీరంగా ఉండిపోవటంతో ఆయన దరిదాపులకు వెళ్ళేందుకే ఆమె భయపడిపోతోంది. అందుకే ఎవరూ తోడులేక ఆమె ఏకాంతవాసం చేయసాగింది. తనను ఓదార్చే దిక్కులేక దిగాలుపడిపోయింది. ఆమె తన సమయంలో ఎక్కువకాలం తన గదిలోనే గడిపేది. ఏవో పుస్తకాలు చదువుకుంటూ తన బాధ మరచిపోవాలని చూసేది. సంధ్యవేళ మాత్రం మిద్దె పై భాగానికి వెళ్ళి కుర్చీలో కూర్చుని ప్రకృతిని పరిశీలిస్తూ ఉండిపోయేది. ఆకాశంలో ఎగిరే కొంగలగుంపును ఆసక్తిగా చూసేది. కదిలిపోయే నీలిమేఘాలమీద చూపు నిలిపేది. తన ఇంటి పరిసరాలలో ఉన్న ప్రతి చెట్టునూ జాగ్రత్తగా గమనించేది. బాగా చీకటి పడిపోతే ఆకాశంలోని నక్షత్రాలను లెక్కబెడుతూ కూర్చునేది. ఎంతసేపటికీ ఆ లెక్క ముగిసేదికాదు. అలా లెక్కపెట్టడంలో శారీరకంగానూ, మానసికంగానూ అలసిపోయాక, నీరసంగా కిందికి దిగి వచ్చేసేది ఆమె.

స్నానంచేసి, వంటగదిలోకి వెళ్ళేది. ఆమెను చూసిన శారదమ్మ నిశ్శబ్దంగా అవతలకు వెళ్ళిపోయేది. ఆ సమయంలో ఆమె అదోలా నవ్వుకునేది.

తనే గిన్నె అందుకుని నాలుగు మెతుకులు వేసుకునేది. ఆకలి లేకపోయినా, పస్తు పడుకున్నాననిపించకుండా రెండు ముద్దలు తిని పైకి లేచేది. అది జరిగిపోయిన వారం రోజులలోనే వసుంధర చాలా చిక్కిపోయింది. ఆలోచనల మధ్య నిద్రలేమితో కళ్ళు లోతుకుపొయ్యాయి. ఆ విషయం శారదమ్మ, శంకరయ్యలు గమనించినా గమనించనట్టుగానే ఉండిపోయారు.

మోహన్‌కుమార్ వెళ్లిపోయిన పదిహేను రోజుల తర్వాత శకుంతలమ్మ అన్నగారి దగ్గరకు వచ్చేసింది. ఆమె రావడంతోనే ఇంటిలో మారిన పరిస్థితి గమనించింది. అన్నావదినలు వసుంధరతో మునుపటంత చనువుగా




మాట్లాడకపోవడం గుర్తించింది. "ఏంజరిగింది అన్నయ్యా?" అంటూ ఆయనను ప్రశ్నిస్తే, "ఏంలేదులే" అని ఆయన దాటేశాడు. దాంతో ఆమెకు ఉత్సుకత మరింత పెరిగింది. వదిన విశ్రాంతిగా ఉన్న వేళ వివరాలు అడిగింది. ఆమె తప్పించుకోబోతే "అదేమిటి వదినా నాకు చెప్పకూడనంత రహస్యాలు మనింట్లో ఉన్నాయంటే నాకే ఆశ్చర్యంగా ఉంది. ఈరోజు మీరు దాచిపెట్టినా రేపయినా నాకా నిజం తెలియకుండా పోదు" నిష్ఠూరంగా అంది. ఆ మాటతో ఇక అసలు విషయం చెప్పక తప్పలేదు శారదమ్మకు. జరిగినదంతా పూసగుచ్చినట్టుగా ఆమె చెవిన వేసింది.

అంతా విన్నాక బుగ్గలు నొక్కుకుంది శకుంతలమ్మ "దీనికి ఇంత విపరీతబుద్ధి ఎలా పుట్టింది? ఇలాంటి నీచపు పనులు మన ఇంటావంటా లేవే దీనికి ఎక్కడ నుండి వచ్చాయి... పాతికేళ్లకే భర్తను పోగొట్టుకున్నా చిన్న తప్పుకూడా చేసి ఎరుగను నేను. అలాంటిది ఈ ఇంట పుట్టిన ఆ వెధవకు ఇలాంటి విపరీత బుద్ధులు ఎక్కడినుండి వచ్చాయో" ఏకధాటిగా తిట్టసాగింది శకుంతలమ్మ. కొడుకు ఐ.ఎ.యస్ ఆఫీసరయ్యాక ఆమెకు మునుపులేని నోరు కొత్తగా వచ్చింది.

శకుంతలమ్మ తిట్టితిట్టి అలసిపోయింది. తిన్నగా అన్నగారి దగ్గరకు వెళ్లి ఆయన ఎదురుగా కూర్చుంది. "ఇంత జరిగాక కూడా దానిని ఇంకా ఇంట్లో ఉంచుకోవడం అంత మంచిదికాదు. ఎదిగిన ఆడపిల్ల ఎప్పటికైనా మన గుండెలమీద కుంపటే కాబట్టి దానికి త్వరగా పెళ్లిచేసి పంపే ఏర్పాట్లు చేయండి"

"నేనూ అదే ఆలోచిస్తున్నానమ్మా" అన్నాడాయన.

"ఆలోచిస్తూ కూర్చుంటే కాలయాపన జరిగిపోతుంది. త్వరగా ప్రయత్నాలు ప్రారంభించండి"

తలూపాడాయన.

"అలాగే మన చంద్రంకు కూడా ఒక ఉత్తరం ముక్కరాయండి అతడికి తెలిసిన మంచి కుర్రాడెవరయినా ఉంటే తెలుపుతాడు"

ఈ విషయంలో మేనల్లుడి సహకారం కోరడం తనకు ఎంతమాత్రం ఇష్టంలేదు. కాని పరిస్థితుల ప్రభావం వలన అందుకు కూడా అంగీకరించాడాయన.

ఆ మర్నాటినుండే వరుడి కోసం మరొక్కసారి అన్వేషణ ప్రారంభించాడు. ఈసారి కూతురికి ఎట్టి పరిస్థితిలోనూ పెళ్లిచేసేయాలని ఆయన ఉద్దేశ్యం.

అయితే తనకు పెళ్లిప్రయత్నాలు జరుగుతున్నాయన్న విషయం వసుంధరకు తెలియలేదు కొంతకాలందాకా.

ఒకరోజు ఆమె మిద్దెమీద కూర్చుని ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదిస్తున్నప్పుడు శకుంతలమ్మ అక్కడికి వచ్చింది. అవీఇవీ మాట్లాడుతూ "మీనాన్న తొందరలోనే నీకు మూడుముళ్లు వేసే ప్రయత్నం చేస్తున్నాడులే" అంది.

వసుంధర తూలిపడబోయి నిలదొక్కుకుంది "ఏమిటత్తయ్యా! మీరు... మీరు అంటున్నది నిజమేనా?" ఆశ్చర్యంగా ప్రశ్నించింది.

"నిజంకాకపోతే నీతో నాకు పరాచికాలా?" ఎదురు ప్రశ్నించింది శకుంతలమ్మ.

"అది కాదత్తయ్యా మీకు నాగురించి అంతా తెలును అంతా తెలిసి కూడా మీరు నాకు పెళ్లిచేయాలనుకుంటున్నారంటే..." ఆగిందామె.

"అవునూ... నీకు పెళ్లిచేయాలనుకుంటున్నాం.... అయినా నీకిప్పుడు ఏం తక్కువయిందని నువ్వనుకుంటున్నావు? నీకు వయసుంది, అందం వుంది, ఆస్తి వుంది .....కావలసినవన్నీ ఉంటే పెళ్ళిచేసుకునేందుకు నీకు అభ్యంతరం ఏమిటి?"

ఆమె పిడికిలి బిగించి పిట్టగోడమీద కొట్టింది కసిగా "నాకు అన్నీ ఉన్నాయి. కానీ అతి ముఖ్యమయినది లేదు"

"ఏమిటది?"

"శీలం"

లోకం చదివిన జ్ఞానిలా నవ్వింది శకుంతలమ్మ— "పిచ్చిదానా... ఈ కాలంలో పెళ్లిచేసుకుంటున్న ప్రతిఆడపిల్లా శీలవంతురాలని నువ్వనుకుంటున్నావా?"

ఆ మాటకు అవాక్కయింది వసుంధర. అన్నీ తెలిసినవారు అవతలివారిని - అంటే మగపెళ్లివారిని మోసగించాలనుకుంటున్నారని అర్థమయింది. మెల్లగా తేరుకుని చిన్నగా చెప్పింది "తప్పు అత్తయ్యా మెడలో తాళికట్టబోయే వ్యక్తిని ఈ విషయంలో మోసగించటం చాలా అన్యాయం"

"అన్యాయం... అన్యాయం అంటుంటే మనం ఇక్కడే ఇలాగే ఉండిపోతాం... నీకు పెళ్లి మాత్రం కాదు" కసిరినట్టుగా అంది శకుంతలమ్మ.

"పెళ్లికాకపోయినా నాకు నష్టం లేదు. నేనిలాగే అవివాహితగానే ఉండిపోతాను"

"ఆఁ! ఉండిపోతావు" వెక్కిరించింది శకుంతలమ్మ. "నువ్విలాగే ఉండిపోతే ఇంకొకడు వచ్చి ఇంకొకవిధంగా మోసం చేస్తాడు. ఆధారంలేని అందమైన ఆడపిల్ల కోసం అందరు మగాళ్లూ వలలు వేస్తుంటారు"

వసుంధర ఆమెవంక అదోలా చూసింది- "అత్తయ్యా... మనిషి ఒక్కసారి మోసపోతాడు. ప్రతిసారీ మోసపోడు." ఏదో అమాయకంగా ఒకసారి మోసగింపబడ్డాను. నాకు లోకం తెలిసివచ్చింది. ఇక రెండోసారి ఎలా మోసపోతాను. అసలు నేనింక మగవారి దరిదాపులకే వెళ్లదలచుకోలేదు"

మేనకోడలి మనసు నొప్పించినట్టు ఆమెకు అర్థమయింది "అదికాదే వసూ... నువ్వు మళ్లీ తప్పుచేస్తావని కాకపోయినా ఆడపిల్లను ఇంట్లో పెట్టుకుని ఉండడం అందరికీ బాధాకరంగానే ఉంటుంది. నువ్వు మనస్ఫూర్తిగా అవివాహితలా ఉండిపోదలచుకున్నా లోకులు 'కూతురికి పెళ్లిచేయని తండ్రి'గా మీ నాన్నను ఆడిపోసుకుంటారు. మీ తల్లిదండ్రుల బాధ తగ్గించడం కోసమయినా నువ్వు పెళ్లికి ఒప్పుకోక తప్పదు..." మృదువుగా చెప్పింది శకుంతలమ్మ ఈసారి.

పెదవులు బిగపట్టి మౌనంగా ఉండిపోయింది వసుంధర. మౌనం అర్ధాంగీకారం కాబట్టి, అదే పూర్తి అంగీకారంగా భావించి కిందికి వెళ్లిపోయింది శకుంతలమ్మ.

నిశ్శబ్దం తోడుగా మిగిలిపోతే వసుంధర ఒక్కతే అక్కడ నిలుచుండిపోయింది.

★ ★ ★

చంద్రశేఖరం ఐ.ఎ.యస్ ఆఫీసరయ్యాక భానుమూర్తి ఒకటీరెండుసార్లు మాత్రమే అతడిని కలిశాడు. కలిసిన ప్రతిసారీ భానుమూర్తి అతడిని వసుంధర గురించి అడిగేవాడు.

ఈసారి అతడిని కలిసినప్పుడు ఎప్పటిలానే "వసుంధరగారెలా ఉన్నారు?" అడిగాడు భానుమూర్తి.

"బాగానే ఉంది. పోతే - ఆవిడకు పెళ్లిచూపులు చూస్తున్నారట. ఏదయినా మంచి సంబంధం ఉంటే చూడమని మామయ్యా నాకు ఉత్తరం రాశాడు"

ఆ మాట వినడంతోనే భానుమూర్తి ముఖంలో ఆందోళన కదలాడింది.

"నిజమా.... ఆవిడకు పెళ్లి సంబంధాలు చూస్తున్నారా?" ప్రశ్నించాడు అతడు ఆతృతగా.

చంద్రశేఖరం మిత్రుడి ముఖంలోని ఆతృత గమనించకుండానే "అవును భాను" అన్నాడు.

భానుమూర్తి అరనిముషంపాటు ఆలోచిస్తూ ఉండిపోయాడు. తన మనసులోని మాట మిత్రుడికి చెప్పాలా వద్దా అని సంకోచించసాగాడు. చంద్రానికి ఈ విషయం చెప్పడమే మంచిదనిపించింది.

అతడు మరికొంతసేపు సాలోచనగా ఉండిపోయి, తర్వాత అన్నాడు "చంద్రం... నీకు నేను ఒక విషయం చెబుతా-ను ఏమీ అనుకోవుగా?"

చంద్రశేఖరం అతడివంక అదోలా చూసి "అనుకునేందుకేముంది... అసలు విషయం ఏమిటో చెప్పు" చెప్పాడు.

భానుమూర్తి గొంతు సర్దుకుని "నేను... నేను వసుంధరగారిని పెళ్లాడాలనుకుంటున్నాను. నీకేమయినా అభ్యంతరమా?" అడిగాడు.

చంద్రశేఖరం ముఖంలో ఒక అనూహ్యమైన భావం కదలాడింది. అతడు ఆశ్చర్యంగా మిత్రుడి వంక చూశాడు. "నిజమా?" అని ప్రశ్నించాడు.

"నిజం... ఇది ఇప్పుడు కొత్తగా తీసుకున్న




నిర్ణయం కాదు. నువ్వు వసుంధరను కాదన్న ప్పటి నుంచీ నా మనసులో కదలాడుతున్న ఆలోచన ఇది"

చంద్రశేఖరం అరనిముషంపాటు నిశ్శబ్దంగా ఉండిపోయాడు. తర్వాత ఆనందంగా మిత్రుడిని కౌగిలించుకుని "కంగ్రాచ్యులేషన్స్ భానూ" అన్నాడు అతడి భుజంతడుతూ.

భానుమూర్తి కూడా సంతోషంగా నవ్వాడు.

"అది సరే ... వసుంధరను పెళ్ళిచేసుకోవాలన్న ఆలోచన నీకెలా కలిగింది?" విడివడ్డాక అడిగాడు చంద్రశేఖరం.

భానుమూర్తి కొద్దిసేపు సిగ్గుపడ్డాడు. తర్వాత చెప్పాడు. "మనం కలసి రూమ్‌లో ఉన్నప్పుడు వసుంధర దగ్గర నుండి నీకు ఉత్తరాలు వస్తుండేవి కదా! నీవు ఆ ఉత్తరాలు నాకు చదివి వినిపించేవాడివి. ఆ ఉత్తరాలలోని భావుకత, ఆప్యాయత, అభిమానాలు నన్ను ఎక్కువగా ఆకర్షించాయి. నువ్వు ఆ ఉత్తరాలు చదివేప్పుడు నేను మరో ఊహాలోకంలో విహరించేవాడిని. నీ అదృష్టానికి ఒకింత అసూయ పడేవాడినేమో కూడా. వసుంధర అందం నువ్వు వర్ణించి చెపుతుంటే నా కనుల ముందు ఒక అందమైన శిల్పం కదలాడేది. ఆమె మంచిమనసు గురించి వివరిస్తుంటే నాకు కావ్యనాయికలు గుర్తుకువచ్చేవారు. కాని అది నీ దురదృష్టమో, నా అదృష్టమో తెలియదు- నీ స్టేటస్‌కు సరిపోదన్న ఉద్దేశంతో నువ్వు వసుంధరను కాదన్నావు. ఆక్షణం నాకు ఎంతో బాధ కలిగింది. అందం, ఐశ్వర్యం ఉన్న యువతిని భార్యగా పొందవచ్చేమోగాని, ప్రేమించే యువతిని జీవిత భాగస్వామిగా పొందగలగడమే నిజమైన అదృష్టం. అందులోనూ వసుంధర వంటి మంచి మనసు, భావుకత ఉండే యువతిని పెళ్లాడగలగడమే మగాడి జీవితానికి మహా అదృష్టం. ఆ అదృష్టాన్ని నువ్వు కాలదన్నుకున్నావు... ఆ క్షణం నీమీద బాధకలిగినా ఆ తర్వాత అది నా అదృష్టంగా భావించుకున్నాను నేను. వసుంధరను పెళ్ళి చేసుకోవాలని అప్పుడే నిర్ణయించుకున్నాను. కాని కలెక్టర్‌ని అల్లుడిగా ఊహించుకున్నవారు ఒక బేంక్ కేషియర్ అల్లుడిగా వస్తాననడం భరించలేరనుకున్నాను. అందుకే నీ పెళ్ళిలో కూడా ఈ విషయాన్ని శంకరయ్యగారికి చెప్పకుండా, ఒకసారి ఆ పల్లెకు వస్తానని మాత్రమే అన్నాను. ఇప్పుడు నేను ఐ.ఎ.యస్.కి ప్రిపేర్ అవుతున్నాను. ఐ.ఎ.యస్ ఆఫీసర్ కాకపోయినా కనీసం బేంక్ ఆఫీసర్‌గా అయినా సెలక్ట్ అవుతాను. కాబట్టి ప్రస్తుతం నా స్థితి వసుంధర స్థితికి సరితూగకపోయినా నా భవిష్యత్తును ఊహించయినా నాకు ఆమెనిచ్చి పెళ్ళిచేయమని ఆయనను కోరాలనుకుంటున్నాను" చెప్పాడు.

చంద్రశేఖరం భానుమూర్తి చెయ్యి అందుకుని షేక్‌హాండ్ చేశాడు. "విష్ యూ బెస్టాఫ్ లక్ భానూ. ఈ విషయంలో నేను నీ గురించి మామయ్యకు రెకమండ్ చేస్తాను. ఆయన నిన్ను అల్లుడిగా అంగీకరించగలడనే నా గట్టి నమ్మకం... యూకెన్ ప్రొసీడ్"

"రెండురోజుల తర్వాత నేను ఆ పల్లెకు వెళ్ళి శంకరయ్యగారిని కలవాలనుకుంటున్నాను" చెప్పాడు భానుమూర్తి.

"అది మంచిదని ... నువ్వెళ్ళి ఆయనను కలువు. నేను ఆయనకు ఈ విషయం ఉత్తరం రాస్తాను. వీలయితే పర్సనల్‌గా కలిసి మాట్లాడతాను. నా వలన వసుంధర మనసు బాధపడింది. నా మిత్రుడి వలన ఆ బాధ తగ్గిపోతుందంటే నాకంతకన్నా కావలసిందేముంది?"

భానుమూర్తి నవ్వి ఊరుకున్నాడు.

గాయత్రి ఆ గదిలోకి వచ్చింది. భానుమూర్తిని విష్ చేసి వారి ఎదురుగా కూర్చుంది. ఆమె వచ్చిన పదినిముషాల తర్వాత పనిమనిషి ట్రేలో కూల్‌డ్రింక్స్ తీసుకువచ్చి అందరికీ అందించాడు.

"నీ తిరుగు ప్రయాణం ఎప్పుడు?" అడిగాడు భానుమూర్తి.

"రేపు ఉదయమే కారులో వెళ్ళిపోతాను".

చంద్రశేఖరం వారంకో, రెండు వారాలకో ఒకసారి మామగారి ఇంటికి వస్తాడు. గాయత్రి కూడా శెలవుదినాలలో తండ్రి దగ్గరకు వస్తుంటుంది. ఆ శెలవు దినాలలో కులాసాగా గడిపేశాక తెల్లారి లేచి ఇద్దరూ విడిపోతారు. ఇద్దరూ చెరోమార్గాన నూటపాతిక కిలోమీటర్లు



ప్రయాణించి డ్యూటీలో జాయిన్ అవుతారు.

భానుమూర్తి ఒక్కొక్కసారి అనుకుంటూ ఉంటాడు. 'స్టేటస్' అంటూ ప్రాకులాడిన చంద్రశేఖరం గాయత్రిని పెళ్ళిచేసుకుని ఏంతానందం పొందుతున్నాడని! వారానికో పదిరోజులకో కలుసుకునేవారు దాంపత్య సుఖం ఏం అనుభవించగలరు? అదే వసుంధ రను కనుక పెళ్ళాడి ఉంటే అతడు ఉన్నచో టనే ఉండి నకల సౌఖ్యాలు అందించేది కదా! పెళ్ళయినా బ్రహ్మచారి బతుకు గడపవలసిన ఖర్మ చంద్రంకు ఎందుకొచ్చింది?

పదినిముషాల తర్వాత భానుమూర్తి లేచా డు, "వెళ్ళొస్తాను" అన్నాడు.

"మళ్ళీ ఎప్పుడొస్తావు?" తనూ పైకి లేస్తూ అడిగాడు చంద్రశేఖరం.

"నేను ఇక్కడికి రావడం ఏముంది? నువ్వు ఎప్పుడొస్తావో ముందు చెప్పు"

చంద్రశేఖరం నవ్వి "రేపు ఆదివారం బహుశా నేను రాలేకపోవచ్చు. ఆపై ఆదివారం తప్పకుండా వస్తాను. ఎందుకయినా మంచిది- ఇక్కడికి రాబోయే ముందు మామయ్యకు ఫోన్ చేసి కనుక్కుని మరీ రా" చెప్పాడు.

అతడు అన్నాడు "అలాగే ... నేను కూడా వచ్చేవారం శంకరయ్యగారి దగ్గరకు వెళ్ళి వద్దామనుకుంటున్నాను. ఆ తర్వాత ఆది వారం నిన్ను కలుస్తాను వివరాలు చెపుతాను".

"మంచిది ... ఈలోపే మామయ్యకు నీ గురించి ఉత్తరం రాస్తాను. నిన్ను బాగా రిసీవ్ చేసుకుంటాడులే".

ఇద్దరూ మాట్లాడుకుంటూ బయటకు వచ్చా రు.

అప్పుడు రాజారావు కారు పోర్టికోలో ఆగింది. ఆయన డ్రైవింగ్ సీట్లో నుండి కిందికి దిగాడు. లోపలికి నడుస్తూ భానుమూర్తిని చూసి పలకరింపుగా నవ్వాడు. భానుమూర్తి కూడా నవ్వి ఊరుకున్నాడు.

రాజారావు అవసరపడిన వ్యక్తులతో తప్ప, ఇతరులతో మాట్లాడడని మొదటే గ్రహించా డు భానుమూర్తి. అందుకే అతడూ ఆయనతో ముభావంగానే ఉంటాడు.

వారిద్దరూ గేటు దగ్గరకు నడిచాక భాను మూర్తి చంద్రశేఖరంతో చెప్పాడు- "సీ యూ చంద్రం".

"సీ యూ" అన్నాడు చంద్రశేఖరం.

భానుమూర్తి స్కూటర్ స్టార్ట్ చేసుకుని వెళ్ళి పోయాడు.



"నమస్కారమండీ"

వరండాలోని వాలుకుర్చీలో కూర్చుని ఉన్న శంకరయ్య ఆ యువకునివంక తేరిపారా చూశా డు" "నువ్వు... మీరు..." వెంటనే గుర్తురాలేదు ఆయనకు. ఎక్కడో చూసినట్టుగా అని పించింది.

"నాపేరు భానుమూర్తి- చంద్రం పెళ్ళిలో మిమ్మల్ని కలిశాను"

ఆయనకు చప్పున మేనల్లుడు రాసిన ఉత్తరం గుర్తుకు వచ్చింది. ఆ ఉత్తరంలో చంద్రశేఖర్ భానుమూర్తి గురించిన పూర్తి వివ రాలు, అతడు ఆ పల్లెకు వస్తున్న కారణం పూర్తిగా వివరించాడు. ఆ విషయం తనకు చప్పున గుర్తుకు రానందుకు తననుతాను నిందించుకున్నాడు "రా బాబూ! రారా" ఆహ్వానించాడు తను పైకిలేస్తూ.

భానుమూర్తి మెట్లెక్కి వచ్చి ఆయన పక్కన నిలబడ్డాడు. ఆయన చూపించిన కుర్చీలో కూర్చున్నాడు అతడు.

"ప్రయాణం కులాసాగా సాగిందా?" ప్ర శ్నించాడు ఆయన.

"బాగానే సాగిందండి" జవాబిచ్చాడు అత డు.

"మంచినీళ్ళు తాగుతావా? మజ్జిగ తీసు కుంటావా?" అడిగాడాయన.

# ఫారెక్స్-ఎగ్
# పాల లాగ సులభంగా జీర్ణమవుతుంది

ముందుగానే వండబడిన ఫారెక్స్-ఎగ్, ఆరు నెలల వయసు నుంచీ మీ పాపాయికి ఒకే ఉత్పాదన ద్వారా గ్రుడ్లు మరియు పాలలోని సమృద్ధమైన పోషణను అందించండి.

ప్రొటీన్ సమృద్ధి




ఫారెక్స్:
పెరుగుదలకు రుచికరమైన విధానం

ఏదుకాణంలోనైనా పొదుపైన ఒకే ధరలో దొరుకుతోంది.

GX/188.90. TIR

"మజ్జిగ ఇప్పించండి"

ఆయన లోపలికి వెళ్ళి తన భార్యతో వచ్చిన వ్యక్తి గురించిన వివరాలు చెప్పాడు. 'ఏర్పాట్లు చేయమని' అన్నాడు. ఆయన తిరిగి వచ్చి కూర్చున్న ఒక నిముషం తర్వాత శారదమ్మ గ్లాసు నిండుగా మజ్జిగ తీసుకుని వచ్చింది. యువకునివంక పరిశీలనగా చూసింది. "అందంగానూ, చలాకీగానూ" ఉన్నాడను కుంది.

అతడు మజ్జిగ తాగటం పూర్తయ్యాక శంక రయ్య చెప్పాడు– "నీ గురించి మా చంద్రం ఉత్తరంలో వివరంగా రాశాడు. ఆ ఉత్తరం చూశాక నాకు చాలా ఆనందం కలిగింది. మా అమ్మాయి చాలా అదృష్టవంతురాలనిపిస్తోంది నాకు"

భానుమూర్తి చెప్పాడు– "లేదండీ! మీ అమ్మాయిని పొందగలగడం నిజంగా నా అదృష్టం. చంద్రం రూమ్‌లో ఉన్నప్పుడు అత డు ఆమె గురించి చెపుతుంటే, నాకూ అలాంటి యువతి భార్యగా వస్తే బాగుండు నని అనుకునేవాడిని కాని నా అదృష్టం బాగుండి ఆమే నా భార్య కాబోతోంది"

అతడు వసుంధరను మనస్ఫూర్తిగా ఇష్టప డుతున్నాడని అర్థమయింది శంకరయ్యకు. అలా ఆమెను అభిమానించి దగ్గరవ్వాలను కునే వ్యక్తికి వసుంధరకు జరిగిన ఘోరం చెప్పకుండా మోసం చేయడం న్యాయం కాద నిపించింది. కాని వెంటనే ఆయన తన అంత రాత్మను తొక్కిపెట్టాడు. న్యాయాన్యాయాలు విచారించుకుంటూ కూర్చుంటే తన కూతురి పెళ్ళి ఈ జన్మకు జరగదు. అందుకే ఆయన తన కూతురి పెళ్ళి విషయంలో, జీవితంలో మొదటిసారి మరొక వ్యక్తిని మోసం చే సేందుకు సిద్ధపడ్డాడు.

" ఈ పెళ్ళి విషయంలో మీ అమ్మా నాన్నల అభిప్రాయం?" ప్రశ్నించాడు శంకరయ్య.

అతడు వెంటనే చెప్పాడు– "నాకు అమ్మా నాన్నలు లేరు. వారు నా చిన్నప్పుడే నన్నీ లోకంలో వదిలి వెళ్ళిపోయారు. నేను చిన్నప్ప టినుండి నా అన్నా వదినలదగ్గర పెరిగాను. మా అన్నగారు లాయర్‌గా పనిచేసి, ప్రస్తుతం విజయవాడలో జడ్జిగా ఉద్యోగం నిర్వహిస్తు న్నారు. ఆయనకు నేను పెళ్ళి చేసుకుని ఒక ఇంటివాడను కావటమే ముఖ్యం తప్ప ఎవరనీ ఏమిటన్నది ఆయన పట్టించుకోరు"

శంకరయ్య ఆ వివరాలు శ్రద్ధగా విన్నాడు.

అప్పటికే మిట్టమధ్యాహ్నం అయి ఉంది. ఆయన లోపలికెళ్ళి భోజన ఏర్పాట్లు పూర్త య్యాయని తెలుసుకున్నాక బయటకు వచ్చి "రా బాబూ భోంచేద్దువు" పిలిచాడు.

భానుమూర్తి మొహమాటంగా నవ్వి "లే దండి ... రైలు దిగాక నేను టౌన్‌లో భోంచేసి బస్సు ఎక్కాను."

"అరే" ఆయన నొచ్చుకున్నాడు. "మా ఇంటికి వస్తూ హోటల్‌లో భోంచేసి రావటం ఏమిటి?... భోంచేసి రాలేదన్న ఉద్దేశంతోనే నేను భోజనం ఏర్పాట్లు చేయించాను."

అతడు అదోలా నవ్వాడు– "అది కాదండి! కతికితే అతకదన్న సామెత గుర్తుకు వచ్చి ప్రస్తుతానికి మీ ఇంట్లో భోంచేయకూడదని..."

ఆ మాటకు ఆయన కూడా నవ్వాడు. "భలేవాడివే!.... అలాంటి పాత సామెతలను పట్టించుకోకు."

"అయినా నాకిప్పుడు హ్యాపీగా ఉందండి" చెప్పాడు భానుమూర్తి.

"పోనీ కాసేపాగాక టిఫిన్ చేద్దువులే"

'అలాగే'నన్నట్టుగా తలూపాడు భానుమూ ర్తి. శంకరయ్య లోపలికి వెళ్ళి భార్యతో వసుంధ రను అలంకరించమని చెప్పి వచ్చి అతడి పక్కన కూర్చున్నాడాయన. భానుమూర్తితో తన కుటుంబం గురించిన వివరాలు చెప్పసాగాడు. పొలం కబుర్లు వినిపించసాగాడు. భానుమూర్తి ఆయన మాటలు శ్రద్ధగా వింటున్నాడు.

ఆ సమయంలోనే లోపల శారదమ్మ శకుంతలమ్మలు వసుంధరను అలంక రించటం మొదలుపెట్టారు. ఆ అలంకరణ ఎందుకో వసుంధరకు అర్థంకాలేదు "ఎందుక త్తయ్యా ఇదంతా?" అడిగింది వసుంధర.

"ఈరోజు నిన్ను చూసుకునేందుకు పెళ్ళికొ డుకు వచ్చాడే!" ఆమె బుగ్గపొడుస్తూ చె ప్పింది శకుంతలమ్మ.

తత్తరపడింది వసుంధర. తేరుకుని





'పాపం! ఎవడా మోసపోబోతున్న అమాయకుడు?' అని మనసులోనే బాధపడింది.

ఆమె అలంకరణ పూర్తయింది. శకుంతలమ్మ బయటకు వచ్చి శంకరయ్యకు కనుసైగలతోనే ఆ విషయం చెప్పింది. ఆయన తలాడించాడు. శకుంతలమ్మ లోపలికి వెళ్లిపోయింది.

పదినిముషాలు గడిచాక శంకరయ్య అతడితో అన్నారు– "బాబూ! అమ్మాయిని చూస్తావా?"

"అంత అవసరంలేదనే అనుకుంటున్నానండీ! ఆమెను నేను ప్రత్యక్షంగా చూడకపోయినా, పరోక్షంగా ఆమె గురించి నాకు పూర్తిగా తెలుసు. ఆమె ఎంత అందమయిందో, ఆమె మనసెంత మృదువైనదో నాకు తెలుసు" చెప్పాడు అతడు.

భానుమూర్తి మాటలు ఆయనకు చాలా ఆనందాన్ని కలిగించాయి. కాని ఆయన చెప్పాడు– "నీకు అమ్మాయి గురించి అవగాహన ఎంత ఉన్నా ఇంత దూరం వచ్చాక అమ్మాయిని చూడకుండా వెళ్ళడం అంత బాగుండదు. రా బాబూ– చూద్దువు"

ఇక తప్పదన్నట్లుగా పైకి లేచాడు భానుమూర్తి. ఆయన వెనుకే లోపలికి నడిచాడు. ఇద్దరూ హాలులోని కుర్చీలలో కూర్చున్నారు. శకుంతలమ్మ వచ్చి వారి ఎదురుగా చాపపరిచింది. లోపలికెళ్ళి వసుంధరను చేయిపట్టుకుని పైకిలేపింది. శారదమ్మ, శకుంతలమ్మలు చెరో చెయ్యి పట్టుకుని ఆమెను నడిపించుకుని హాలులోకి తీసుకువచ్చారు.

అప్పటివరకూ తలదించుకుని ఉన్న భానుమూర్తి అప్పుడే తలెత్తాడు. అతడు ఆమె అందం గురించి వినివున్నాడు. కాని మరీ ఇంత ఆకర్షణీయంగా ఉంటుందని మాత్రం ఊహించలేదు. అతడు కన్నులు విప్పార్చి ఆమెవంకే చూస్తూండిపోయాడు.

వసుంధరను చాపమీద కూర్చోబెట్టారు. శకుంతలమ్మ వసుంధర వక్కనే మోకాళ్ళమీద కూర్చుని ఆమె చెవిలో మెల్లగా చెప్పింది "వసూ ... తలెత్తి అబ్బాయి ముఖంవంక చూడు. లేకుంటే రేపు శోభనం గదిలో లోపలికి వచ్చినవాడెవరో అర్థంకాక అయోమయంలో పడగలవు"

అత్తగారి జోక్‌కి ఆమెకు నవ్వు రాలేదు. ప్రస్తుతం ఆమె మనసు మనసులో లేదు. చాలా పరధ్యానంగా ఉంది. అంతా యాంత్రికంగా చేస్తూవుంది. ఆమె తలెత్తి అతడి ముఖంవంక చూసింది. చాలా అమాయకంగా, ఆకర్షణీయంగా కనిపించాడు అతడు. 'అలాంటివ్యక్తిని మోసం చేయడం న్యాయమేనా?' మనసులోనే ప్రశ్నించుకుందామె. తల్లిదండ్రులు కన్నులముందు దీనంగా కదలాడటంతో ఆ ఆలోచనకు స్వస్తిచెప్పింది.

అయిదు నిముషాలు వారిని ఎదురెదురుగా కూర్చోబెట్టాక ఆడవారిద్దరూ కలిసి వసుంధరను లోపలికి తీసుకువెళ్ళారు. భానుమూర్తి అప్పటికిగాని ఈ లోకంలోకి రాలేదు. ఆ అందాలరాశిని, భావుకత నిండిన కావ్యనాయికను పెళ్ళాడలేకపోతే తన బతుకు వ్యర్థం అనుకున్నాడు. ఆమె మనసు అంతకుమునుపు మరొకరికి సమర్పించి ఉండొచ్చు అయినా ఆమె అమలిన పుష్పం. అందరికీ అందని అనురాగం. ఆమెను కాదనుకున్నవాడు దురదృష్టవంతుడు. ఆమెను దక్కించుకోబోతున్న తను అదృష్టవంతుడు. తన అదృష్టానికి తాను పొంగిపోయాడు భానుమూర్తి. అయినా అతడి మనసులో ఒకింత అనుమానం మిగిలివుంది. ఆఫ్టరాల్ ... ఒక బేంక్ కేషియర్ వారి స్టేటస్‌కి సరిపోతాడా?' అయితే వారు చేస్తున్న మర్యాదల దృష్ట్యా తనను వారు సగం ఆమోదించినట్టుగానే అతడు భావించాడు.

కొద్దిసేపటి తర్వాత శకుంతలమ్మ ఫలహారాలు తెచ్చి వారిద్దరికీ అందించింది. అతడు మొహమాటపడుతుంటే "పాత సామెతలు మనసులో పెట్టుకోకుండా ముందు లాగించు" అన్నాడు శంకరయ్య.

భానుమూర్తి కూడా నవ్వి ఫలహారం తీసుకుని తినసాగాడు. శకుంతలమ్మ కాఫీలు పట్టుకొచ్చింది తాగారు వారిద్దరూ.

బాగా పొద్దుపోయేంతవరకూ కూర్చుండిన అతడు "ఇక నేను బయలుదేరతానండీ" అన్నాడు.

"రాత్రికి పడుకుని తెల్లారి వెళ్ళకూడదా?"

"లేదండీ ... రాత్రికి రైలెక్కితే రేపు ఉదయం బేంక్ టైమ్‌కి కలునుకోగలను"

ఆ సమయంలోనే ఊళ్ళోకి బస్సు వస్తున్న ట్లుగా హారన్ వినిపించింది. "సరే పద బాబూ ... బస్సు వస్తోంది" తనూ లేస్తూ అన్నాడా యన.

అతడు ఆవైపు తిరిగి వంటగది వాకిటను న్న శారదమ్మ, శకుంతలమ్మలతో "వెళ్ళొస్తా నండీ" అన్నాడు. వారు "మంచిది బాబూ" అంటూ తలూపారు.

భానుమూర్తి బయటకు నడుస్తుంటే, శంకర య్య అతడిని అనుసరించాడు. "మీరెందు కండీ ... నేను వెళ్తానుగా" అన్నాడు భానుమూ ర్తి. "ఫర్వాలేదు బస్సు వరకూ వస్తాను పదబా బూ" అన్నాడు శంకరయ్య.

ఇద్దరూ బయటకు నడిచారు. రోడ్డున నడు స్తుంటే అయన ప్రశ్నించాడు "బాబూ ... అమ్మాయి విషయం ఏమనుకుంటున్నావు?"

"ఆమె నాకు బాగా నచ్చిందండీ. పోతే మీకు నేను నచ్చానో లేదో అన్న విషయమే నాకు తెలియవలసివుంది" జవాబిచ్చాడు అతడు.

వసుంధర విషయంలో రెండుసార్లు దెబ్బ తిని వుండటంతో ఆయన ఈసారి కాసింత జాగ్రత్తగా ఉండదలచుకున్నాడు. అందుకే తెలివిగా "మా అభిప్రాయం తొందరలోనే ఉత్తరం ద్వారా తెలియజేస్తాం" అన్నాడు.

అందుకు తలూపాడు భానుమూర్తి.

బస్సు గ్రామచావిడి దగ్గర రివర్స్ అయి ఆగింది. భానుమూర్తి బస్సెక్కబోతూ ఆయనతో చెప్పాడు "మీ అభిప్రాయం కోసం ఎదురుచూ స్తూ వుంటాను"

"త్వరలోనే ఉత్తరం రాస్తాను" హామీ ఇచ్చా డాయన.

బస్సు ఎక్కి సీట్లో కూర్చున్నాడు భానుమూ ర్తి. బస్సు కదులుతుంటే కిటికీలోనుండి ఆయ నవైపు చెయ్యి ఊపాడు. ప్రతిగా ఆయన కూడా చెయ్యి ఊపాడు. బస్సు కదిలివెళ్ళిపోయింది.

ఆయన కాసేపు అలాగే నిలబడి తర్వాత ఇంటివైపు నడవసాగాడు. చావిడిదగ్గర కూర్చు నివున్న ఒకరిద్దరు ఆయనను "ఎవరా కుర్రా డు?" అని ప్రశ్నించారు.

"మా బంధువు" జవాబిచ్చారాయన.

శంకరయ్య తిన్నగా తన ఇంటికి వచ్చాడు. హాలులోని కుర్చీలో కూర్చుని వెనక్కు వాలాడు. శకుంతలమ్మ ఆయన దగ్గరగా వచ్చి నిలబ డింది.

"అబ్బాయి అందంగా ఉన్నాడు. ఉద్యోగం కూడా ఫర్వాలేదు. నాకు, వదినకు అబ్బాయి నచ్చాడు ... మరి నీకు?" ప్రశ్నించిందామె.

"ఉద్యోగం, అందమే కాదు వ్యక్తికూడా సంస్కారవంతుడిలా కనిపిస్తున్నాడు. నాకు కూడా బాగా నచ్చాడు"

"మరింకేం ... అన్నట్టు అబ్బాయికి అమ్మాయి నచ్చిందేమో కనుక్కున్నావా?"

"కనుక్కున్నాను. కుర్రాడు అమ్మాయిని చాలా ఇష్టపడుతున్నాడు. ఆ కారణానే ఇంత దూరం వెతుక్కుంటూ వచ్చాడు కూడా. మనం అమ్మాయిని ఇవ్వడమే తనకు భాగ్యంగా మాట్లాడుతున్నాడు" జవాబిచ్చాడాయన.

"అయితే ఇంకా ఆలస్యం ఎందుకు? త్వర లోనే ముహూర్తాలు పెట్టుకుంటామని చెప్పలేక పోయావా?" ఆతృత కనపరచింది శకుంతల మ్మ.

ఆయన కాసేపు మౌనంగా ఉండిపోయాడు. తర్వాత మెల్లగా చెప్పాడు - "వసుంధర తన పెళ్ళివిషయంలో ఇప్పటికే రెండుసార్లు భయంకరమైన అనుభవాలు ఎదుర్కొని వుంది. ఈ పెళ్లివిషయంలో కూడా ఏదయినా జరగకూడని తప్పు జరిగితే ఆమె ఈ జన్మకు కోలుకోలేదు. అందుకే అన్నివైపులా ఆలో చించి అబ్బాయి గురించిన పూర్తి వివరాలు తెలుసుకునిగానీ నేను ముందడుగు వేయద లచుకోలేదు"

తన అన్నగారి ముందుచూపునకు ఆమె మనసులోనే అభినందించింది - "అదీ నిజమే... తొందరపడి ఏ నిర్ణయమూ తీసుకో కూడదు" అని ఆగి తర్వాత అడిగింది - "అబ్బాయి వివరాలు కనుక్కునేందుకు ను వ్వేం చేయాలనుకుంటున్నావు?"





ఆయన చెప్పాడు- "ఆ కుర్రాడు మన చంద్రానికి మిత్రుడు కాబట్టి ఈ విషయంలో చంద్ర పూర్తి వివరాలు అందించగలడు. తల్లి దండ్రులకు, చుట్టుపక్కలవారికీ తెలియని వ్యక్తిగత విషయాలన్నీ స్నేహితులకు తెలిసివుంటాయి. అందుకే ఆ అబ్బాయి వివరాలు మన చంద్రంను అడిగి తెలుసుకోవాలనుకుంటున్నాను"

"మంచి ఆలోచనే" మెచ్చుకుంది శకుంతలమ్మ. "అయినా కుర్రాడు మంచివాడు కానట్లయితే చంద్రం మనకు అసలు ఉత్తరమే రాసివుండేవాడు కాదు"

ఆ మాటకు తలూపి ఊరకుండిపోయాడు శంకరయ్య.

"ఇంతకీ చంద్రం దగ్గరకు నువ్వు ఎప్పుడు వెళ్ళాలనుకుంటున్నావు?"

"ఆలస్యం చేయడం ఎందుకు? రేపు ఉదయమే బయలుదేరదామనుకుంటున్నాను" చెప్పాడు ఆయన.

"అలాగే చెయ్యి" అందామె. వంటగది తలుపునకు ఆనుకుని అంతా వింటోంది శారదమ్మ. జరుగుతున్న వ్యవహారాన్ని పట్టించుకోననిది వసుంధర ఒక్కతే. ఆమె నిరామయంగా, నిర్వికారంగా తన గదిలోనే పడుకుండిపోయింది. వచ్చినవ్యక్తి తనను ఇష్టపడ్డాడా, కాదని వెళ్ళాడా అన్నది కూడా పట్టించుకోలేదు. వాస్తవంలో జరిగినది ఆమెకు తొలి పెళ్ళిచూపులు. తొలి పెళ్ళిచూపులకే అంతగా పట్టించుకోని పరిస్థితి ఏర్పడడం ఆలోచించతగిన విషయమే.

శంకరయ్య లేచి కాళ్ళు కడుక్కుని వంటగదిలోకి వెళ్ళాడు. శారదమ్మ పీటవాల్చి అన్నం వడ్డించింది. ఆయన అన్నం కలుపుకొంటూ ఆమెను ప్రశ్నించాడు "నేను రేపు ఉదయం చంద్రం దగ్గరకు వెళ్ళాలనుకుంటున్నాను. విషయాలన్నీ విన్నావుగదా- మరి నీ అభిప్రాయం ఏమిటి?"

"మీరు ఎంతో ఆలోచించి ముందడుగు వేస్తుంటే ఇక నేను చెప్పేందుకు ఏముంది? మీ ఆలోచన బాగానే ఉంది. వెళ్ళి చంద్రాన్ని అడిగి వివరాలన్నీ కనుక్కోండి. ఆ తర్వాత వివరాలు మీకు సంతృప్తికరంగా అనిపిస్తే, మీ ఇష్టప్రకారమే కానివ్వండి"

"నా ఇష్టాయిష్టాల సంగతి వదిలెయ్... ఇంతకీ నీకు అబ్బాయి నచ్చాడా లేదా?" భార్య ముఖంలోకి సూటిగా చూస్తూ ప్రశ్నించారాయన.

"మన పరిస్థితులకు తగ్గట్టు అనేకాకుండా కుర్రాడు అన్నివిధాలా యోగ్యుడిలా ఉన్నాడు. మన అదృష్టం బాగులేనప్పుడు కలెక్టరే రావాలని కోరుకోకుండా బాంక్ కాషియర్‌తోనయినా సరిపెట్టుకోవడం మంచిది"

భార్యవంక మెచ్చుకోలుగా చూశాడాయన.

"ఇంతకీ అమ్మాయి ఎక్కడుంది?"

"తన గదిలో పడుకొనివుంది" జవాబిచ్చిందామె.

ఆయన భోజనం పూర్తయింది. లేచాక తన కూతురి గదికి వెళ్ళి వసుంధరను పలకరించాలనిపించింది. కాని ఆ ఆలోచనను వెంటనే విరమించుకొని ఆయన తన గదిలోకి వెళ్ళిపోయాడు.

ఆ మర్నాడు తొలి బస్సుకే ఆయన చంద్రం దగ్గరకు బయలుదేరాడు.

రెండు బస్సులు మారి చంద్రం జాయింట్ కలెక్టర్‌గా జాబ్‌చేస్తున్న టౌన్‌లో దిగాడు. అప్పటికి సమయం మధ్యాహ్నం పన్నెండు గంటలయింది.

ఆయన తిన్నగా కలెక్టరాఫీసుకు వెళ్ళాడు. అతడి గది కనుక్కొనివెళ్ళి బయటవున్న ప్యూన్‌చేత తనొచ్చిన విషయం చంద్రశేఖరానికి కబురు పంపాడు.

వెంటనే లోపలికి రమ్మన్న పిలుపు వచ్చింది. ఆయన లోపలికి వెళ్ళాడు. అప్పటివరకూ ఎవరితోనో మాట్లాడుతున్న చంద్రశేఖర్ అప్పుడే మాటలు ముగించాడు; వారు వెళ్ళిపోయారు.

చంద్రశేఖరం ఆయనవంక తిరిగి నవ్వుతూ- "ఎప్పుడొచ్చారు మామయ్యా" అడిగాడు.

"ఇప్పుడే... బస్సు దిగి తిన్నగా ఇక్కడికే రావడం" బదులిచ్చాడు ఆయన.

అతడు కాలింగ్‌బెల్ కొట్టి వచ్చిన ప్యూన్‌తో

కూల్‌డ్రింక్స్ పట్టుకురమ్మన్నాడు. కూల్‌డ్రింక్స్ వచ్చాక ఆయనకొకటి ఇచ్చి, తనొకటి తీసుకొని సిప్ చేస్తూ అడిగాడు- "ఇంట్లో అందరూ బాగున్నారుకదా?"

"అందరూ బాగున్నారు"

"అమ్మను నా దగ్గర ఉండమన్నా ఉండకుండా మీ దగ్గరకే పరిగెత్తుకువచ్చేసింది. ఆమె ఈ వాతావరణానికి అడ్జస్ట్ కాలేకపోయింది"

"ఎంతయినా పుట్టిపెరిగిన ఊరిమీద మమకారం ఆమెను నిలవనీలేదు కాబోలు" అన్నారాయన.

అతడు నవ్వి ఊరుకున్నాడు. అప్పుడే గుర్తుకువచ్చినట్టు "అన్నట్టు వసుంధర ఎలా వుంది?" ప్రశ్నించాడు.

"బాగానే ఉంది. ప్రస్తుతం ఆ విషయం మీదే నీ దగ్గరకు వచ్చాను" చెప్పారాయన.

"విశేషం ఏమిటి?"

"భానుమూర్తి అనే అబ్బాయి మన ఇంటికి వచ్చాడు. వసుంధరను పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నట్టుగా చెప్పాడు. పెళ్ళిచూపులు ఏర్పాటుచేశాం. అబ్బాయి అమ్మాయికి నచ్చాడు. పోతే అబ్బాయి రూపం, ఉద్యోగం మనకు నచ్చినా వ్యక్తిగత వివరాలు కూడా పూర్తిగా తెలిస్తే సంతృప్తికరంగా ఉంటుందని పించింది. అతడికి స్నేహితుడివి కొద్దికాలం ఇద్దరూ కలిసి ఒకే రూమ్‌లో ఉన్నారు కాబట్టి అతడిని గురించిన వివరాలు నీకు పూర్తిగా తెలిసివుంటాయని అవి కనుక్కునే ఉద్దేశంతోనే వచ్చాను"

చంద్రశేఖరం కొద్దిసేపు మౌనంగా ఉండిపోయాడు. "ఇంతకీ అతడి గురించి నేను రాసిన జాబు మీకు చేరిందా?" ప్రశ్నించాడు ఆ తర్వాత.



"చేరింది. అతడిగురించి మంచిగానే అభిప్రాయపడ్డావు. కాని అతడిని గురించిన వివరాలు పూర్తిగా నీ నోటినుండే విని సంతృప్తిపడాలనిపించింది".

అతడు తలూపాడు -"విషయాలు మనింటికి వెళ్ళి మాట్లాడుకుందాం. కాసేపు కూర్చోండి మామయ్యా"

"అలాగే" చెప్పారాయన. కుర్చీలో వెనక్కువాలి నిశ్శబ్దంగా ఉండిపోయాడు.

చంద్రశేఖరం ఒక గంటసేపు ఫైల్స్ తిరగేశాడు. సుమారు ఒకటిన్నర అవుతుండగా లేచాడు "రా మామయ్యా" అంటూ.

వారు బయటకు నడుస్తుంటే ఫ్యూన్ తలుపు తీసిపట్టుకుని సెల్యూట్ చేశాడు. చంద్రశేఖరం హుందాగా నడవసాగాడు. అతడిని అనుసరించాడు శంకరయ్య.

ఆవరణలో ఉన్న జీప్ ఎక్కి కూర్చున్నాడు చంద్రశేఖరం. అతడి పక్కనే తనూ కూర్చున్నాడు శంకరయ్య. డ్రైవర్ జీప్ స్టార్ట్‌చేసి ముందుకుపోనిచ్చాడు.

సరిగ్గా పది నిముషాల తర్వాత జీప్ ఒక బంగ్లా ముందు ఆగింది. ఇంటికి ఆయన రావడం అదే మొదటిసారి. ఇద్దరూ లోపలికి నడిచారు.

ఆ ఇంటి వాతావరణం హుందాగా, ఖరీదైనదిలా కనిపిస్తోంది. అతడు డ్రస్ ఛేంజ్ చేసుకొని డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చున్నాక వంటవాడు టేబుల్‌మీద అన్నీ సర్దిపెట్టాడు. ఇద్దరూ వడ్డించుకొని తిన్నారు.

భోజనాలు పూర్తయ్యాక వారిద్దరూ డ్రాయింగ్ రూమ్‌లో కూర్చున్నారు.

"ఇప్పుడు చెప్పండి మామయ్యా" రిలాక్సింగ్‌గా కూర్చుంటూ అడిగాడు చంద్రశేఖరం.

"అదేరా భానుమూర్తి విషయం ... అతడి గురించి నీకు తెలిసినంతవరకూ చెప్పు"

చంద్రశేఖరం అర నిముషంపాటు నిశ్శబ్దంగా కళ్ళు మూసుకున్నాడు.

"భానుమూర్తి నాకు చాలాకాలం నుండి తెలుసు. నేను ఉద్యోగంలో చేరినప్పుడే అతడు నాకు పరిచయం అయ్యాడు. ఇద్దరం కలిసి ఆరు నెలలపాటు ఒకే గదిలో ఉన్నాం కాబట్టే అతడిని లోతుగా పరిశీలించే అవకాశం కలిగింది. అందుకే అతడి గురించి నేను స్థిరమైన అభిప్రాయం చెప్పగలుగుతున్నాను... భానుమూర్తి ఒక ప్రత్యేకమైన వ్యక్తిత్వం కలవాడు. అతడు ఎవరితోనూ పరిచయం పెంచుకోడు; అలాగే ఎవరినీ అభిమానించడు. అయితే అభిమానించిన వ్యక్తికి ప్రాణమిచ్చేందుకు కూడా వెనుకాడడు. హిపోక్రసీ వదిలి చెప్పగలిగితే వాస్తవంలో అతడు వ్యక్తిత్వంలో నాకన్నా ఉన్నతుడు. అతడికి ఏ దురలవాటూ లేదు. సప్తవ్యసనాలలో ఏ వ్యసనమూ లేదు. కానీ ... అతడిలో ఒకింత నిర్లక్ష్యం ఉంది. పట్టుదల, తెలివితేటలు వున్నాయిగానీ వాటిని ఉపయోగించుకుని పైస్థాయికి పోవాలన్న ఆశ లేదు. అందుకే అతడు బాంక్ కాషియర్ ఉద్యోగంతోనే తృప్తిపడిపోయాడు. నా గదిలో ఉన్నప్పుడు నేనెప్పుడయినా 'భానూ... నువ్వు నాకన్నా ఎంతో తెలివితేటలు కలవాడివి. నువ్వు పట్టుదలవడితే నాకన్నా ముందుగానే ఐ.ఎ.యస్. ఆఫీసర్‌వి కాగలవు. మరి నువ్వు కూడా నాతోపాటు ఐ.ఎ.యస్.కి ప్రిపేర్ కాకూడదూ?' అని ప్రశ్నిస్తే, అతడు నవ్వేసి 'నాకీ బేంక్ కేషియర్ ఉద్యోగం చాల్లే' అనేవాడు. అటువంటివాడు నేడు ఐ.ఎ.యస్.కి ప్రిపేర్ అవుతున్నాడు. అతడికున్న అద్భుతమైన తెలివితేటలకు పట్టుదల పట్టాడు కాబట్టి ఐ.ఎ.యస్ ఆఫీసర్ కాగలగడం పెద్ద కష్టం కాబోదు. మామయ్యా... ఐ.ఎ.యస్ ఆఫీసర్ అల్లుడు కావలసిన పరిస్థితి ఉండిన నీకు ఆఫ్టరాల్ బేంక్ కాషియర్ అల్లుడు అవుతున్నాడని బాధపడనవసరంలేదు. భానుమూర్తి ఈరోజు కాకపోయినా రేపయినా ఆ స్థాయికి చేరుకునితీరతాడు. పెళ్ళయిన తర్వాతయినా అతడు ఐ.ఎ.యస్ ఆఫీసరయి మిమ్మల్ని సంతృప్తిపరుస్తాడు. మరి బేంక్ గుమస్తాగిరితో సంతృప్తిపడుతున్న అతడు నేడు ఆఫీసర్ కావాలని ఎందుకు కృషిచేస్తున్నాడంటే - అందుకు కారణం వసుంధరే. అతడు నా గదిలో ఉన్నప్పుడు వసుంధర దగ్గరనుంచి నాకు వచ్చే ఉత్తరాలు నేను చదివి వినిపిస్తే వినేవాడు. ఆమెలోని కొన్ని సుగుణాలు అతడికి





విపరీతంగా నచ్చాయి. తనకు రాబోతున్న భార్య అచ్చం వసుంధరలా ఉండాలని అతడు నాతో అనేవాడు. ఆ తర్వాత నేను వసుంధరను కాకుండా గాయత్రిని పెళ్ళిచేసుకోవడంతో అతడు నామీద కోప్పడ్డాడు. వసుంధర మనను విరిగిందేమోనని బాధపడ్డాడు. కాని అది తన మేలుకోసం జరిగిందేమోనని అతడు సంతసించాడు. కాని అంతలోనే అతడు సందేహించాడు - ఒక ఐ.ఎ.యస్ ఆఫీసర్‌ని భర్తగా ఊహించుకుంటున్న వసుంధర ఒక బేంక్ కాషియర్‌ని కట్టుకోవలసి రావడంతో బాధపడుతుందేమోనని. అందుకే అతడు నా స్థాయికి ఎదగాలని తనూ కష్టపడటం మొదలుపెట్టాడు. మీరిప్పుడు వసుంధరకు పెళ్ళి ప్రయత్నాలు చేస్తున్నట్లుగా అతడికి తెలినుండకపోయినట్లయితే అతడు నా స్థాయికి వచ్చాకే మిమ్మల్ని కలుసుకుని ఉండేవాడు. మీరూహించనంత గొప్పస్థితి అనిపించాకే మీ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటానని కోరివుండేవాడు. కాని ఇంతలోనే అతడికి వసుంధరకు సంబంధాలు వెదుకుతున్న విషయం నా ద్వారా తెలిసింది. దాంతో అతడు తొందరపడ్డాడు. తను గొప్పవాడయ్యేవరకూ వెయిట్ చేస్తే తను కోరుకుంటున్న వసుంధర తనకు కాకుండా పోతుందేమోనని భయపడ్డాడు. అందుకే ఈ స్థితిలోనే మీ దగ్గరకు వచ్చాడు. వసుంధరను పెళ్ళాడతానని మిమ్మల్ని కోరాడు... నా ఉద్దేశం భానుమూర్తి ప్రస్తుత పరిస్థితిని ఆలోచించకుండా అతడి భవిష్యత్‌ని దృష్టిలో వుంచుకుంటే ఇంతకన్నా గొప్ప సంబంధం మీరు ఎక్కడా సాధించలేరు. అలాగే భానుమూర్తిలాంటి వ్యక్తిత్వం ఉన్నవ్యక్తి మరొకరు వసుంధరకు భర్తగా దొరకడం అసాధ్యం. కాబట్టి వసుంధరను భానుమూర్తికిచ్చి పెళ్ళిచేయడం అన్నివిధాలా శ్రేయస్కరమని నా అభిప్రాయం.'' దీర్ఘంగా చెప్పాక అలసటగా ఊపిరిపీల్చుకున్నాడు చంద్రశేఖరం.

భానుమూర్తి గురించి అతడు చెప్పిన వివరాలు అతడిగురించి ఆయనకొక అవగాహనను కలిగించాయి. భానుమూర్తి అంటే ఆయనకు గౌరవం, అభిమానం కలిగాయి. అంతవరకూ మనసు మూలల మిణుకుమిణుకుమంటున్న అసంతృప్తి మటుమాయమయి ఆ స్థానంలో సంతృప్తినిండిపోయింది. వసుంధర అదృష్టంవల్ల ఆయనకు గర్వంలాంటిది కలిగింది.

ఆ ఆనందంలో ఆయనకు తన కూతురు శీలవతి కాదన్న విషయం కూడా గుర్తుకు రాలేదు.

మరో అర్థగంటవరకూ భానుమూర్తి కుటుంబ విషయాలు, వ్యక్తిగత విషయాలు అతడిని అడిగి తెలుసుకున్నాడు శంకరయ్య. ఆయన అడిగిన ప్రశ్నలన్నింటికీ ఓపికగా జవాబులు చెప్పాడు చంద్రశేఖరం.

మరికాసేపయ్యాక అతడు లేచి- ''మామయ్యా... మీరు కాసేపు విశ్రాంతి తీసుకోండి. నేను ఆఫీసుకు వెళ్ళి సాయంత్రం వస్తాను'' అన్నాడు.

''ఎందుకురా చంద్రం! నేను ఊరెళ్ళిపోతాను'' చెప్పాడాయన.

''రాక రాకవచ్చారు. ఒక రాత్రయినా గడిపి వెళ్ళండి... అయినా పల్లెలో ప్రస్తుతం అత్యవసరమయిన పనులేవీ లేవు కదా?''

''అవసరమయిన పనులేమీ లేవనుకో-కుప్ప నూర్పిడులు, నారునాట్లు పూర్తయిపోయాయి. ఇక పొలాలకు నీరు కట్టుకోవడమే పని. అది రంగయ్య అయినా చూసుకుంటాడు''

''మరేమిటి మీకు బాధ... మీరీ రాత్రికి ఉండిపోండి''

''అది కాదురా... మీ అమ్మ, అత్తమ్మ-నాకోసం ఎదురుచూస్తూ ఉంటారు''.

''నా దగ్గరకు వచ్చారని తెలుసుగా! నేను బలవంతం చేస్తే ఆగిపోయుంటారని అనుకుంటారు. పెద్దగా కంగారుపడరులే...''

అతడి మాటలు కాదనలేకపోయాడు ఆయన. అంతేకాదు - అతడు తనకు సంతోషకరమయిన విషయాలు చెప్పి ఉండడంతో, ఆ సంతృప్తితో ఆ రాత్రి అక్కడే గడపదలచుకున్నాడు.

ఆయనకు బెడ్‌రూమ్, బాత్‌రూమ్ చూపించాడు చంద్రశేఖరం. వంటవాడికి ఆయనకు కావలసిన కాఫీ, ఫలహారాలు చూసుకోమని చెప్పి ఆఫీసుకు వెళ్ళిపోయాడు.

చంద్రశేఖరం ఆఫీసుకు వెళ్ళాక ఫోమ్‌బెడ్ మీద పడుకుంటే, అలసిన శరీరానికి హాయిగా నిద్ర వచ్చేసింది. ఐదింటివరకూ మత్తుగా నిద్రపోయాడాయన.

ఐదింటికి లేచి ముఖం కడుక్కున్నాడు. ఆయన లేవడంచూసిన వంటవాడు టిఫిన్ తెచ్చి ఆయన ముందుంచాడు. టిఫిన్ పూర్త య్యాక కాఫీతెచ్చి అందించాడు. కాఫీ తాగాడా యన.

బయటకు నడిచి ఇంటిముందున్న లాన్‌లో కూర్చుని పేపర్ తిరగేయసాగాడు.

సాయంత్రం ఆరవుతుండగా చంద్రశేఖరం జీప్ వచ్చి లాన్ పక్కనే ఆగింది. జీప్ దిగిన చంద్రశేఖరం ఆయనను చూసి విష్ చేశాడు - "ఏం చేస్తున్నారు మామయ్యా" జీప్ దగ్గరే నిలబడి అడిగాడు.

"పేపర్ చదువుకుంటున్నాను"

"పది నిముషాల్లో వస్తాను"

తలూపాడాయన. చంద్రశేఖరం లోపలికి వెళ్ళిపోయాడు.

అర్ధగంట తర్వాత అతడు డ్రస్ మార్చు కుని వచ్చాడు. స్నానంచేసి ఫ్రెష్‌గా తయా రయి ఉన్నాడిప్పుడు. ఆఫీసుకు సంబంధించిన విసుగు అతడి ముఖంలో ఇప్పుడు ఏమాత్రం కనిపించడంలేదు. ముఖం ప్రశాంతంగా ఉంది.

అతడు జీప్ దగ్గర నిలబడి- "రండి మామయ్యా! బజారు వరకూవెళ్దాం" పిలిచా డు.

"ఎందుకురా చంద్రం... ఇక్కడే కూర్చుని మాట్లాడుకుందాంరారా" అన్నాడాయన.

"లేదు మామయ్యా... బజారులో కాస్త పని ఉంది. మీరూ రండి" బలవంతం చేస్తున్న ట్టుగా అన్నాడు అతడు.

శంకరయ్య నిశ్శబ్దంగా పైకిలేచి జీప్ దగ్గ రకు వెళ్ళాడు. ఇద్దరూ కూర్చున్నాక జీప్ డ్రైవర్ వెహికల్‌ని ముందుకు పోనిచ్చాడు.

బజారులోని పెద్ద బట్టలషాపు ముందు జీప్‌ను ఆపించాడు చంద్రశేఖరం. శంకరయ్య ను వెంటబెట్టుకుని లోపలికి వెళ్ళాడు. ఆయ నకూ, పల్లెలోని తన తల్లికీ, అత్తయ్యకు, వసుంధరకు, రాముకు, రంగయ్యకు - అందరి కీ బట్టలు తీశాడు. ఆయన 'ఇవన్నీ ఎందు కురా' అన్నా అతడు వినిపించుకోలేదు "మా మయ్యా... నేనీనాడు! ఈ స్థితిలో ఉన్నానంటే అందుకు కారకులు మీరు. అందుకు కృతజ్ఞ తగా నేను వసుంధరను పెళ్ళిచేసుకుని ఉండ వలసింది. కాని స్టేటస్ కోసం ప్రాకులాటలో నేను మీకు అన్యాయం చేశాను. ఇప్పుడు ఆ స్టేటస్ నాలుగురోజులపాటు అనుభవించేసరి కి అదీ బోర్‌గా ఉంది. నాకిప్పుడు ఆప్యాయత ను పంచేవారు కావాలనిపిస్తుంది. నా స్టేటస్ ను కాకుండా నన్ను నన్నుగా ప్రేమించేవారు నాపక్కన ఉంటే బాగుండుననిపిస్తుంది. ఆప్యాయత, అభిమానాల కోసం ముఖం వాచి పోయే స్థితికి చేరుకున్నాను నేను... నేను సంబంధం కలుపుకున్న వ్యక్తులు కూడా మరీ వ్యాపార ధోరణి మనుషులు. వారికి అభి మానం, ఆప్యాయతల విలువ అసలు తెలియ దు. అలాంటివి వారు ఏనాడు అనుభవించి ఎరుగరు. అందుకే వారికి ఇతరులకు అవి పంచడం ఎలాగో తెలియదు. మీ కుటుంబంలో ఒకడిగా నేను అతివిలువయిన, మనిషికి అత్యంత ముఖ్యమయిన ప్రేమాభి మానాలు అనుభవించి ఉన్నాను. నా స్వయకృ తాపరాధం వలన మధ్యలో అవి పోగొట్టుకోవ డంతో, ఇంతకాలానికి వాటి విలువ తెలిసింది. కానీ, నేనిప్పుడు మరొకరి చేతులలో పూర్తిగా బందీఅయిపోయాను... వసుంధరను పోగొట్టు కోవటంలో నేను చేసిన తప్పేమిటో నాకిప్పుడు తెలిసి వచ్చింది. కాని ఏంచేయగలను. అందుకే... నా తప్పును కప్పిపెట్టుకునేందుకు, నా మనసును తృప్తిపరచుకునేందుకు మీకు ఈ చిన్నకానుకలు సమర్పిస్తున్నాను కాదన కండి" చెప్పాడు అతడు.

ఆ కొద్దివాక్యాలలోనే ఆయన అతడి దాంప త్యజీవితంలో ఏర్పడిన అసంతృప్తిని అర్థంచే సుకున్నాడు. కాని ఏమీ మాట్లాడలేదు. తనీ సమయంలో ఏంమాట్లాడినా అది ఎత్తిపొడు పులా అనిపిస్తుందని ఆయనకు తెలుసు. ఆయన మౌనంగా ఆ కవర్లు అందుకున్నాడు. చంద్రశేఖరం బిల్లు చెల్లించాక ఇద్దరూ బయ టకు వచ్చారు.




జీప్ ఇంటిదారి పట్టింది.

ఆ రాత్రి భోంచేశాక శంకరయ్యా చాలా ప్రశాంతంగా నిద్రపోయాడు.

ఆ మర్నాడు ఉదయమే బయలుదేరితే చంద్రశేఖరం బస్టాండు వరకూ వచ్చి ఆయనను బస్సు ఎక్కించాడు. బస్సు ఎక్కబోయే ముందు అతడు ఆయనతో ఒక మాట అన్నాడు -

"మామయ్యా... ఈమాట నేను బాధతో అనడంలేదు. మనస్ఫూర్తిగా అంటున్నాను. వసుంధరను పెళ్ళిచేసుకోబోతున్న భానుమూర్తి చాలా అదృష్టవంతుడు. భానుమూర్తికి పెళ్ళాడబోతున్న వసుంధర కూడా అదృష్టజాతకురాలే. తను ప్రేమించిన వ్యక్తికన్నా తనను ప్రేమించే వ్యక్తిని పెళ్ళాడితేనే మనిషికి సుఖం. భానుమూర్తి జంటగా వసుంధర చాలా సుఖపడబోతోంది... ఇద్దరూ మేడ్ ఫర్ ఈచ్ అదర్‌లా ఉండబోతారు"

ఆ మాటలకు శంకరయ్యా మనసు దూది పింజలా తేలిపోయింది 'ఆ ఒక్కలోపం లేనట్లయితే ఈ క్షణం మరెంతగా ఆనందించేవాడ్నో కదా' అనుకున్నాడాయన.

ఆ ఆనందంతోనే సంతృప్తిగా పల్లెకు బయలుదేరాడు ఆయన.



మోహన్‌కుమార్‌తో సంబంధం బయటపడ్డాక శంకరయ్యా ఏనాడూ తన కూతురితో మాట్లాడి ఎరుగడు. కూతురు చేసిన తప్పును అర్థంచేసుకునేందుకు ప్రయత్నించి, ఆమె మీద జాలిపడినా కూడా, ఎందుకనో ఆమెతో పలకాలనిపించేది కాదు ఆయనకు. అలాంటిది ఆయన చంద్రశేఖరంను కలిసివచ్చాక మర్నాడు ఆమె గదిలోకి వెళ్ళాడు.

అడుగుల సవ్వడి వినడంతో చదువుకుంటున్న పుస్తకంలోనుండి తలతిప్పి అటుగా చూసింది వసుంధర. ఆయనను చూసి మంచం మీద నుండి లేచి నిలబడింది వెంటనే.

ఆయన ఆ మంచంమీదనే ఒకపక్కగా కూర్చుని, కూతురితో చెప్పాడు - "కూర్చో వసూ"

వసుంధర మెల్లగా కూర్చుంది. చేతిలోని పుస్తకాన్ని పక్కనపెట్టింది. తలవంచుకుని నేల చూపులు చూడసాగింది.

"నేను నిన్న చంద్రం బావ దగ్గరకు వెళ్ళి వచ్చాను" వచ్చిన విషయానికి ఉపోద్ఘాతంలా అన్నాడు ఆయన.

ఆమె ఎందుకని ప్రశ్నించలేదు. మౌనంగా తలూపింది. అంతే.

ఆయనే చెప్పాడు - "ఎందుకంటే మూడురోజులక్రితం నిన్ను చూసేందుకు వచ్చిన అబ్బాయి మంచిచెడ్డలు కనుక్కునేందుకు వెళ్ళాను... ఆ అబ్బాయి మీ బావకు ఒకప్పుడు రూమ్మేటు. కాబట్టే మీ బావ అతడి గురించిన పూర్తివివరాలు చెప్పగలిగాడు". కూతురిలోని రియాక్షన్ గమనించేందుకు ఆగాడాయన. వసుంధరలో ఎలాంటి చలనమూ లేదు. ఆయన మాటలను శిలాప్రతిమలా వింటోందేతప్ప, కనీసం తలూపటం కూడా చేయట్లేదు.

అయినా తను వచ్చినందుకు ఆ నాలుగు మాటలు చెప్పి వెళ్ళడం మంచిదనుకున్నాడు ఆయన. పెళ్ళికావలసింది ఆమెకి కాబట్టి కనీసం ఆమె అభిప్రాయం తెలుసుకోవడం ముఖ్యమనుకున్నాడు. ఆమె పెళ్ళికి అంగీకరించినా, అంగీకరించకపోయినా ఆఖరి నిర్ణయం ఎలాగూ తమదే.

"భానుమూర్తి నిన్ను చాలా ఇష్టపడుతున్నాడమ్మా! అతడు చంద్రం గదిలో ఉండేప్పుడు నీ ఉత్తరాలు చదివే అవకాశం కలిగిందట. ఆ ఉత్తరాలలోని నీ భావాలకు ఆకర్షితుడయి నీమీద మమకారం పెంచుకున్నాడు. చంద్రం నీ మనసు కష్టపెట్టినందుకు బాధపడినా, ప్ర

న్నతం అది తన అదృష్టంగా భావించుకుంటు న్నాడు అతడు. అతడికి నీమీద ఎంత అను రాగం ఉందంటే - కలెక్టర్ భర్త రావలసిన నీకు కాషియర్ మొగుడిగా నీ జీవితంలో ప్రవేశించలేక, తను కూడా కలెక్టర్ కోర్స్ చద వడం ప్రారంభించాడు. మీ చంద్రం బావ చెప్పడం- అతడు తనకన్నా అద్భుతమైన తెలివితేటలు, మంచి పట్టుదల ఉన్న వ్యక్తనీ, అనుకున్నది సాధిస్తాడనీను. నిన్ను అంతగా కోరుకునే వ్యక్తితో నీ పెళ్ళి జరగబోవడం నీ అదృష్టం తల్లీ..." చెప్పడం ఆపాడాయన.

వసుంధరలో ఒకింత కదలిక కనిపించింది ఆ మాటలకు. ఆమె మెల్లగా తలెత్తి తండ్రి ముఖంలోకి చూసింది. జాలిగా ముఖం పెట్టి చెప్పింది- "నాన్నా! నాకు... నాకు పెళ్ళివద్దు నాన్నా".

ఆయన అడిగాడు- "ఈ అబ్బాయి వద్దా లేక అసలే పెళ్ళివద్దా?"

"నాకు అసలే పెళ్ళి వద్దు నాన్నా"

ఆయన అదోలా నవ్వాడు- "పిచ్చి తల్లీ! అనుకోకుండా ఏదో చిన్న తప్పు జరిగిందని, జీవితమంతా నాశనం చేసుకుంటాననడం వెర్రితనం కాక మరేమవుతుంది? జరిగినదా నిని మరిచిపో. జరగబోతున్న దానిమీద మన నును లగ్నం చేయి"

"ఎలా మరిచిపోను నాన్నా! ఎంత మరచి పోవాలని ప్రయత్నించినా ఆ తప్పు అను క్షణం మనసులో మెదలాడుతూ నన్ను చిత్ర వధ చేస్తోంది... మనసున్న ఏ ఆడపిల్లా అలాంటి తప్పును అంత సులభంగా మర్చిపో లేదు నాన్నా" ఆమె గొంతు జీరపోయింది.

'అందులోనూ నీది చాలా సున్నితమైన మనసు కదా తల్లీ' మనసులోనే అనుకుని నిట్టూర్చాడాయన. కాని ఆమెకు ధైర్యం చెపు తూ అన్నాడు- "మరిచిపోవాలి వసూ! కొన్ని ఘోరాలను పీడకలలుగా తలచుకుని మన మనసులో నుండి తొలగించాలి. లేకుంటే మనిషి బతకడమే కష్టం. ఒకవేళ అలా మరచిపోలేకపోయినా కనీసం సాటివారికోసమ యినా మరిచిపోయినట్టుగా నటించాలి. అలా చేయకపోయినట్లయితే నీతోపాటు నీవారు కూడా బాధపడుతూ ఉండిపోవాలి... నీవారు బాధపడుతూ ఉండటం నీకు ఇష్టమేనా- నువ్వే చెప్పు వసూ!"

ఆ మాటలు ఆ మనసును తాకవలసినచోట తాకాయి "మిమ్మల్ని బాధపెట్టాలని నేను ఎందుకు అనుకుంటాను నాన్నా?" ప్ర శ్నించిందామె.

"మిమ్మల్ని బాధపెట్టాలని అనుకుంటున్నా నని కాదు వసూ... మిమ్మల్ని సంతోషపె ట్టేందుకు ప్రయత్నించమని కోరుకుంటున్నా ను"

"మిమ్మల్ని సంతోషపెట్టాలంటే అందుకు... అందుకు నేను పెళ్ళిచేసుకోవాలి అంతేకదా నాన్నా?"

"అంతేతల్లీ"

ఆమె దోసిటిలో ముఖం కప్పుకుంది- "నా న్నా... నా మనసులోని వేదన, అనుమానం మీకెలా చెప్పను" ఆమె కన్నులలో నీరు నిల చాయి.

ఆయన తన కుడిచేతిని ఆమె శిరస్సుపై ఉంచి మృదువుగా రాశాడు. "నీ మనసులోని మాట ఏమిటో నాకు చెప్పమ్మా" అడిగాడు.

మాటలు కూర్చుకునేందుకు ఆమెకు రెండు నిమిషాల వ్యవధి అవసరపడింది. "ఇది నా అనుమానమో నిజమో నాకు తెలి యదు. కేవలం నా అనుమానమే అయినా అది యదార్థమేనన్నంత గాఢంగా నేను నమ్ము తున్నాను. ఆ నా నమ్మకం పెళ్ళంటేనే నన్ను భయపడేలా చేస్తోంది..." ఆగిందామె. అరని ముషం తర్వాత తిరిగి చెప్పింది- "... నేనొక దురదృష్టజాతకురాలిలా నాకనిపిస్తుంది నాన్నా. కొందరికి కొన్ని ఆనందాలు పొందగలి గే యోగం ఎట్టిపరిస్థితిలోనూ ఉండదు. ఒక వేళ ఎవరయినా ఆ దురదృష్టజాతకులకు ఆ యోగం కలిగించాలని ప్రయత్నించినా అందువలన ఇతరులు నష్టపోవడమేతప్ప ఆ అదృష్టహీనుల జాతకం ఎంతమాత్రం మార బోదు. మరి పెళ్ళి విషయంలో దురదృష్టజాత కురాలయిన నాకు పెళ్ళిచేయాలనుకోవడం వ్యర్థప్రయత్నమేమోననిపిస్తోంది. నా దురదృ ష్టజాతకంవలన మరొకరికి కీడు జరుగుతుందే మోనన్న భయంతోనే నేను పెళ్ళిప్రయత్నం




చేయవద్దంటున్నాను'' అంతా చెప్పాక వెక్కివెక్కి ఏడవసాగింది వసుంధర.

శంకరయ్య అప్రతిభుడయిపోయాడు. కూతురి నమ్మకంలో నిజం ఎంతో తెలియదు గాని ఆమెకు తన జాతకంమీద అలాంటి నమ్మకం కలిగించిన పరిస్థితుల భయంకర రూపం ఆయన కనులముందు సాక్షాత్కరించింది. ఆమె తనమీద తను అలాంటి నమ్మకం కలిగించుకుందంటే, అంతకుమునుపు ఆమె పడిన మానసిక సంఘర్షణ ఎటువంటిదో ఆయన ఊహించగలిగాడు. కూతురి మీద అభిమానం చెలియలికట్ట దాటింది. ఆయన కూతురిని దగ్గరగా తీసుకుని గుండెలకు హత్తుకున్నాడు. "వసూ... ఒక్కసారిగా నీకు ఎన్నికష్టాలు వచ్చాయి తల్లీ! సుఖంతప్ప దుఃఖం ఎరగని నువ్వు ఒక్కసారిగా నరకంలోకి నెట్టబడ్డావు. తల్లితండ్రుల ఆప్యాయతను మాత్రమే రుచిచూసిన నువ్వు ఈనాడు గదిలో ఒంటరిగా ఉండిపోయి మానసిక యాతనను అనుభవిస్తున్నావు''

"అందుకే నాన్నా... ఈ యాతనను ఇంతటితో ఆపేయాలనుకుంటున్నాను. పెళ్ళి అనే మాట తలపెట్టకూడదని, పురుషులకు పాతిక అడుగుల దూరంలో ఉండాలని నిశ్చయించుకున్నాను''

"లేదు వసూ... ఈసారి ఎలాంటి తప్పు జరగబోదు. నేను అన్నివైపులా ఆలోచించి, అబ్బాయి గుణగణాలు విచారించే ముందడుగు వేస్తున్నాను. నీ నమ్మకం తప్పని ఈసారి రుజువుకాబోతోందమ్మా''

ఆమె మౌనంగా ఉండిపోయింది.

"ఈ పెళ్ళికి ఒప్పుకో వసూ'' బతిమలాడుతున్నట్టుగా అన్నాడాయన.

నన్ను అంతగా ఇష్టపడేవ్యక్తికి, నాశీలం గురించి చెప్పకుండా మౌనం చేయడం మంచిదికాదేమో- మనసులోనే అనుకుందామె. అంతలోనే అంతకుమునుపు శకుంతలత్తయ్య చెప్పిన మాటలు గుర్తుకువచ్చాయి. మరోసారి తర్కించడం ఇష్టంలేక మౌనంగా ఉండిపోయింది. అంతరాత్మ అది తప్పని ఘోషపెడుతున్నా తనవారిని సంతోషపెట్టటం కోసం ఆ అంతరాత్మను తొక్కిపెట్టింది.

అతికష్టంమీద అక్షరాలు కూడదీసుకుని చెప్పింది "మీ ఇష్టం నాన్నా''

ఆమాటేచాలు అన్నట్టుగా ఆయన సంతోషపడిపోయాడు. ఆ సంతోషంలో కూతురి బుగ్గ మీద ముద్దుపెట్టుకుని వడివడిగా అవతలికి వెళ్ళిపోయాడు.

తన తండ్రి సంతోషం చూడటంతో ఆమెకు తృప్తిగా అనిపించింది. ఆ తృప్తి కోసమయినా తన అంతరాత్మను చంపుకోదలచుకుందామె.

★ ★ ★

పెళ్ళికి అంగీకరించదనుకున్న వసుంధర తన అంగీకారం తెలియచేయడంతో ఆయన తన ఏర్పాట్లలో మునిగిపోయాడు.

మొదటగా ఈ పెళ్ళికి తన సంసిద్ధతను వ్యక్తంచేస్తూ, త్వరలో ముహూర్తం పెట్టుకునేందుకు రమ్మని భానుమూర్తికి ఉత్తరం రాశాడు.

ఉత్తరం రాసిన వెంటనే ఆ విషయం వసుంధరకు తెలియచేశాడు "ఈరోజు మంచి రోజని భానుమూర్తికి ఉత్తరం రాశానమ్మా'' అన్నాడు.

ఆమె మౌనంగా ఉండిపోయింది.

ఆమాట చెప్పాక ఆయన గదిలోనుండి వెళ్ళిపోయాడు. సరిగ్గా అప్పుడే ఆమెకు కడుపులో ఏదోలా అనిపించింది. కళ్ళు తిరుగుతున్నట్టుగా అనిపించినా, వాంతయ్యేలా ఉండటంతో పెరట్లోకి వెళ్ళింది. అరుగుమీద కూర్చోకమునుపే వాంతయింది.

ఏదోపనిమీద అప్పుడే అటుగా వచ్చిన శకుంతలమ్మ వసుంధర అవస్థ చూసింది. దగ్గరగా వచ్చి రెండుచెవులూ మూసిపెట్టింది.

వాంతి పూర్తిగా అయి, ఆమెకొస్త తేరుకున్నాక శకుంతలమ్మ అడిగింది "ఏమిటే వసూ... ఏమయింది?''

"కడుపులో తిప్పినట్టుగా అనిపించింది. ఇక్కడకు వచ్చేసరికి వాంతయింది'' బదులు పలికింది వసుంధర.

"ఆఁ... అలా...గా...'' అంటున్నప్పుడే ఆమె మనసులో ఏదో భయంకర అనుమానం ప్రవేశించింది. ఆమె చప్పున వసుంధరను తన

వైపు తిప్పుకుని ఒక ప్రశ్నవేసింది- కంగారుగా.

"రెండునెలలు కావస్తోంది అత్తయ్యా" చెప్పింది వసుంధర.

ఆ జవాబుకు శకుంతలమ్మ ముఖంలో కత్తివేటుకు నెత్తురుచుక్కలేనంతగా పాలిపోయింది. "హే రామా" అంటూ కిందికి జారిపోయింది.

వసుంధరకు మొదట ఏమీ అర్థంకాలేదు. కాని ఏంజరిగి ఉంటుందో ఊహించలేనంత అమాయకురాలు కాదు. ఏం జరిగి ఉంటుందో మెల్లగా అర్థమయ్యాక ఆమె గుండెలవిసిపోయాయి. భూమి గిర్రున తిరిగినట్లనిపించింది. నిలుచునే ఓపికలేక తనూ కింద కూలబడిపోయింది వసుంధర.

ముందుగా తేరుకున్న శకుంతలమ్మ లేచి వెళ్ళి ఈ వార్త అన్నావదినల చెవిన వేసింది. వారు అప్రతిభులయ్యారు.

ఆ ఇంట్లో మరొక్కసారి కల్లోలం చెలరేగింది. సమస్య తీరేలోగా మరోసమస్య వచ్చిపడుతుంటే వారు దిక్కుతోచనివారయ్యారు. శంకరయ్యకు కూతురిమాటలు గుర్తుకువచ్చాయి. ఆమె అన్నట్టుగా 'ఆమె పెళ్ళివిషయంలో దురదృష్టజాతకురాలు కాదుకదా' అనుమానపడ్డాడాయన. ఏదేమయినా వసుంధర పెళ్ళి విషయంలో దురదృష్టంతో పోరాడాలనుకున్నాడు. కాని... ప్రస్తుతం ఈ సమస్యను ఎలా ఎదుర్కోవాలి ఆ ప్రశ్న అతిభయంకరంగా వారి ముందు నిలచింది. జవాబుకోసం తలలు బద్దలుకొట్టుకున్నారు.

శకుంతలమ్మ ఒక ఉపాయం చెప్పింది- 'వసుంధర గర్భవతి అన్నవిషయం కొద్దికాలంపాటు రహస్యంగా దాచిపెట్టేది. భానుమూర్తితో వ్యవహారం ఎలాగూ ముహూర్తాలవరకూ వచ్చింది కాబట్టి, త్వరపడి వెంటనే వసుంధర పెళ్ళి జరిపించేసేది. పెళ్ళి జరిగిపోయాక ఏదో కారణంమీద వారంరోజులపాటు అమ్మాయిని ఒంటరిగా ఎటయినా తీసుకువెళ్ళి హాస్పిటల్‌లో చేర్పించి అబార్షన్ చేయించేది... లేదా ధైర్యంఉండి భానుమూర్తిని మభ్యపెట్టగలమనుకుంటే ఏడోనెలలోనే బిడ్డపుట్టాడని లోకాన్ని నమ్మించడం పెద్దకష్టంకాబోదు. అయితే ఈ వ్యవహారాన్నంతా చాలా జాగ్రత్తగా ఎవరికీ అనుమానం రాకుండా జరిపించగలిగి వుండాలి. లేకుంటే గుట్టురట్టయి పల్లెలో తలెత్తుకోలేని పరిస్థితి ఏర్పడవచ్చు. ఆ రోజు వసుంధర కాపురం పూర్తిగా కూలిపోయే పరిస్థితికూడా రావచ్చు"

చెల్లెలు చెప్పిన వివరాలు జాగ్రత్తగా విన్నాడు శంకరయ్య. తప్పు-ఒప్పులను పక్కనపెట్టి ప్రస్తుతం ఈ సమస్యనుండి గట్టెక్కడం ముఖ్యమని ఆయన ఉద్దేశం. అందుకే అంతరాత్మజోలికి పోకుండా, చెల్లెలు చెప్పిన ఉపాయంలోని బాగోగులు తర్కించుకోసాగాడాయన.

ఆయనకిప్పుడిప్పుడే నమ్మకం కలుగుతోంది- పెళ్ళి విషయంలో వసుంధర దురదృష్టజాతకురాలని. అందుకే ఏదేమయినా ముందు ఆమె పెళ్ళి జరిపించేయాలనుకుంటున్నాడు ఆయన. పెళ్ళి జరిగిపోతే వచ్చిన సమస్యలన్నీ వాటంతటఅవే సర్దుకుపోతాయని ఆయన నమ్మకం. కాబట్టి ముందు పెళ్ళి జరిపిస్తే ఆ తర్వాత శకుంతల చెప్పినట్టు- పదిరోజులు ఎక్కడైనా తీసుకువెళ్ళి అబార్షన్ చేయించడమో లేదా భానుమూర్తిని మభ్యపెట్టడమో పరిస్థితినిబట్టి నిర్ణయించుకోవచ్చు అనుకున్నాడు.

ఆయన ఇక సమస్య గురించి ఆలోచించకుండా, మామూలుగానే పెళ్ళి ఏర్పాట్లుచేయడం సాగించాడు. పురోహితుడిని త్వరలో ఉన్న ముహూర్తం ఏమిటని విచారించాడు. పదిహేనురోజులలో ఒక మంచి ముహూర్తం ఉందని పురోహితుడు చెప్పాడు.

ఇంటిలోనివారంతా ముహూర్తం పెట్టుకునేందుకు భానుమూర్తి కోసం ఎదురుచూడసాగారు.

ఆ ఇంటిలోనివారంతా వసుంధర 'గర్భవతి' అన్న విషయం మరిచిపోయినట్టుగా నటిస్తున్నా ఆమె మాత్రం ఆ సత్యాన్ని అరనిముషం కూడా మరవలేకపోతోంది. తనని కోరి వరించదలచుకున్న ఆ వ్యక్తిని మరీ ఇంతఘోరంగా మోసంచేయటం ఆమె భరించలేకపోతోంది. తన జీవితం నాశనమయినాసరే ఆ వ్యక్తిని మోసం చేయకూడదనుకుంది. అందుకే ఆమె ఒకనిర్ణయం తీసుకుంది.




శంకరయ్యగారి బీరువా వెతికితే అందులో భానుమూర్తి అడ్రసు దొరికింది.

తెల్లకాగితం అందుకుని అందులో వివరాల న్నీ రాయసాగింది. తనకు డాక్టర్ పరిచయం అవడం, శీలం కోల్పోయిన పరిస్థితులు, ప్రస్తుతం తను గర్భవతినన్న విషయం- అన్నీ వివరంగా రాసింది. అవి రాస్తుంటే ఆమె చేతులు వణికాయి. దుఃఖాన్ని అదుపులో పెట్టుకునేందుకు చాలా కష్టపడవలసి వచ్చింది. ఉత్తరం చివరగా ఆమె రాసింది "... నా జీవితంలో నేనింతవరకూ ఏ తప్పు చేయలేదనే అనుకుంటున్నాను. నేను చేసిన తొలితప్పు ఇది. తప్పుకు ఫలితం ఇంతఘోరంగా ఉంటుందని నాకు తెలియదు. అసలు ఆ తప్పు అనుకోకుండానే జరిగిపోయింది. మరి నేను చేసిన ఆ తప్పుకు నేనే శిక్ష అనుభవించ దలచుకున్నాను. నేనింతవరకూ ఎవరినీ మోసగించలేదు. మనం ఎంత బాధ అనుభవించవలసివచ్చినా ఎదుటివాడిని మోసగించి మన బాధను తొలగించుకోవాలనుకోవడం క్షమించరాని నేరం. ఆ నేరం చేయకూడదనే నేను మీకీ ఉత్తరం రాస్తున్నాను. దయచేసి నన్ను పెళ్ళిచేసుకోవాలనే ప్రయత్నం మానుకోండి"

-పెళ్ళిచేసుకోబోయే అమ్మాయి శీలవతి కాదని తెలిస్తే ఎవరూ ముందుకురారు. అలాంటిది ఏకంగా గర్భవతి అని తెలిశాక ఏ మగాడూ ఆ యువతిని పెళ్ళాడాలనుకోడు. ఆదర్శమో, డబ్బు మీది వ్యామోహమో, మనిషిమీద అభిమానమో ఉంటే తప్ప అది సాధ్యంకాదు. అందుకే- అతడు తనను ఇక పెళ్ళిచేసుకోగలడని ఆమె అనుకోవడంలేదు.

తనకిక పెళ్ళికాదని నిశ్చయించుకున్నా కూడా ఆమెకు అంత బాధకలగడంలేదు. తను ఎవరినీ మోసగించడంలేదన్న తృప్తి మనసులో ఉండిపోయింది.

అయితే- ఆమె నిరాశను, ఊహను బద్దలు చేస్తూ భానుమూర్తి దగ్గరనుండి ఉత్తరం వచ్చింది.

మధ్యాహ్నంవేళ "పోస్ట్" అన్నకేక వినిపించింది. వసుంధర హాలులోకి తొంగిచూసింది. అమ్మానాన్నలు నిద్రపోతున్నారు. ఇక తప్పనిసరి పరిస్థితిలో ఆమె వీధివాకిటవరకూ వచ్చి పోస్ట్‌మేన్ అందించిన ఉత్తరం చేతిలోకి తీసుకుంది. అడ్రసుచూస్తే ఉత్తరం తనను ఉద్దేశించి ఉంది. వెనక్కుతిప్పిచూస్తే 'భానుమూర్తి' అన్నపేరు కనిపించింది ఫ్రమ్ అడ్రసులో.

ఆమె నుదుటన చెమటలు పట్టాయి. ఉత్తరం చివర చించుతుంటే ఆమె చేతులు వణికాయి. విప్పిన తెల్లకాగితంమీద అక్షరాలు నీట్‌గా కనిపించాయి. ఆమె కన్నులు అక్షరాల వెంట పరుగెత్తాయి.

"ప్రియమైన వసుంధరకు...

మీ ఉత్తరం అందింది. వివరాలు పూర్తిగా తెలిశాయి.

ఆ వివరాలు చదవడంతోనే మనసులో కాస్త బాధగా అనిపించినా వెంటనే సర్దుకున్నాను. ప్రస్తుతం నామనసులో నువ్వు గర్భవతివన్న ఫీలింగ్ ఏ మాత్రం లేదు. మనం అభిమానించేవ్యక్తి తెలిసీ తెలియనితనంతో ఒక తప్పు చేసినా ఆ తప్పును క్షమించి దగ్గరకు తీసుకోవడమే... నిజమైన ప్రేమ అవుతుంది.

సో... స్టిల్ ఐ లవ్ యూ...

మీ నాన్నగారి ఉత్తరం అందింది. త్వరలోనే నేను మీ వల్లెకు వస్తున్నాను. ఎందుకో తెలుసా? ముహూర్తం నిర్ణయించి నిన్ను నా సొంతం చేసుకునేందుకు..."

ఆ ఉత్తరం చదవటం పూర్తికాగానే అరని ముషంపాటు ఆమె అలాగే ఉండిపోయింది. మనుమల మానవత్వంపై ఆమెకు అప్పటికే నమ్మకం సన్నగిల్లిపోయింది. సాటివారిని మోసగించడమే ఈ మనుషుల నైజం అనుకుంటోంది. అటువంటిస్థితిలో ఆమెకు ఆ ఉత్తరం అందించిన ఆనందం అంతాఇంతాకాదు. 'లేదు... ఈ లోకంలో మానవత్వం ఇంకా మిగిలే ఉంది. ప్రపంచంలో అందరూ మోసగాళ్ళుకాదు మంచివారుకూడా ఉన్నారు' అనుకుందామె.

ఆమె సంతోషంగా ఇంటిలోపలికి పరుగెత్తింది. అప్పుడే నిద్రలేస్తున్న శంకరయ్య కూతురు ఉత్తరం చేతపట్టుకుని గదిలోకి పరుగెత్తడం చూశాడు. అనుమానం కలిగి ఆమె

గది దగ్గరకు వెళ్ళి వాకిట నిలబడ్డాడు.

వసుంధర ఆ ఉత్తరంలోని అక్షరాలు అదేవ నిగా చూసుకుంటోంది. చాలాకాలం తర్వాత పెదాలు మీద చిరునవ్వు కదలాడింది. ఆకాశాన్ని చేత్తో అందుకున్నంత ఆనందం కలిగింది.

శంకరయ్య కూతురి ముఖంలోని ఆనందం గమనించాడు. ఆమె ఆనందానికి కారణమయిన ఆ ఉత్తరంలోని విశేషం ఏమిటా అని ఊహించేందుకు ప్రయత్నించాడు. కాని అదేమీ ఆయన ఊహకు తోచకపోవడంతో కూతురినే అడిగాడాయన.

"ఆ ఉత్తరం ఎక్కడనుంచమ్మా?"

అప్పుడే తండ్రిని చూసిందామె. ఒకింత కంగారుపడింది కూడా. అయితే వెంటనే తేరుకుని తండ్రిని చూసి నవ్వింది- "భానుమూర్తి గారి దగ్గరనుండి ఉత్తరం వచ్చింది నాన్నా" చెప్పిందామె.

ఆయన కళ్ళు చిట్లించాడు "ఆ అబ్బాయి దగ్గరనుండి ఉత్తరమా.. ఏమని రాశాడు?" ప్రశ్నించాడు.

క్షణంపాటు సంకోచించి, ఆ ఉత్తరం తండ్రికి అందించింది వసుంధర. శంకరయ్య ఆ ఉత్తరం అందుకుని చదివాడు. ఆశ్చర్యంతో ఆయన కన్నులు విస్ఫారితాలయ్యాయి. "... వివరాలేమిటమ్మా?" అయోమయంగా అడిగాడు.

"జరిగిన విషయాలన్నీ ఆయనకు వివరంగా ఉత్తరం రాశాను నాన్నా"

ఆయన గొంతులో ఏదో అడ్డుపడ్డట్టుగా అనిపించింది "అంటే... అంటే నీ గర్భం విషయం..."

"అదే రాశాను నాన్నా"

కూతురిని ఎలా అర్థంచేసుకోవాలో ఆయనకు తెలియలేదు. అమాయకురాలనుకోవాలో లేక అత్యంత నిజాయితీపరురాలనుకోవాలో అర్థంకాలేదు. ఏమయినా జరిగింది మంచే కాబట్టి బాధపడే అవసరం కలగలేదు. పైగా అప్పటివరకూ కూతురి రహస్యం ఎలా కప్పెట్టాలా అని దిగులుపడుతున్న ఆయనకు ఆ సమస్య యింతతేలికగా పరిష్కారం కావటం ఆనందాన్నే కలుగజేసింది.

ఆ ఆనందంలో ఆయన ఈ విషయాన్ని భార్యను తట్టిలేపి చెప్పాడు. శారదమ్మ వెళ్ళి శకుంతలమ్మకు చెప్పింది.

ఆ విషయంపట్ల అందరూ విస్మయానందంచెందారు. వసుంధర నిజాయితీనే ఆమెను కాపాడిందనీ, తమను ఒక భయంకర సమస్యనుండి రక్షించిందనీ అనుకోసాగారు.

★ ★ ★

ఒకరోజు మధ్యాహ్నానికి ఒకింత ముందు ఆ ఇంటి ముంగిట సిమెంట్ కలర్ అంబాసిడర్ కారు ఆగింది. అందులోనుండి మొదట భానుమూర్తి దిగాడు. అతడి వెనుకే మధ్యవయస్సున్న దంపతులిద్దరు దిగారు. వారు భానుమూర్తి అన్నా వదినలని చూడటంతోనే అనుకున్నాడు శంకరయ్య. ఆయన వారికి ఎదురుగా వెళ్ళి సాదరంగా ఆహ్వానించాడు. "రండి... రండి"

ఆ ముగ్గురినీ తీసుకువెళ్ళి హాలులోని కుర్చీలలో కూర్చోబెట్టాడు ఆయన. కుర్చీలలో కూర్చున్నాక భానుమూర్తి తనవారికి ఆయనకు పరిచయం చేశాడు. "ఈయన మా అన్నగారు వినాయకరావుగారు. ఆవిడ మా వదిన విమలాదేవి"

శంకరయ్య వారిద్దరికీ నమస్కరిస్తే, వారు ప్రతినమస్కారం చేశారు.

"మీ గురించి భానుమూర్తి చెప్పారండి. మిమ్మల్ని కలుసుకోవటం నాకు చాలా ఆనందంగా ఉంది"

వినాయకరావుగారు కూడా నవ్వారు. "మీ గురించి కూడా మావాడు చెప్పాడు. మీ వివరాలు విని చాలా సంతోషపడ్డాను నేను. అంతకన్నా ఆనందకరమయిన విషయమేమిటంటే మావాడు పెళ్ళిచేసుకునేందుకు అంగీకరించటం. గత మూడునాలుగేళ్ళుగా మేము అతడిని పెళ్ళిచేసుకోమని పోరుతుంటే, 'నాకిప్పుడే పెళ్ళి ఎందుకంటూ' వాడు తాత్సారం చేస్తూ వచ్చేడేతప్ప పెళ్ళికి అంగీకరించలేదు. అలా మేము గొడవ పెడుతున్నామని మా ఇంటికే రావటం మానేశాడు. వాడి వదినకు అతగాడిమీద మహా మమకారం. చిన్నప్పటి నుండీ పెంచి పెద్దచేసింది కాబట్టి నెలకొకసా





రయినా ఇంటికి వచ్చి వెళ్లమంటే వాడు పెళ్ళిమాటలకు భయపడి, అసలు రావడమే మానుకున్నాడు. అలాంటివాడు మొన్న ఇంటికి వచ్చి ఏకంగా అన్నయ్యా! నేను పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాను. అమ్మాయిని కూడా చూసిపెట్టుకున్నాను. ఇక మీకు నచ్చటం మాత్రమే మిగిలివుంది అంటే ఆశ్చర్యపడ్డాము మేమిద్దరం. ఆ తర్వాత మీ వివరాలు విని ఆనందపడ్డాము''

వినాయకరావుది కాస్త భారీ ఆకారం. దానికి తోడు పెద్ద బొజ్జ. నాలుగు మాటలు మాట్లాడేసరికి ఆయనకు ఆయాసం వచ్చింది. మాటలు ఆపి అలసట తీర్చుకోసాగారాయన.

శంకరయ్యగారు నవ్వుతూ ఉండిపోయారు. శారదమ్మ ట్రేలో మంచినీళ్ల గ్లాసులు పెట్టుకొచ్చి అందరికీ అందివ్వసాగింది. ''మా ఆవిడ శారద'' అందరికీ చెప్పాడు ఆయన.

వారు ఆరోజు వస్తారని తెలిసి ఉండటంతో అన్ని ఏర్పాట్లూ చేసుకుని ఉన్నారు శారదమ్మగారు. రెండు నిమిషాలు ఆ చోట నిలబడ్డాక - ''లేవండి... భోంచేద్దురు'' అంది ఆమె. విమలాదేవిగారు తల అడ్డంగా ఆడిస్తూ- ''భోజనాల సంగతి తర్వాత, ముందు మా భాను ఆలోచనలు ఒక్కసారిగా పెళ్ళివైపు మళ్లించిన నా చెల్లెలు ఎలా ఉంటుందో చూడాలని ఉంది'' అన్నది.

శంకరయ్య, శారదమ్మలు నవ్వారు. ''అమ్మాయిని ఇంకా తయారుచేయలేదు. మీ భోజనాలు పూర్తయ్యాక, తీరికగా ఆ ఏర్పాట్లు చూడాలనుకుంటున్నాం'' జవాబిచ్చింది శారదమ్మ.

''అలాగే'' అంటూ వారు లేచారు. పెరట్లోకి తీసుకువెళ్ళాడు శంకరయ్య. రంగయ్య వారి కాళ్లకు నీళ్లందించాడు.

వంటగదిలోనికి వచ్చాక శారదమ్మ పీటలు వేసి, అరిటాకులు ముందుంచింది. శకుంతలమ్మ, శారదమ్మలు కలిసి వారికి భోజనాలు వడ్డించసాగారు.

భోజనం చేస్తున్న వినాయకరావు, విమలాదేవిలు కులాసాగా కబుర్లు చెప్పసాగారు. వారు చాలా కలుపుగోలు మనస్తత్వం ఉన్న వ్యక్తులని ఆ కుటుంబసభ్యులకు అర్థమయింది. భోజనాలు పూర్తయ్యాక వారంతా హాలులో విశ్రాంతిగా కూర్చున్నారు. ఆ సమయంలోనే శంకరయ్య తన స్థితిగతులను వినాయకరావుకు వినిపించాడు. అవి విన్న వినాయకరావు ''శంకరయ్యగారూ! మేము ఆస్తిపాస్తులు చూసి మీ సంబంధం అంగీకరించలేదు. మా అబ్బాయికి మీ అమ్మాయి నచ్చింది. మాకు మీ కుటుంబ గౌరవం నచ్చింది- అంతేచాలు'' అన్నాడు.

ఆయన మంచిమనసుకు మనసులోనే జోహార్లర్పించాడు శంకరయ్య.

మరి కాసేపటి తర్వాత వసుంధరను వారి ఎదుటకు తీసుకువచ్చారు ఇంటిలోని ఆడవారిద్దరూ. ఆమెను చూసిన పెద్దలిద్దరూ సంతృప్తిగా తలాడించారు. ''మరీ ఇంత అందమైన అమ్మాయి ఎదురైతే ఏ బ్రహ్మచారికయినా పెళ్ళి చేసుకోవాలనే ఆలోచన రాకుండా ఎలా ఉంటుందిలెండి'' హాస్యాలాడాడు వినాయకరావు.

''మీ తమ్ముడు అమ్మాయి రూపంకన్నా ముందు గుణగణాలు విని మనసుపడ్డాడన్న విషయం మీరు మరచిపోతున్నారు'' మోచేత్తో భర్తను పొడిచింది విమలాదేవి.

అన్నావదినల హాస్యానికి పెదవులు బిగబట్టి నవ్వకుండా ఉండిపోయాడు భానుమూర్తి.

శంకరయ్య మాత్రం చిరునవ్వు నవ్వాడు. వసుంధర రాసిన ఉత్తరం గురించి భానుమూర్తి తన అన్నావదినలకు చెప్పలేదనే విషయం అప్పుడే అర్థమయిందాయనకు. దాంతో భానుమూర్తిమీద మరింత గౌరవం పెరిగిపోయింది. పెద్దవారిముందు తలదించుకునే పరిస్థితి రానందుకు సంతోషించాడు శంకరయ్య.

వసుంధరను లోపలికి తీసుకెళ్ళిపోయారు.

శంకరయ్య, వినాయకరావులు ముహూర్త విషయాలలోకి దిగబోతూ ఇంటిలోని ఆడవారిద్దరినీ కూడా అక్కడకు పిలిచారు. ఆ సమయంలో భానుమూర్తి అక్కడ ఉండటం అనవసరం అనిపించింది- ''ఏరా! అమ్మాయితో ఏమైనా రెండుమాటలు మాట్లాడుతావా?'' అడిగాడు వినాయకరావు.

''అలాగే'' నవ్వుతూ బదులిచ్చాడు అతడు.

"సరే... వెళ్ళు" అన్నారాయన.

భానుమూర్తి కుర్చీలోనుండి పైకిలేచి వసుంధర గదివైపు నడిచాడు. గది వాకిట నిలబడి "నమస్తే" అన్నాడు.

తలొంచుకుని కూర్చుని ఉన్న ఆమె ఆ పిలుపుకు తలతిప్పి చూసి, తటాలున లేచి నిలబడింది. అతడు లోపలికి నడిచాడు.

ఆమె మనసంతా టెన్షన్‌గా అనిపించింది. అతడితో ఏంమాట్లాడాలో తెలియలేదు. కనీసం "కూర్చోండి" అని కూడా అనలేకపోయింది.

అతడు గదిలోని గోడకు ఆనుకుని నిలబడ్డాడు. ఏంమాట్లాడాలో అతడికి కూడా అర్థంకాలేదు. ఇద్దరిమధ్యా కాలం బరువుగా నడవసాగింది.

"బాగున్నారా?" ఏదో మాట్లాడాలి కనుక అడిగాడు అతడు.

వంచినతల పైకెత్తకుండానే తలూపిందామె.

కొద్దిక్షణాల నిశ్శబ్దం! అతడికి ఎంతో చెప్పాలని ఉంది. ఆమెను తనెంతగా కోరుకుంటున్నదీ, మానసికంగా ఎంత దగ్గరవ్వాలనుకుంటున్నదీ వివరించాలని ఉంది. తనకు నచ్చిన ఆమె భావుకత, ఇతరులను ప్రేమించే గుణాల గురించి చర్చించాలని ఉంది. కాని.., ఎంతకీ మాటలు దొరకని పరిస్థితి! మనసులోని భావాలకు మాటల రూపం ఇవ్వడం ఒక్కొక్కసారి మనిషికి అసాధ్యం అవుతుంది ఎందుకనో! మనసు పరవశించేవేళ మాటలతో పనేముంది అనుకుంటే— అది నిజమే కదా అనిపిస్తుంది.

అయినా ఇద్దరు కొత్తవారు ఒకచోట కలిసినప్పుడు భావాలను మదిలోనే దాచుకుని నిశ్శబ్దంగా విడిపోవటంకన్నా మాటలు కలవడం వారిమధ్య సాన్నిహిత్యాన్ని కలిగిస్తుంది. అందుకే అతడు ఏదయినా మాట్లాడాలనుకున్నాడు.

"మీ ఉత్తరం అందింది. జవాబుగా నేను రాసిన ఉత్తరం మీకు అందిందనుకుంటాను: అందిందా?"

అందినట్టుగా తలూపింది వసుంధర.

"మీ ఉత్తరం అందుకున్న మొదటి క్షణం నేను షాక్ తిన్నాను. ఉత్తరం చదవటం పూర్తయ్యేసరికి నా తల తిరిగిపోయింది. ఒక్కసారిగా నాచుట్టూ శూన్యం ఆవరించినట్టుగా అనిపించింది. కొద్దిసేపటివరకూ తేరుకోలేకపోయాను. అయితే— మెల్లగా ఆలోచించటం మొదలుపెట్టాక నాకు అనిపించిందేమిటంటే— నేను ప్రేమిస్తున్నది వసుంధర శరీరాన్ని కాదు. ఆమె మంచి మనసును, భావుకతను. మరి శరీరంతో నాకేమిటి పని అనుకున్నాను. ఆ ఆలోచనే నా బాధను ఒక్కసారిగా పోగొట్టింది. ఆ క్షణం నా కుసంస్కారానికి నామీద నాకే అసహ్యం కలిగింది. అంతేకాదు నీమీద జాలి కూడా కలిగింది. అప్పటికే ఒకరు నీ మనసు ముక్కలుచేసి ఉన్నారు. ఇప్పుడు మరొకరు నీ శీలాన్ని దోచి పారిపోతే నీ సున్నిత మయిన మనసు ఎంతగా కుమిలిపోతోందో కదా అని వ్యధపడ్డాను. అందుకే వెంటనే ఉత్తరం రాసేసాను..." అతడు చెప్పటం ఆపాడు.

ఆమె నిశ్శబ్దంగా వింటూ ఉంది.

ఒక నిమిషంపాటు మౌనంగా ఉండిపోయాడు. ఆ గదిలో నిశ్శబ్దస్రవంతి నిర్మలంగా సాగుతూ ఉంది.

కొద్ది సెకనులు సంశయించాక అతడు ప్రశ్నించాడు- "వసుంధరా... నీకు... నీకు నన్ను పెళ్ళిచేసుకోవడం ఇష్టమేనా?"

ఆమె తలెత్తి అతడి ముఖంలోకి చూసింది. అతడి కన్నులలో కన్నులు కలిపి చూసింది. ఆ క్షణం ఆమె కన్నులలో ప్రతిఫలించిన భావాలు చదివిన అతడు చలించిపోయాడు. మాటలతో వివరించలేని భావాలు ఎన్నో ఆమె కనులలో కదలాడాయి.

వసుంధర గొంతు పెగుల్చుకుని చెప్పింది- "ఇష్టమేకాదు, ఇది ... ఇది నా అదృష్టంగా భావించుకుంటున్నాను నేను"

అతడి మనసంతా ఆనందోద్వేగాలతో నిండిపోయింది. అతడు మనసులో అనుకున్నాడు- "ఐ లవ్ యూ వసూ! స్టిల్ ఐ లవ్ యూ... అండ్ ఐ మేరీ యూ" ఎన్నో మాట్లాడాలని ఉన్నా ఏమీ మాట్లాడలేని స్థితిలో అతడు బయటకు వెళ్ళేందుకు ఉద్యుక్తుడయ్యాడు "వెళ్ళొస్తాను వసుంధరా" అన్నాడు.




అతడి ఉన్నత వ్యక్తిత్వంపట్ల కలిగిన గౌరవమో లేక అతడు తన భర్త కాబోతున్నాడన్న ఆనందమో— ఆకాంక్షగా మారి ఆమె మనసును కదిలించింది. ఆమె చప్పున ముందుకు కదిలివెళ్ళి మోకాళ్లపై కూర్చుని అతని పాదాలు కళ్ళకద్దుకుంది.

ఆ సమయంలో ఆమె చేసిన చర్య సనాతన సాంప్రదాయాలను గౌరవించడం కాదు. మనసులో పొంగిన ప్రేమోద్రేకానికి ప్రతికూల స్పందన మాత్రమే అది.

అతడు చలించిపోయాడు. ఆమె మానసిక స్థితిని అర్థంచేసుకోగలిగిన వ్యక్తి అతడు. ఆమె అంతవరకూ పొందిన మానసిక వ్యథ పట్ల అతడికి జాలి కలిగింది. కరుణ వెల్లువలా పొంగింది. అతడు అప్రయత్నంగానే ఆమెను భుజాలు పట్టుకుని పైకి లేవదీశాడు. గాఢంగా గుండెలకు హత్తుకున్నాడు "వనూ... నిన్నింక ఏ కష్టాలూ దరిచేరవు. ఏ మనోవ్యథా నీకు అవసరంలేదు. నిన్ను నేను సొంతంచేనుకుంటాను. పువ్వులలో పెట్టి పూజించుకుంటాను... పెళ్లయిననాటినుండీ సుఖమే తప్ప దుఃఖం అన్న పదమే తెలియదు నీకు. ఇది నిజం... నీకు పుట్టబోయే బిడ్డను మన బిడ్డగానే పెంచుకుందాం. ఆ బిడ్డ నా బిడ్డేనని నేను లోకమంతా చెప్పుకుంటాను... మర్చిపో వనూ! ఈరోజునుండే దుఃఖం అన్న పదమే మర్చిపో..."

ఆ ఓదార్పు మాటలకూ, ఆ గాఢపరిష్వంగంలోనూ ఆమె సేదతీరింది. అప్పటివరకూ ఏ మారుమూలనో మిణుకుమిణుకుమంటున్న అనుమానం ఆగిపోయింది. ఆనందం చెలియలికట్ట దాటింది. అంతేకాదు- అతడి అత్యున్నత సంస్కారానికి ఆమె ఆశ్చర్యపడింది. అంతగొప్ప వ్యక్తిత్వం ఉన్నవాడు తన భర్త కాబోతున్నందుకు గర్వపడింది.

ఒకటి... రెండు... మూడు... ఎన్ని క్షణాలు గడిచిందో తెలియదు. యుగాల కాలమయినా వారు అలాగే ఉండిపోయేందుకు సంసిద్ధులే. కాని... గది బయట చప్పుడయింది. ఉలికిపడి దూరంగా జరిగారు వారు.

సిగ్గు ఆమె బుగ్గలలోనికి దూరి ఎర్రని బుగ్గలు మరింత ఎరుపుచేశాయి. ఆ సిగ్గుబరువుతోనే రెప్పలు కిందికి వాలిపోయాయి. ఆమె తలెత్తి అతడివంక చూడలేకపోయింది.

అతడికి కూడా ఆ అనుభూతి అపురూపంగా అనిపించింది. ఆ అనుభూతితోనే వెయ్యేళ్ళు ఆనందంగా గడిపేయవచ్చని అనుకున్నాడు అతడు. ఇంతకీ ఆ అనుభూతిని నెమరువేసుకున్నది అరక్షణం మాత్రమే.

అప్పటికే వినాయకరావు ఆ గదిలోపలికి అడుగుపెట్టాడు. "ఏరా భానూ... మీ మాటలు పూర్తయ్యాయా?" అడిగాడు తమ్ముడివంక చూస్తూ.

అతడు సిగ్గుగా నవ్వి ఊరుకున్నాడు.

ఆయన వసుంధర వంక తిరిగాడు. "అన్నీ వివరించాను. వివరాలన్నింటినీ కనుక్కున్నానుగాని, నీ మనసులోనిమాట తెలియకుండానే ముహూర్తాలవరకూ వెళ్లిపోయాను. ఇది నా వృత్తిధర్మానికే విరుద్ధం. చెప్పమ్మాయ్! నీకు మావాడు నచ్చాడా?" ప్రశ్నించాడాయన గంభీరంగా.

బోనులోని ముద్దాయిని లాయర్ ప్రశ్నిస్తున్నట్టుగా ప్రశ్నిస్తే ఆమె మొదట కంగారుపడింది. ఎలా జవాబు చెప్పాలో తెలియక గుటకలు మింగింది.

ఆయన ఆ ప్రశ్ననే మరోసారి రెట్టించి అడగడంతో మరింత కంగారుపడి, ఆ కంగారులోనే తలాడించింది.

"తలాడిస్తే సరిపోదు- నోటితోనే జవాబు చెప్పాలి" అన్నారాయన.

"న... న... నచ్చారండీ" జవాబిచ్చిందామె.

"న... న... నచ్చాడా?... కొంపదీసి నీకు నత్తి లేదు కదా?" అడిగాడాయన అనుమానంగా.

ఆమె కంగారు రెట్టింపయింది. "లే... లే... లేదండి" అంది.

ఆయన మరింత అనుమానంగా ఆమె వంక చూశాడు.

భానుమూర్తి ఆమె ఇబ్బందినీ, ఆయన అనుమానాన్నీ అర్థం చేసుకున్నాడు. చిరునవ్వు నవ్వి చెప్పాడు- "అన్నయ్యా! మనిషిని కంగారుపెడితే మాట తడబడటం మామూలే... ఈ విషయంలో మీకెలాంటి అను

మానం అవసరంలేదు. వసుంధరకు ఎలాంటి మాట లోపం లేదు.''

''అలాగే... అయితే సరే'' అనుమానాన్ని వదిలేశాడాయన. ''వెళ్దాం రారా'' అన్నాడు వెనుదిరుగుతూ.

అతడు వసుంధరకు కనులతోనే వీడ్కోలు చెప్పి గదిలోనుండి బయటకు నడిచాడు. అతడిని చూసిన శంకరయ్య- ''రా బాబూ! కూర్చో'' అన్నాడు. భానుమూర్తి వెళ్ళి తన కుర్చీలో కూర్చున్నాడు.

''ముహూర్తం విషయంలో నీ అభిప్రాయం కనుక్కుందామని పిలిచానురా భాను'' చెప్పాడు వినాయకరావు.

''అందులో నా అభిప్రాయంతో అవసరం ఏముందన్నయ్యా. పెద్దలు మీరున్నారు మీరు నిర్ణయించిన ముహూర్తం నాకు సమ్మతమే అవుతుంది''

''అదికాదురా... శంకరయ్యగారు ఈ పెళ్ళి త్వరగా జరిపించేయాలని అనుకుంటున్నారట. మరో పదిహేనురోజులలో అంటే డిసెంబర్ ఇరవయ్యారో తారీఖున వేకువనే ముహూర్తం ఉందట. మరీ ఇంత త్వరలో ఎందుకు మరికాస్త దూరంలో ఉండే ముహూర్తం నిర్ణయించుకుందామని నేను అనుకుంటున్నాను. మరి నీ అభిప్రాయం ఏమిటో చెప్పు''

ఈ పెళ్ళి త్వరగా జరగాలని శంకరయ్యగారు ఎందుకు తొందరపడుతున్నాడో అతడికి అర్థమయింది. అందుకే అతడు అన్నాడు- ''మనకు మాత్రం ఇబ్బందేముందన్నయ్యా! ఆయనగారి మాటను అంగీకరిస్తే పోదా''

విమలాదేవి జోక్ చేసింది. ''ఆయన మాటను అంగీకరించటమా లేక తమరే పెళ్ళికి తొందరపడుతున్నారా?''

ఆ జోక్‌కు అందరూ నవ్వారు. భానుమూర్తి కూడా నవ్వకుండా ఉండలేకపోయాడు.

''సరే... వాడి అభిప్రాయం కూడా అదే అయితే ఇక అభ్యంతరం ఏముంది? ... అన్నట్టు ఇంతకీ పురోహితుడి కోసం పంపారా?''

''పాలేరును పంపాను. పది నిమిషాలలో వచ్చేస్తాడు''

వారంతా పురోహితుడికోసం ఎదురుచూడసాగారు.

పది నిమిషాలు తర్వాత రంగయ్య పురోహితుడిని వెంటబెట్టుకుని వచ్చాడు. శంకరయ్య పురోహితుడిని అంతకుమునుపే కలిసి వివరాలు కనుక్కొని ఉన్నాడు.

''స్వామీ... మీరు ఇరవయ్యారో తారీఖు ముహూర్తం చెప్పారుకదా! మేము ఆ ముహూర్తంను నిర్ణయించుకున్నాం. మీరింక లగ్నపత్రిక తయారుచేసివ్వండి'' చెప్పాడు శంకరయ్య పురోహితుడితో.

పురోహితుడు కాలాలు, గడియలు అన్నీ పంచాంగంలో చూసి ముహూర్తకాలం నిర్ణయించాడు. ఉదయంనే 6-15 నుండి 7-15 గంటల మధ్య వివాహం జరగబోతోంది. పురోహితుడు చెప్పాడు. ''ఇది చాలా మంచి ముహూర్తం శంకరయ్యగారూ! ఈ ముహూర్తానికే పెళ్ళి జరిపించేలా చేయండి''

శంకరయ్య తలాడించాడు. పురోహితుడు లగ్నపత్రిక రాసిఇచ్చాడు. తన దక్షిణ పుచ్చుకుని, బియ్యం, కొబ్బరికాయ తదితర వస్తువులు సంచిలో వేసుకుని వెళ్ళిపోయాడు పురోహితుడు.

అప్పటికే సాయంకాలమయింది. మరో గంటసేపు పెళ్ళి ఏర్పాట్ల గురించి చర్చించుకున్నారు వారు.

పెళ్ళి ఎలాగూ కన్యాదాత గృహంలోనే జరిగేలా ముందు నిశ్చయించుకుని ఉన్నారు. కాబట్టి పెళ్ళికొడుకు తరపున వచ్చే బంధువుల సంఖ్యను అడిగాడు శంకరయ్య.

''మేము పెద్దగా ఎవర్నీ పిలవబోవటంలేదు. కొద్దిమంది బంధువులు, మరికొంతమంది స్నేహితులు, సహోద్యోగులు- మొత్తం నూరూ, నూటయాభైమంది రావచ్చు. అంటే ఒక బస్సు, పది కార్లు వస్తాయి''

వివరాలన్నీ మాట్లాడుకున్నాక ఆ ముగ్గురూ లేచారు. వినాయకరావు, విమలాదేవి పెళ్ళికూతురి దగ్గర శెలవు తీసుకునేందుకు ఆమె గదిలోనికి వెళ్ళారు. హాలులో శంకరయ్య, భానుమూర్తిలు మాత్రమే మిగిలారు.

ఆ సమయంలో శంకరయ్యకు భానుమూర్తి పెద్దమనస్సుకు చేతులెత్తి నమస్కరించాలని





పించింది. ఆయన అతడి దగ్గరగా నడిచి అతడి చెయ్యి తన చేతిలోనికి తీసుకున్నాడు- "బాబూ! చిన్నవాడివయినా పెద్దమనసు నీది. నా కూతురి గురించి పూర్తిగా తెలిసి కూడా నువ్వీ పెళ్ళికి అంగీకరించావంటే, నీ గొప్ప మనసుకు చేతులెత్తి నమస్కరించాలని ఉంది నాకు. కాని చిన్నవాడివవడంతో ఆ పని చేయ లేకపోతున్నాను నేను..."

"అదేం మాటండి" మధ్యలోనే అడ్డుకున్నాడు అతడు. "వసుంధరను ఇష్టపడ్డాను. పెళ్ళి చేసుకుంటున్నాను. ఇందులో పెద్దమనసు అన్న పదానికి అర్థంలేదు. లేని గొప్పతనాన్ని నాకు ఆపాదించకండి" చెప్పాడు భానుమూర్తి.

అతడి వ్యక్తిత్వం హిమవత్పర్వతాలంత ఎత్తుకి ఎదిగి మహోన్నతంగ కనిపించింది శంకరయ్య కళ్లకు.

వినాయకరావు, విమలాదేవి లోపలనుండి వచ్చారు. అందరూ బయలుదేరేందుకు సిద్ధమవుతూవుంటే విమలాదేవి మరిదితో చెప్పింది- "భాను! ఆ అమ్మాయి దగ్గరకు వెళ్ళి, వెళ్ళొస్తానని చెప్పిరా"

అతడు తలూపి వసుంధర గదిలోకి వెళ్ళాడు. "వెళ్ళొస్తాను వసుంధరా" అన్నాడు.

ఆమె నిశ్శబ్దంగా తలూపింది.

వసుంధరను వదిలి ఇవతలకు వస్తుంటే అతడికెంతో బాధగా అనిపించింది. యుగాలనాటి స్నేహం ఒకింత ఎడబాటును కూడా భరించలేదని అతడికి అనిపించింది. బరువైన గుండెతో ఆ గదిలోనుండి బయటకు వచ్చేశాడు అతడు.

అందరి దగ్గరా వీడ్కోలు తీసుకున్నాక వారు ఎక్కిన కారు కదిలింది. ఎర్రటి దుమ్ము మధ్య దూరం అవుతున్న ఆ కారును కనుమరుగయ్యేవరకూ చూస్తుండిపోయారు ఆ కుటుంబసభ్యులలోనివారందరూ.

ముహూర్తం నిర్ణయం కావటంతో పెళ్ళి ఏర్పాట్లలో మునిగిపోయాడు శంకరయ్య. ముందుగా ప్రెస్‌కు వెళ్ళి పెళ్ళి పత్రికలు ప్రింటింగ్‌కి ఇచ్చాడు. టౌన్‌కి రంగయ్యను వెంటబెట్టుకుని వెళ్ళి సరుకులు ఎద్దుల బండిలో నిండుగా తీసుకువచ్చాడు. శారదమ్మను తీసుకువెళ్ళి బంగారు నగలకు ఆర్డర్ ఇచ్చాడు. పెళ్ళి బట్టలు కొనుక్కువచ్చాడు.

ఆ ఇంట్లో ఒక్కసారిగా సందడి మొదలయింది. వంటవాళ్ళు వచ్చారు. స్వీట్లు తయారుచేస్తున్నారు. ముఖ్యమైన బంధువులు నలుగురయిదుగురు పెళ్ళికి వారంరోజులు ముందుగానే ఆ ఇంటికి చేరుకున్నారు. వంట పనులు, ఇంటిపనులలో సహాయం చేయసాగారు.

ప్రింటింగ్ ప్రెస్‌నుండి పెళ్ళిపత్రికలు వచ్చాక శంకరయ్య బంధువులందరికీ పంచాడు. అలాగే ఒకరోజు తీరిక చేసుకుని వెళ్ళి చంద్రశేఖరాన్ని పెళ్ళికి పిలిచాడు. "పెళ్ళికి ఒకరోజు ముందుగానే వస్తాను మామయ్యా" హామీ ఇచ్చాడు చంద్రశేఖరం. ఆయన అటు నుండి అటుగా వెళ్ళి రాజారావుకి కూడా చెప్పి వచ్చాడు.

శుభలేఖలు పంచడం పూర్తయింది. స్వీట్స్ తయారయిపోయాయి. ఇక ఇంటిని అలంకరించటం మిగిలిఉంది.

శంకరయ్య ఇంటికి సున్నం వేయించాడు. ఆడవారు గడపలకు పసుపు అద్ది, కుంకుమ బొట్లు పెట్టారు. ఇంటిలోపల పిండిముగ్గులు పెట్టారు. రంగయ్య మామిడాకులతో మంగళ తోరణాలు కట్టాడు. అరటిబోదెలు తెచ్చి వాకిలికి ఇరువైపులా నాటాడు. ఇంటిముందు పందిరి వేశాడు.

పెళ్లి ఏర్పాట్లు అట్టహాసంగా సాగుతున్నాయి. శంకరయ్యకు ఆ గ్రామంలో ఉన్న మంచిపేరు వలన ఆ ఏర్పాట్లలో గ్రామస్తులంతా పాలుపంచుకోసాగారు. సాధారణంగా పల్లెటూర్లలో ఏ ఇంట్లో కార్యం జరిగినా అది తమ ఇంట్లో కార్యంగానే భావించుకోవటం జరుగుతుంది. అందులోనూ శంకరయ్యలాంటి గ్రామపెద్ద ఇంట్లో పెళ్లంటే- ఊరుమొత్తం ఆ చోటనే ఉంటుంది. గ్రామస్తులంతా తలోపనీ చేయసాగారు.

శంకరయ్య వసుంధర పెళ్ళిని చాలా ఘనంగా చేయాలనుకున్నాడు. అవతలివారు పైసా కట్నం ఆశించలేదు కాబట్టి పెళ్ళి మహా అట్టహాసంగా జరిపించాలనుకున్నాడు. ఆయన డబ్బుకు వెనుకాడే మనిషి కాదు.




సమయానికి ఇంట్లో డబ్బు లేకపోయినా ఆయనకు గ్రామంలో పరపతి ఉంది కాబట్టే ఆయన కేవలం పెళ్ళి ఏర్పాట్ల కోసమే లక్ష రూపాయలు అప్పు తెచ్చాడు. దురదృష్ట జాతకురాలను కున్న తన ముద్దుల కూతురు పెళ్ళి ఆ గ్రామ చరిత్రలో నభూతో, నభవిష్యతి అనేవిధంగా జరిపించాలన్నదే ఆయన ఆశ. తన కూతురు దురదృష్ట జాతకురాలు కాదు అదృష్టజాతకురాలు అని చాటి చెప్పబడే తరుణంలో ఎంత డబ్బు ఖర్చుపెట్టేందుకయినా ఆయన వెనకాడటంలేదు.

పెళ్ళి విందులో రెండు రకాల స్వీట్స్, నాలుగు రకాల కూరలు, ఫలహారాలు వగైరా చేయించి వచ్చినవారెవరికైనా ఆ పెళ్ళి గురించి జీవితాంతం చెప్పుకునేలా చేయాలన్నది ఆయన ఆకాంక్ష. అలాగే చేస్తూ ఉన్నాడు కూడా. ఇదంతా ఆయన మనసులోని ఆనందం తెలియచేసుకునే ప్రయత్నం మాత్రమే.

ఏర్పాట్లన్నీ పూర్తవుతున్నాయి.

డిసెంబర్ 25వ తేదీనాటికే దూరపు బంధువులంతా వచ్చేశారు. ఆ బంధువులు ఒకరినొకరు పలకరించుకుంటున్నారు. క్షేమ సమాచారాలు అడిగి తెలుసుకుంటున్నారు.

తెల్లవారి పెళ్లనగా ఆ సాయంత్రం రాజారావు, గాయత్రి, చంద్రశేఖరం కారులో పల్లెకు చేరుకున్నారు. తన అమ్మకు, అత్తమామలకు కనిపించాక, అతడు వసుంధర గదిలోకి వెళ్ళాడు.

వసుంధర ఉత్సాహంగా ఉన్నట్టుగా అనిపించింది. ఆమె ముఖంలో సిగ్గు కదలాడుతోంది. పెళ్ళికూతురు సిగ్గుపడుతుందంటే ఆమెలో పెళ్ళికళ వచ్చేసినట్లే. భానుమూర్తి ఆమెను బాగా ఇంప్రెస్ చేశాడని అర్థమయింది చంద్రశేఖరానికి.

"హాయ్ వసూ..." పలకరించాడు చంద్రశేఖరం.

"ఏం బావా... ఎప్పుడొచ్చావు?" హుషారుగా అడిగింది వసుంధర.

"వచ్చి అర్ధగంటయింది. అందరినీ పలకరించి, మరికొందరినుండి తప్పించుకుని తిన్నగా నీ దగ్గరకే వస్తున్నాను" చిన్నగా నవ్వాడు అతడు.

"గాయత్రక్క, బాబాయ్‌గారు వచ్చారా?"

"ఆఁ... బయట ఎవరితోనో కబుర్లలో వున్నారు.

"బావా... పెళ్ళికి రెండురోజులు ముందుగా రాకుండా పెళ్ళి సమయానికి అందుకోవడం కోసమే వచ్చినట్టుగా రావటం నాకేం నచ్చలేదు" నిష్ఠూరంగా అన్నది వసుంధర.

"ఏం చేయను వసూ... ఆఫీసు పనులతో క్షణం తీరిక ఉండదు. అప్పటికీ ఎంతో ప్రయత్నంమీద తీరిక చేసుకుని ఈ సమయానికయినా రాగలిగాను"

"అవును బావా... నువ్వు చాలా పెద్దవాడివయిపోయావు. మరదలి పెళ్ళికి వచ్చేందుకు కూడా ఒకరోజు తీరిక ఉండటంలేదుకదూ" వ్యంగ్యం ధ్వనింపచేసింది వసుంధర కావాలనే.

అతడు ప్రశాంతంగా నవ్వాడు- "ఈ బావ కష్టమేమిటో తెలియక నువ్వు నిష్ఠూరాలాడుతున్నావు. సరేలే... రేపు నీ మొగుడు ఐ.ఎ.ఎస్ ఆఫీసరయ్యాక తెలుస్తుంది- ఆఫీసరంటే ఎన్ని తీరికలేని పనులు ఉంటాయో ఏమిటో"

వసుంధర సిగ్గుపడింది. ఆ మాటలకు "ఛీ- పో బావా" అంది చిరుకోపం నటిస్తూ.

ఆమెను చూస్తుంటే చంద్రశేఖరానికి అపరిమితమయిన ఆనందం కలుగుతోంది. అలాంటి మనసున్న అమ్మాయిని కాకుండా కేవలం భౌతిక సుఖాలనే చూసే బొమ్మను కట్టుకోవడంలో తను చేసిన పొరపాటేమిటో అతడికి ఇప్పుడు అర్థమవుతోంది.

టాపిక్ భానుమూర్తి గురించి రావడంతో అతడు చెప్పాడు "భానుమూర్తి నాకు మంచి స్నేహితుడు వసూ"

"తెలుసు బావా"

"భాను గురించి నాకు బాగా తెలుసు. అతడిని పెళ్ళిచేసుకోబోయే ఏ ఆడపిల్లయినా తప్పకుండా సుఖపడుతుంది"

ఆమె మౌనంగా ఉండిపోయింది.

"అంతేకాదు- పెళ్ళి విషయంలో అతడు కూడా చాలా అదృష్టవంతుడని రుజువ

యింది. భార్యాభర్తలలో ఇద్దరూ ఆదరాభిమానాలు కలిగినవారయితేనే ఆ సంసారం చక్కగా సాగుతుంది. ఆ ఇద్దరిలో ఒకరు మంచివారయి, మరొకరు కస్సుబుస్సులాడేవారయితే ఆ సంసారం అంత చక్కగా సాగదు. మంచిమనసున్న మీరిద్దరూ కలవడం ఒక ఆనందకరమయిన విషయం. ఆ దేవుడు కొన్ని జంటలను ఏరికోరి కూర్చుతాడు. అలా ఆయన అభిమానంగా, ఆప్యాయంగా ఏరికోరి కలిపిన జంటలలో మీరొక జంట అని నా ఖచ్చిత అభిప్రాయం''

వసుంధర నిశ్శబ్దంగా వింటూ ఉంది.

''వసూ... ఒకప్పుడు నేను నిన్ను కాదన్నానని నువ్వు చాలా బాధపడి ఉంటావు. బావ స్వార్థపరుడయిపోయాడని మనసులోనే నిందించుకుని ఉంటావు. నిజమే... ఆ సమయంలో నేను చాలా స్వార్థపరుడిని అయ్యాను. స్టేటస్‌కోసం పాకులాటలో నిన్ను కాదన్నాను. ఆడంబరాలమీద మోజు నన్ను కళ్ళు మూసుకుపోయేలా చేసింది. మంచిమనసు, మానవత్వాల విలువ తెలుసుకోలేకపోయాను'' అని ఆగి నిట్టూర్చి చెప్పాడు- ''అందుకు ఫలితం నేను ఇప్పుడు అనుభవిస్తున్నాను''

ఆమె ఆశ్చర్యంగా అతడివంక చూసింది. ఐ.ఎ.యస్ ఆఫీసరయిన అతడికి, ఐ.పి.యస్ ఆఫీసర్ భార్యగా కలిగిన అదృష్టవంతుడికీ, కోటీశ్వరుడి అల్లుడికీ మనసులో బాధనా.... ఎవరికయినా విస్మయం కలగకుండా ఎలా ఉంటుంది?! కాని- మనిషి కోట్ల కొలది ఆస్తి ఉన్నా కొంతవరకే దాన్ని అనుభవించగలడు. భార్య గొప్ప ఆఫీసర్ అయితే అది నలుగురిలో చెప్పుకునేందుకు మాత్రమే పనికొస్తుంది. భార్యహోదా భర్త స్టేటస్‌ను మరికొంత పెంచవచ్చు అంతే. అలాగే అతడు ఆఫీసరయితే సమాజంలో అతడికి గౌరవం లభిస్తుంది. పదిమంది వ్యక్తులు అతడిని చూసి భయభక్తులతో ఉంటారు. అయితే- మనిషికి కావలసింది స్టేటస్, సమాజంలో గౌరవం, ఇతరుల నుండి భయభక్తులు సంపాదించడం- ఇవేనా మనిషికి కావలసింది. లేదు... ఆఫీసు వ్యవహారాలతోనో, స్వతం పనులతోనో తలమునకలయి తలభారంతో ఇంటికి వచ్చిన వ్యక్తిని పైవేవీ సేదతీర్చవు. ఆ సమయంలో అతడికి చిరునవ్వుతో కాఫీ అందించే స్త్రీ ఒకరు కావాలి. ఆప్యాయంగా మాట్లాడి తన అలసటను పోగొట్టగలిగి ఉండాలి. ఎన్ని లగ్జరీస్ ఉన్నా భార్య చెంతలేని లోటు ప్రతిమనిషికీ ఉంటుంది. అయితే డబ్బు సంపాదనా వ్యామోహంలో పడిన కొంతమంది మాత్రం ఆ లోటును పట్టించుకోరు. కొంతమందిని మాత్రం ఆ లోటు అపరిమితంగా బాధిస్తుంది. అలా బాధపడేవారిలో చంద్రశేఖరం ఒకడయ్యాడు.

''ఇప్పుడు నీకేం లోటయింది బావా?'' అమాయకంగా ప్రశ్నించింది వసుంధర.

అతడు జవాబు చెప్పలేదు. నవ్వి ఊరుకున్నాడు. తెలివయినవారెప్పుడు ఏ విషయంలోనూ తమ బాధ బయటకు వ్యక్తం చేయరు.

''ఏదేమయినా ఆనాడు నేను నిన్ను పెళ్ళిచేసుకోకపోవడం నీకు మంచిదే అయింది. నాకన్నా మంచివాడు నీకు భర్తగా దొరుకుతున్నాడు''

''అలా అనవద్దు బావా'' ఆమె నొచ్చుకుంది.

''ఇట్సాల్‌రైట్'' అతడు బలవంతంగా నవ్వేసాడు. ఆ టాపిక్ అంతటితో కట్‌చేసి, మరో విషయంలోకి వెళ్ళాడు. ''మామయ్య ఈ పెళ్ళి చాలా ఘనంగా చేస్తున్నట్టున్నాడు. ఈ ఏర్పాట్లుచూస్తుంటే నాకే ఆశ్చర్యంగా ఉంది. ముద్దుల కూతురిపెళ్ళి మహాఘనంగా చేయాలన్నది ఆయన ఆశ కాబోలు''

వసుంధర నవ్వి ఊరుకుంది.

''మళ్ళీ కలుద్దాం వసూ'' అతడు బయటకు వెళ్ళిపోయాడు.

అతడు బయటకు వెళ్ళాక ఆమె రెండుని ముషాలసేపు బావ గురించే ఆలోచిస్తూ ఉండిపోయింది. 'బావ ఈ కొద్దికాలంలోనే కాస్త లావయ్యాడు. మాటలలోనూ- చేతలలోనూ హుందాతనం వచ్చింది. అయితే- మునుపటి చిలిపితనం లేకుండాపోయింది. ముఖంలో కళ తగ్గింది. కన్నులు దేనికోసమో వెతుకుతున్నట్టు ఆర్తిగా చూస్తున్నాయి. బావ ఎందుకో బాధపడుతున్నట్టుంది. మాటలనుబట్టి తనను పెళ్ళి చేసుకోలేకపోయినందుకే వ్యధపడుతు





# ఒక్క పోస్టు కార్డు చాలు!...

మరియు, నా మిత్రులు
చాలమంది వివేకానంద
'ఇన్స్టిట్యూట్' లో పోస్టు
ద్వారా ఆంగ్లభాషాభ్యాస
ము లో చేరి అభివృద్ధి
చెంది యున్నారు నేను
కూడ మీ ఇన్స్టిట్యూట్
నందు చేరదలచాను కావున
వెనుక నున్న నా చిరునామా
కు మీ వివరాలు మరియు
Application form ను
పంపు కోరుతాను ఇట్లు
G. Sathya




మీకూ, మీ అభ్యుదయానికీ మధ్యవున్న దూరం ఒక పోస్టుకార్డే అని మేమంటే మీకు విచిత్రంగానూ తమాషాగానూ వుండవచ్చు. కానీ అది నిజం!

మీ అభ్యుదయానికి ఇంగ్లీషుభాష తెలియకపోవటమే ఒక కారణమైతే...

ఇతరులు ఇంగ్లీషులో మాట్లాడుతుంటే మీకు అర్థమైనా కూడా వాళ్ళకి ఇంగ్లీషులోనే సమాధానాలు చెప్పలేక పోతున్నామే అని మీరు మానసికంగా బాధపడ్తూంటే...

ఇదివరకూ యెన్నో మార్గాలలో ప్రయత్నించినా, యెన్ని పుస్తకాలు చదివినా, ఇంగ్లీషులో మాట్లాడలేక పోతున్నామే అన్న విసుగు మీలో పుట్టివుంటే...

మీరు యెదురుచూసే అభ్యుదయాన్ని సాధించటానికి ఒక పోస్టుకార్డు వ్రాస్తేచాలు.

నిజమే!

ఇంగ్లీషులో వ్యాకరణ తప్పులులేకుండా వుత్తరాలు, వ్యాసాలు వ్రాయటానికీ, చక్కగా, సరళంగా మాట్లాడటానికీ మీరు చేయవలసిన ముఖ్య పని ఒక్కటే. మీ కోర్కెను వివరంగా తెలుపుతూ ఒక పోస్టుకార్డుని పోస్టు చెయ్యండి. మీ పోస్టుకార్డు అందిన వెంటనే ఈ వివేకానందా ఇన్స్టిట్యూట్‌వారు మీకు కావలసిన వివరాలను, మీరు తీసుకోవలసిన అభ్యాసాలనన్నింటినీ పూర్తిగా అందిస్తారు.

ఎక్కడికి బయలుదేరారండి? పోస్టుకార్డు కొనటానికా? అయితే మీ అభ్యుదయానికైన మొదటి మెట్టు ఎక్కారు! శభాష్!!

మీ కోర్కెను పోస్టుకార్డుద్వారా వివరంగా తెలిపి మీ యొక్క పూర్తి చిరునామాను కూడా తెలుపుతూ వెంటనే పోస్టు చేయడం మరువకండి సుమా!

మీరు పోస్టు చేయవలసిన మా చిరునామా-

## VIVEKANANDHA INSTITUTE

POST BOX NO: 4986, 9, NATESAN ST., T.NAGAR, MADRAS-17.

న్నట్టుంది...' ఆమెకు చంద్రశేఖరంమీద కోపంలేదు. అతడి వ్యథవల్ల తను మనస్ఫూర్తిగా బాధపడుతూ ఉంది.

అంతలోనే ఆమె ఆలోచనలు భానుమూర్తి మీదకు మళ్ళాయి. '...అతడు ఎంతో మంచివాడట. చాలా తెలివయినవాడట. చాలా విషయాలలో బావకన్నా యోగ్యుడట. మరి అలాంటివ్యక్తిని పెళ్ళాడబోవడం తన అదృష్టంకాక మరేమిటి? పెళ్ళి విషయంలో తనొక దురదృష్టజాతకురాలిగా తనను తాను భావించుకుంటోంది ఇన్నాళ్ళూ. కాని ఇప్పుడే తెలిసింది- పెళ్ళి విషయంలో తనెంతో అదృష్టవంతురాలు' తనకు కలిగిన అదృష్టం గురించి ఆమె మురిసిపోతోంది. అత్యున్నత సంస్కారిని పెళ్ళిచేసుకోబోతున్నానన్న ఆనందం ఆమెను కుదిపివేస్తోంది.

ఆమె ఆ ఆలోచనలమధ్యనే గది వాకిటవరకూ వచ్చి తొంగిచూసింది. హాలులో చాలామంది బంధువులున్నారు. వారంతా కూర్చుని కబుర్లాడుకుంటున్నారు. ఒకరి క్షేమసమాచారాలు ఒకరు అడిగి తెలుసుకుంటున్నారు. మరి కొందరు పెళ్ళి పనులలో హడావుడిగా అటునిటు తిరుగుతున్నారు.

అప్పటికి సమయం ఆరయింది. సూర్యుడు పశ్చిమకొండలలో దిగజారి విశ్రాంతి తీసుకునేందుకు ఆయత్తమవుతూ ఉన్నాడు. లోకమంతా ఆయన బంగారురంగు కిరణాలతో తడిసిపోతూ సువర్ణాభిషేకం చేయించుకుంటున్నట్టుంది.

అయితే- సరిగా అప్పుడే- ఉత్తరంవైపు నుండి ఒక నల్లని మేఘం పై పైకి ఎగబాకసాగింది. మరో రెండు నిముషాల తర్వాత దాని వెనుకే ఇంకో మేఘం అనుసరించి రాసాగింది. ఆకాశంలో మెల్లగా మబ్బులు ముసురుకుంటున్నాయి. మిలమిల మెరిసిపోతుండిన ఆకాశం మెల్లగా నల్లని మేఘాలతో కప్పబడిపోసాగింది.

ఎవరో హాలులోకి వస్తూ అన్నారు-''ఈ వర్షాకాలంలో ముహూర్తాలంటే అందరికీ భయమే. ఏ క్షణంలో వర్షం వస్తుందో ఏమోనని బిక్కుబిక్కుమంటూ కాలం గడపాలి. ఇన్ని ఏర్పాట్లు చేసుకున్నాక వర్షం వస్తే అంతా ఇబ్బందికరంగా తయారవుతుంది''

''పెళ్ళి కూతురుగానీ, పెళ్ళికొడుకుగానీ చిన్నప్పుడు చేటలోని బియ్యం తిని ఉంటే పెళ్ళినాడు వర్షం వస్తుందని పెద్దలు అంటారు. మరి ఈ రోజు వర్షం వచ్చేందుకు కారణం-చేటలోని బియ్యం పెళ్లికూతురు తిందో పెళ్ళికొడుకు తిన్నాడో' ఎవరో జోక్ చేశారు.

ఆ హఠాత్తు పరిణామం ఆమెకు కాస్త బాధ కలిగించింది.

కళ్యాణ మంటపం భారీగా కట్టబడి ఉంది. లైట్ల వెలుగుతో ఆ వీధంతా పట్టపగలులా మెరిసిపోయేలా చేశారు. విడిది నుండి పెళ్ళికొడుకును తీసుకువచ్చేందుకు పూలతో అలంకరింపబడిన కారు వీధి వాకిట నిలబడి ఉంది. మరోపక్క వచ్చిన బంధువులకు రాత్రి విందు ఏర్పాట్లు కోసం వంటవాళ్ళు భోజనం తయారు చేస్తున్నారు.

అలాంటి సమయంలో వర్షం మొదలవడాన్ని ఎవరు మాత్రం సహించగలరు. కాని ప్రకృతి పరిణామాన్ని ఆపడం ఎవరికి మాత్రం సాధ్యం? అందుకోసమే అందరూ కంగారుపడుతున్న వేళ ఆకాశంలోనుండి తొలిచినుకు నేలకు జారింది. చినుకు చినుకు కలసి చిరుజల్లుగా మారింది.

అనుకోని వేళవచ్చిన ఆ వర్షాన్ని అందరూ విసుక్కోసాగారు. ఏర్పాట్లలో కాస్త గందరగోళం మొదలయింది.

మరో అర్థగంటకు చిరుజల్లు భారీ వర్షంగా మారింది.



రాత్రి పది గంటలయింది.

వినాయకరావు ఇల్లు అప్పటికే ఆహూతు

లతో నిండి ఉంది. వర్షంలోనే వారు అడ్జస్ట్ అయి ఆహూతులకు భోజన ఏర్పాట్లు చూసే సారు. ఇక అందరూ కలసి పెళ్ళికూతురి పల్లెకు చేరుకోవడం మాత్రమే మిగిలి ఉంది. వినాయకరావు ఉన్న టౌన్‌కీ, శంకరయ్యగారి పల్లెకు మధ్య దూరం తొంభై కిలోమీటర్లు. అంటే గంటన్నర ప్రయాణం. ముహూర్తానికి రెండు మూడు గంటలయినా ముందుగా ఆ పల్లెకు చేరుకోవాలి కాబట్టి అర్ధరాత్రి వేళ అందరూ బయలుదేరవలసి ఉంటుంది. బయట వాహనాలన్నీ సిద్ధంగా ఉన్నాయి.

వర్షం హోరున కురుస్తోంది. అన్నీ సర్దుకుని బయలుదేరేందుకు సిద్ధంగా ఉన్నవారంతా ఆ వర్షం వంక అసహనంగా చూస్తూ ఉన్నారు.

ఎవరో అన్నారు- ''ఈ వర్షంలో మనం అంత దూరం ప్రయాణించగలమా?''

భానుమూర్తి కోపంగా చూశాడు.

పదకొండు గంటలయింది.

వినాయకరావు భానుమూర్తి దగ్గరగా వచ్చి అన్నాడు- ''భానూ! వర్షం మరీ కుండపోతగా కురుస్తోంది. అప్పుడప్పుడు గాలి కూడా ఉధృతంగా వేస్తోంది. ఈ వర్షంలో అంత దూరం ప్రయాణం క్షేమకరమా ఆలోచించు''

''నో'' కసిగా అన్నాడు అతడు. ఎందుకో అతడికి తన మీద తనకే కోపం వస్తోంది. వసుంధర ఇప్పటికే రెండుసార్లు పెళ్ళి విషయంలో దెబ్బతింది. ఆమె పెళ్లికి ప్రకృతి కూడా వ్యతిరేకతను చూపేలా ఉంది. ఈసారి కూడా ఈ పెళ్ళి ఆగిపోతే ఆమె అసలు తట్టుకోలేదు. ఆమె సున్నితమయిన మనసు వరుసగా పడే దెబ్బలను భరించలేక ఏదయినా అఘాయిత్యం చేసుకోవచ్చు. అదలా ఉంచి వేరే కారణం వలనయినా నరే ముహూర్తం వరకూ వచ్చిన పెళ్ళి ఆగిపోయిందంటే ఎవరికయినా అప్రతిష్టేకదా. తనవలన ఆ కుటుంబానికి ఎలాంటి అప్రతిష్టా రావడం తను భరించలేడు. అవసరమయితే ఆ ప్రకృతినే ఎదిరిస్తాడు తను.

భానుమూర్తి చెప్పాడు-''అన్నయ్యా... కాసింత భారీ వర్షానికే మనం భయపడితే ఎలా? వాహనాల్లో కూర్చున్న మనల్ని వర్షం ఏంచేస్తుంది? అయినా ఎంతోమంది ఆహూతులు వచ్చాక అన్ని ఏర్పాట్లూ పూర్తయ్యాక పెళ్ళిని పోస్టుపోన్ చేయడం ఏం బాగుంటుంది-మీరే చెప్పండి''

అతడి మాటలలో కూడా రీజన్ కనిపించింది. ఆయన భార్యను, మరికొంతమంది పెద్దలనూ సంప్రదించాడు. కళ్యాణమండపానికి ఆ సమయంలో చేరుకునేందుకు కొందరు అయిష్టతనూ, కొందరు సంసిద్ధతను వ్యక్తం చేశారు.

''అదికాదు వినాయకరావు... వర్షంలో ప్రయాణం అంత క్షేమకరంకాదు. రోడ్ల మీద నీరు ఎక్కువగా పారుతూ ఉంటుంది. ఎదురుగా వచ్చే భారీ వాహనాల లైట్లు కూడా సరిగా కనిపించవు. వెహికల్స్‌కి బ్రేక్‌లు కూడా సరిగా పడవు'' ఎవరో అనుమానంగా అన్నారు.

వినాయకరావు తిరిగి తమ్ముడి దగ్గరకు వచ్చాడు- ''ఏం చేద్దాంరా భానూ... పెళ్ళికి వెళ్ళేందుకు కొందరలా కొందరిలా అంటున్నారు.... వెళ్ళక తప్పదంటావా?'' సందిగ్ధంగా అడిగాడు.

''లేదన్నయ్యా... ఈ పెళ్ళికి- ఈ ముహూర్తానికీ మనం ఖచ్చితంగా వెళ్ళితీరాలి'' స్థిరంగా చెప్పాడు భానుమూర్తి.

ఇక తప్పదన్నట్లుగా బయలుదేరారు చాలా మంది.

వర్షం కావడంతో ఆహ్వానించినవారిలో చాలామంది సమయానికి రాలేకపోయారు. అందుకే ఊహించినదానికన్నా తక్కువమందే ఉన్నారు.

ఇంటిముందు ఆరుకార్లు, ఒక బస్సు ఆగి ఉన్నాయి.

చాలామంది కార్లలో సర్దుకున్నారు. బస్సులో ఓ ముప్పయిఐదు-నలభైమంది వరకూ ఎక్కారు.

భానుమూర్తి ఒక కారులో ఎక్కి వెనుకసీట్లో కూర్చున్నాడు. అతడి పక్కనే ఇద్దరు స్నేహితులు, ముందు సీట్లో మరో ఇద్దరు సర్దుకున్నారు.

వర్షం ఏమాత్రం తగ్గలేదు. రోడ్లలో నీళ్ళు నిలిచి ఉన్నాయి. ఆకాశంలో అప్పుడప్పుడు ఉరుములు ఉరుముతున్నాయి; మెరుపులు

మెరుస్తున్నాయి.

వాహనాలు కదిలాయి.

ఈ వర్షంలో తన పెళ్ళి ఘనంగా జరగబోవ డంలేదని భానుమూర్తికి తెలిసిపోయింది. అందుకు అతడు బాధపడటం లేదు. ఘనంగా కాకపోయినా ఫర్వాలేదు. ముహూర్తం టైముకు అక్కడకు చేరుకుని వసుంధర మెడలో తాళి కట్టేస్తేచాలని అతడు అను కుంటున్నాడు. అలా జరగనిపక్షంలో 'ఆమె ఒక దురదృష్ట జాతకురాలని చాలామంది ఎత్తిపొడుస్తారు. ఎత్తిపొడుపులు భరించలేకనో, తను వాస్తవంగానే దురదృష్టజాతకురాలనని అనుకుంటేనో - ఆమె ఏదయినా ఘోరం తలపెట్టవచ్చు'- అందుకే... అందుకే అతడు తొందరపడిపోతున్నాడు.

అన్నింటికన్నా ముందు వెళ్తున్నది పెళ్ళికొ డుకు ఎక్కిన కారు. వెనుక మిగిలిన కారులు, ఆ తర్వాత బస్సు వస్తున్నాయి. డ్రైవర్లందరూ ఏకాగ్రతగా, జాగ్రతగా పోనిస్తున్నారు. వాహనా లు టౌన్‌లోని సందులు, వీధులు దాటి జి.య న్.టి.రోడ్డు ఎక్కాయి. విశాలమయిన రోడ్డు ఎక్కాక కార్లు కాస్త వేగం అందుకున్నాయి. ఆ వాహనాలకు అప్పుడప్పుడూ ఏదో ఓ వాహనం ఎదురు వస్తోంది. కొన్ని వాహనాలు ఆ కార్లను క్రాస్ చేసుకుని మరీపోతున్నాయి. వర్షం నీరు రోడ్డుమీద పారుతూనే ఉంది. ఆకాశం వర్షిస్తూ నేఉంది.

ఇంతలో ముందు వెళుతున్న కారు వైపర్స్ పనిచేయడం ఉన్నట్టుండి ఆగిపోయింది. డ్రైవర్ వాటిని పనిచేయించే ప్రయత్నం చే స్తూ డేష్ బోర్డు స్విచ్ వంక చూశాడు. స్విచ్ నొక్కుతూ వైపర్స్ వంక చూశాడు. ఊహుఁ... అవి పని చేయడంలేదు. అతడు స్విచ్‌ని మరోసారి గట్టిగా కొట్టాడు. తిరిగి తలెత్తి వైపర్స్ వంక చూశాక రోడ్డు మీదికి దృష్టి మరల్చాడు. ఉలిక్కిపడ్డాడు డ్రైవర్. ఒక లారీ చాలా దగ్గ రకు వచ్చేసింది. అతడు భయంగా కారును కాసింత పక్కకు కోశాడు. కాని భయంలో ఒకింత ఎక్కువగానే కట్ చేసాడు. అలా కట్ చేస్తూనే బ్రేక్ నొక్కాడు. బండి స్కిడ్ అయింది... తిన్నగా రోడ్డు పక్కకు వెళ్ళింది. అక్కడే ఉంది ఓ పెద్ద లోతైన గొయ్యి. కారు ముందు బోల్తా పడింది. తర్వాత గుంటలోకి జారి పల్టీలు కొట్టుకుంటూ వెళ్ళింది.

వెనుక వస్తున్న వాహనాలు ఒక్కసారిగా ఆగాయి. అదిరే గుండెలతో అందరూ కిందికి దిగారు. పరిగెత్తుకుంటూ రోడ్డుపక్కకు వెళ్ళా రు. చీకటిలో ఏమీ కనిపించటంలేదు. ఎవరో అగ్గిపుల్ల గీశారు. వర్షానికి అదీ ఆరిపోయింది.

అప్పుడే ఓ మెరుపు మెరిసింది. మెరిసిన ఆ మెరుపుకాంతి పాతిక అడుగుల లోతులో పడి ఉన్న కారు అస్పష్టంగా కనిపించింది. క్షణంపాటు ఏం చేయాలో ఎవరికీ పాలు పోలేదు కొన్ని క్షణాలు. చీకటిలో అంత లోతుకు ఎలా దిగాలో అర్థం కాలేదు. వినాయకరావు ''భానూ'' అంటూ అరిచాడు. కిందినుండి జవాబు లేదు. ఆయన కిందికి దిగేందుకు ప్రయత్నిస్తే ఒకరిద్దరు ఆయనను అడ్డుకున్నా రు. ''చీకటిలో అంతలోతుకు వెళ్ళడం మంచిది కాదు. ఏదయినా టార్చిలైట్‌కు ప్రయ త్నిద్దాం. దొరికాక అందరం కలసి లోపలకు దిగుదాం''

వారు రోడ్డుకు అడ్డంగా నిలబడి వచ్చే లారీలు ఆపారు. మొదటి రెండు లారీలలో టార్చిలైట్ లేదు. మూడో లారీలో ఉంది అది. టార్చిలైట్ అందించారే తప్ప లారీడ్రైవర్లు కిందికి దిగలేదు.

వినాయకరావుకి గాభరాగా వుంది. తమ్ముడి కి ఏం జరిగి ఉంటుందోనని ఆందోళనగా ఉంది. ఆయన గుండెలు వేగంగా కొట్టు కుంటున్నాయి. విమలాదేవి కూడా భర్త పక్కనే నిలబడి ఉంది. కుండపోత వర్షంలో తడుస్తు న్నామన్న ధ్యాసేలేదు వారికి.

టార్చిలైట్ రాగానే ఆ వెలుతురును ఆధారం చేసుకుని వినాయకరావు కిందికి దిగసాగాడు. ఆయనను అనుసరించి మరో ఇద్దరు వెళ్ళసాగారు.

ముగ్గురూ కారు దగ్గరకు వెళ్ళారు. టార్చి వెలుగు లోపలికి ఫోకస్ చేసి చూస్తే కారులో ఉన్న ఆరుగురికీ రక్తం స్రవిస్తూ ఉంది. ఒకరిద్ద రు మూలుగుతున్నారు. కొందరు అదీ లేదు. స్పృహ తప్పారో లేక మరేదయినా... ఆలో చించడానికే మనస్కరించలేదు వారికి.

ఆ ముగ్గురూ కలసి కారులోని ఆరుగురిని





బయటకు లాగారు. బయటకు లాగితే ఒకరిద్దరు మెల్లగా లేచి నిలబడ్డారు. ఇద్దరు మాత్రం స్పృహతప్పి ఉన్నారు. భానుమూర్తిని ఇద్దరు పట్టుకుని ఇవతలకు లాగారు. అతడి తల మీద బలమైన గాయం తగిలి ఉంది. అతడు బాధగా మూలుగుతున్నాడు. ఒళ్ళంతా గాయాలయి నెత్తురు కారుతూ ఉంది. చివరగా వారు డ్రైవర్‌ని బయటకు తీశారు. స్టీరింగ్ వీల్ ఊడివచ్చిందో ఏమో రాడ్ బలంగా లోపలికి దిగబడి ఉంది. అతడు అక్కడికక్కడే మరణించి ఉన్నాడు. భానుమూర్తితోపాటు మిగిలిన వారిలో ఒకరిద్దరి పరిస్థితి దారుణంగా ఉంది.

డ్రైవర్‌ని తప్ప మిగిలిన అయిదుగురినీ రోడ్డు మీదకు చేర్చారు. కార్లలో ఎక్కించుకుని వెనుకకు తిరిగి టౌన్ వైపు కదిలారు.

ఆక్షణం అంత బాధలోనూ వినాయకరావుకి శంకరయ్యగారు గుర్తుకువచ్చారు. అన్ని ఏర్పాట్లుచేసుకుని వారు తమ కోసం ఎదురుచూస్తూ ఉంటారు. వారికి ఈ విషయం చెప్పి పంపటం తమ బాధ్యతగా అనిపించింది. కాని ఆ స్థితిలో అంతదూరం వెళ్ళేందుకు ఎవరు మాత్రం సాహసించగలరు.

ఆయన ఆ ఆలోచనకు స్వస్తిచెప్పి తమ్ముడి గురించి యోచించసాగారు. భానుమూర్తికి మిగతా నలుగురికన్నా ప్రమాదకరమైన దెబ్బలు తగిలాయి. తల చిట్లి ఉంది. విపరీతంగా రక్తం పోతూ ఉంది. చావు బతుకుల మధ్య కొట్టాడుతున్నాడు అతడు.

కార్లు వెళ్ళి హెడ్‌క్వార్టర్స్ హాస్పిటల్ ముందాగాయి. పేషెంట్‌లను లోపలికి తరలించారు.

శంకరయ్య అక్కడ నుండే పోలీస్ కంట్రోల్ రూమ్‌కు ఫోన్ చేశాడు. ఫలానా రోడ్డులో ఫలానా నెంబర్ కిలోమీటర్ రాయి వద్ద తమ కారు యాక్సిడెంటయిందనీ, డ్రైవర్ చనిపోయాడనీ, తమ బన్ను, కొంతమంది జనం అక్కడే ఉన్నారనీ తెలిపాడు. దెబ్బలు తగిలినవారి వివరాలు, వారిని హాస్పిటల్‌లో చేర్పించిన వైనం వివరించాడు.

పోలీసులకు ఫోన్ చేసేశాక వినాయకరావు గారు పేషెంట్‌ల దగ్గరకు వచ్చేశారు.

మిగతావారి పరిస్థితి నార్మల్‌గానీ, భానుమూర్తి పరిస్థితి మాత్రం క్రిటికల్ అని చెప్పారు డాక్టర్లు. వారు తమ శాయశక్తులా కృషిచేశారు.

అయినా హాస్పిటల్‌కు చేర్చిన ఒక గంట తర్వాత భానుమూర్తి ప్రాణాలు వదిలాడు.

అందరి కంటా కన్నీరు. వినాయకరావు, విమలాదేవిలు దుఃఖాన్ని ఆపుకోలేక పెద్దగా ఏడవసాగారు.

* * *

రాత్రంతా కురిసిన వర్షం తెల్లారికి తెరిపి ఇచ్చింది.

లోకమంతా హాయిగా ఊపిరిపీల్చుకున్నారు. కాని ఆ కుటుంబసభ్యులు మాత్రం దిగాలుగా నిట్టూరుస్తున్నారు. వారి ముఖంలో దైన్యం కనిపిస్తూ ఉంది.

నిన్న కురిసిన వర్షం ఆ ఇంటిలోని వ్యక్తుల సంతోషాన్ని తుడిచిపెట్టేలా చేసింది. వారు ఎంతో ఆనందంగానూ, మరెంతో ఉత్సాహంగానూ పెళ్ళి ఏర్పాట్లుచేసుకున్నారు. పెళ్ళికొడుకు తరలిరావలసిన సమయానికి వర్షం మొదలయింది. ఆ కుండపోత వర్షంలో వారు రాలేకపోయారు. ఘనమైన ఏర్పాట్లన్నీ వృధా అయ్యాయి. పెళ్ళి జరగవలసిన ముహూర్తం దాటిపోయింది. ఈ సమయంలో మంగళవాయిద్యాలు తారాస్థాయిలో మోగవలసింది. అయితే ఆ సమయంలో అందరి నిట్టూర్పులు మాత్రమే వినిపిస్తున్నాయి; కళకళలాడుతుండవలసిన పెళ్ళిమండపం వెలవెలపోతూ ఉంది; జరగవలసిన పెళ్ళి ఆగిపోయింది.

లోకంలోని దిగులంతా ఆ సమయంలో శంకరయ్య ముఖంలోనే కనిపిస్తోంది. పెళ్ళి ఆగిపోయింది. తిరిగి మరో ముహూర్తం తమకు కుదురుతుందా? ఒకసారి ఆగిపోయిన పెళ్ళి కాబట్టి అవతలివారు మరో ముహూర్తానికి ఒప్పుకుంటారా? భానుమూర్తి అలాంటివాడు కాదు కాబట్టి ఒప్పుకోవచ్చు. ఒకవేళ ఒప్పుకున్నా ఈసారి ముహూర్తానికి తనకింత ఉత్సాహం ఉండదు. తనింత ఘనంగానూ పెళ్ళి చేయలేకపోవచ్చు. అన్నింటికన్నా ముఖ్యంగా తన బాధ- ముహూర్తం చాలా దూరానికి కుదిరితే అమ్మాయి గర్భం గురించి లోకానికి




తెలిసిపోతుందేమో. ఆ రహస్యాన్ని అలాగే కప్పి జనాన్ని నమ్మించటం సాధ్యంకాదేమో? ఒకవేళ ఇప్పుడు భానుమూర్తి ఈ విషయానికే భయపడి మరో ముహూర్తానికి అంగీకరించక పోతే? ఆ అనుమానం రావడంతోనే ఆయనకు భయం వేసింది. వచ్చిన వర్షాన్ని కసిగా తిట్టుకున్నాడు.

అయితే ఆయన వర్షాన్ని తిట్టుకుంటూ ఉన్నాడే తప్ప జరిగిన ప్రమాదం గురించి ఏ మాత్రం అనుమానపడలేదు- 'రాత్రి వర్షానికి రాలేకపోయారేమో, మరో ముహూర్తంకోసం కబురు పంపుతారేమో' అనుకుంటున్నాడు. వర్షం ఆగిపోయింది. కాబట్టి ఆ వివరాలు అందుకుని ఎవరో ఒకరు రావాలికదా- అని ఎదురుచూస్తున్నాడు.

చంద్రశేఖరం ఆయనకు దగ్గరగా వచ్చాడు "మామయ్యా... వారి దగ్గరనుండి ఇంతవరకూ ఎలాంటి కబురూ రాలేదేం?" వాచీవంక చూనుకుంటూ ప్రశ్నించాడు అతడు. అప్పుడు సమయం ఉదయం పదిగంటలయింది.

"నేనూ అదే చూస్తున్నానురా... రాత్రి వర్షానికి రాలేకపోయినవారు, వర్షం ఆగాకయినా ఆ విషయాన్ని కబురుచేయాలి కదా?"

"ఎలాగూ ఈ ముహూర్తం దాటిపోయింది కాబట్టి, వివరాలకోసం మీరే వస్తారని వారు ఎదురుచూస్తున్నారేమో?"

"అయి ఉండవచ్చు"

"పోనీ మనమే వెళ్ళి రాకూడదూ ఎంత- తొంభై కిలోమీటర్లేగా- ఇప్పుడు బయలుదేరితే భోజనవేళకు తిరిగి వచ్చేయవచ్చు"

శంకరయ్య మేనల్లుడి ముఖంలోకి చూశాడు. ప్రస్తుతం తన మనసులో మెదలాడుతున్న ఆలోచన కూడా అదే కాబట్టి "అలాగే వెళ్దాం" అన్నాడు.

ఆయన ఈ విషయం చెప్పేందుకు ఇంటిలోకి వెళ్ళాడు. అదిప్పుడు పెళ్ళి ఇల్లులా లేదు. పావుగంటక్రితమే ఆ ఇంటిలోనుండి శవం తరలి వెళ్ళినట్టుగా ఉంది పరిస్థితి. అందరిముఖంలో దిగులు గూడు కట్టుకుని ఉంది. శారదమ్మ, శకుంతలమ్మలు నోట్లో గుడ్డ కుక్కుకుని గోడకు చేరగిలబడి ఉంటే, వచ్చిన బంధువులు వారికి ధైర్యం చెబుతున్నారు "ఇప్పుడేం ముంచుకొచ్చిందని మీరింతగా బాధపడుతున్నారు? వర్షం వచ్చింది, వారు రాలేకపోయారు. అంతేకదా!... వారిప్పుడు మన అమ్మాయిని చేసుకోవడంలేదని చెప్పి పంపలేదు. ఈ ముహూర్తం కాకపోతే మరో ముహూర్తానికి ఆ అబ్బాయితోనే మనమ్మాయి పెళ్ళి జరిగితీరుతుంది. కాకుంటే- ఘనంగా చేసుకున్న ఏర్పాట్లు వృథా అయ్యాయనే కాస్త బాధపడాలి. కాని దానికోసమే ఇంతగా దిగులు పడటం అనవసరం"

తాము ఏర్పాట్లు వృథా అయ్యాయని బాధపడటంలేదనీ, మరో ముహూర్తం అంటే- వసుంధర గర్భంలోని శిశువు మరికాస్త పెద్దదవుతుందనీ, ఆ అపవాదునుండి తప్పించుకోవడం కష్టం అవుతుందనీ- వారికెలా చెప్పుకోవాలో తెలియలేదు. అందుకే అవతలివారి ఉద్దేశాన్ని కాదనకుండా మనసులోని దిగులుతో కుమిలిపోతున్నారు వారు.

ఇక వసుంధరయితే ఎవరికీ కనిపించలేదు. తన గదిలోపల గడియవేసుకుని మంచంమీద బోర్లాపడిపోయి ఉంది. ఆమెను పలకరించే ధైర్యం ఎవరికీ లేకపోయింది. అందుకే ఆ ప్రయత్నం ఎవరూ చేయలేదు.

శంకరయ్య లోపలికి వచ్చి శారదమ్మతో తను భానుమూర్తి దగ్గరకు వెళ్తున్న విషయం చెప్పాడు. ఆమె నిశ్శబ్దంగా తలూపింది.

ఆయన బయటకు వచ్చి చంద్రశేఖరం కారులో కూర్చున్నాడు. చంద్రశేఖర్ డ్రైవింగ్ సీట్లో కూర్చుని కారు స్టార్ట్ చేశాడు.

అప్పటికే గ్రామస్థులు కొందరు తమ తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు. బంధువులు తిరిగి వెళ్ళేందుకు తయారవసాగారు.

ఆయన కారు కదిలిపోతుంటే ఆ వంక చూశాడు. ఇంటిముందున్న ఆ ఎత్తయిన కల్యాణమండపం తనను వెక్కిరిస్తున్నట్టుగా అనిపించింది. ఆ క్షణం ఆయన మనసులో ఒక అనుమానం బలంగా కదలాడింది. 'వసుంధర అన్నట్టుగానే ఆమె పెళ్ళి విషయంలో దురదృష్టజాతకురాలేమో? లేకపోతే ఆఖరి క్షణం వరకూ వచ్చిన పెళ్ళి ఆగిపోవడం ఏమిటి?'

కారు వేగంగా పోతూ ఉంది. ఆయన ఆలోచనలు అంతకన్నా వేగంగా పరుగెడుతూ ఉన్నాయి. రోడ్డు మీద గుంటలలో నిలచిన నీరు కారు చక్రాల తాకిడికి దూరంగా వెదజల్ల బడుతోంది. ఆయన ఆలోచనలు కూడా పరిప రివిధాల పోతున్నాయి.

గంటన్నర ప్రయాణం తర్వాత కారు వినాయకరావు ఇంటి ముందు ఆగింది.

ఆ ఇంటి వరండాలో గుమికూడి ఉన్న జనాన్ని చూడటంతోనే ఆయన భ్రుకుటి ముడి వడింది. లోపల నుండి ఏడుపులు వినిపిస్తున్నాయి. వారిద్దరూ ముఖాలు చూసుకున్నారు. భయంకరమైన అనుమానం వారి మనసులను కుదిపివేసింది.

కారుదిగి భయంగా లోపలికి అడుగులు వేశారు. వరండా చేరుకుని అటు చూసినవారు నిర్ఘాంతపోయారు. శంకరయ్యగారయితే జీవితంలో అంత షాక్ ఎప్పుడూ తిని ఎరగడు. 'మరో ముహూర్తం నిర్ణయించుకునేందుకు వచ్చిన ఆయన వరుడి మరణాన్నే చూడవలసివస్తుందని' అనుకోలేదు. తమకు కబురు రాకపోవడానికి కారణం కొంతవరకూ అర్థమయింది. కానీ... కానీ ఇది ఎలా జరిగింది?

శంకరయ్యగారిని చూసిన వినాయకరావు శవం దగ్గర నుండి లేచివచ్చి ఆయనను గట్టిగా చుట్టేసుకుని బొరువుమన్నాడు. "చూశారా మీ అల్లుడిని... ఎలా నిశ్చింతగా నిద్రపోతున్నాడో చూశారా? ఇంత వర్షంలో ప్రయాణం వద్దురా అంటే వినకుండా ఈ ముహూర్తానికే పెళ్లి జరగాలని పట్టుపట్టి ప్రయాణం చేయించి, తన ప్రాణాలనే పోగొట్టుకున్నాడు. వాడు... చూడండి... వాడెలా ప్రశాంతంగా నిద్రపోతున్నాడో. వాడికిప్పుడు ఏ ఆత్రుతా లేదుకదూ! పెళ్లి గురించి అంత తొందరపడినవాడు ప్రాణాలే పోగొట్టుకుని ఇప్పుడేం చేయగలిగాడు?"

భయంకరమైన వేదనతో ఉన్న వ్యక్తి తన రోదనను ఆపుకొని మరొకరిని ఓదార్చవలసి రావడం చాలా బాధాకరమైన విషయం. ఆయన చాలా త్వరగానే ఆ షాక్‌నుండి తేరుకుని వినాయకరావుగారితో ఓదార్పు మాటలు చెప్పాడు- "ఊరుకోండి... మన చేతులలో ఏమీ లేదు... అంతా ఆ దైవ నిర్ణయం. ఎంత ఏడ్చినా చనిపోయిన మనిషి తిరిగిరాడు" ఆ మాటలు మాట్లాడుతుంటే ఆయన గొంతు జీరవోయింది. తను చెబుతున్న ప్రతి వాక్యం ఒక్కో బాణమై తన శరీరాన్నే తూట్లు చేస్తున్నట్టుగా అనిపించింది.

వినాయకరావు చాలా దుఃఖంలో ఉన్నాడు. కుమిలి కుమిలి ఏడుస్తున్నాడు. శంకరయ్యగారి దగ్గర నుండి జరిగి తమ్ముడి శవం దగ్గరకు వెళ్లి కూర్చున్నాడు. శంకరయ్య గారు కూడా భానుమూర్తి భౌతికకాయం పక్కనే కూర్చున్నాడు.

భానుమూర్తి తలకు కట్టు ఉంది. ముఖాన అక్కడక్కడా గాయం మరకలు కనిపిస్తున్నాయి. భుజాల వరకూ తెల్లని బట్ట కప్పి ఉంది. అతడు ప్రశాంతంగా నిద్రపోతున్నట్టుగా అనిపిస్తోంది.

శంకరయ్య ఆప్యాయంగా భానుమూర్తి శరీరాన్ని స్పృశించాడు. అలా తాకుతుంటే ఆయన కన్నులు మెల్లగా చెమర్చాయి. ఆ కన్నీటి ముత్యాలు తుడుచుకునే ప్రయత్నం చేయలేదు ఆయన-

మనసులో అనుకున్నాడాయన 'ఎంత గొప్ప మనసు బాబూ నీది! మరో మంచి హృదయానికి మేలు చేయాలన్న ఉద్దేశంతో ఆమె శరీరం మలినమయిందని తెలిసీ, గర్భవతి అని కూడా వెనుకాడక పెళ్లికి ఒప్పుకున్నావు. ముహూర్తం దాటిపోతే ఆమె మనసు బాధపడుతుందేమోనని, ప్రకృతి వైపరీత్యాన్ని లెక్కచేయకుండా అందరినీ బయలుదేరదీసావు. కాని... కాని నీ మంచి మనసు ప్రయోజనాన్ని సాధించలేకపోయింది. ఇది.... ఇది నీ తప్పుకాదు- ఖచ్చితంగా మా అమ్మాయి దురదృష్టమే. తను చెబుతూనే ఉంది— పెళ్లివిషయంలో తనో దురదృష్టజాతకురాలినని. కాని అది వట్టి అపనమ్మకమేనని నేనే ఆమెను ఈ పెళ్లికి బలవంతం చేశాను. అయితే ఆమె దురదృష్టం నీలాంటి ఉత్తముడిని బలితీసుకుంటుందని నాకు తెలియదు. ఏ మాత్రం ఊహించి ఉన్నా నేను నా కూతురి పెళ్లి ప్రయత్నమే తలపెట్టకపోదును బాబూ...'





ఎంతో గొప్ప మనసు, మరెంతో భవిష్యత్ ఉన్న అతడు అలా నిర్జీవంగా పడిఉంటే గుండె లోతుల నుండి దుఃఖం తన్నుకురాసాగింది. అతడు తన కుటుంబంకోసం చేయబోయిన త్యాగం తలచుకుంటే ఏడుపు కూడా ఆగలేదు. తాత్కాలికంగా ఆయన తన కూతురి భవిష్యత్ ఏమిటా అని ఆలోచించడం కూడా మర్చిపోయి ఆ యువకుడి కోసం నిండు మనసుతో దుఃఖించాడు. చంద్రశేఖరం కూడా ఆయన పక్కనే కూర్చుని చనిపోయిన మిత్రుడి వంక బాధగా చూస్తున్నాడు.

వినాయకరావు పరిచయస్తులు, భానుమూర్తి స్నేహితులు, బంధువులు — ఎందరెందరో వస్తున్నారు, శవాన్ని చూసి వెళుతూ ఉన్నారు; కొందరు ఆగిపోతున్నారు; ముఖ్యులు కొందరు శవాన్ని తరలించేందుకు ఏర్పాట్లు చేస్తున్నారు.

సాయంత్రమయింది.

శవానికి స్నానం చేయించారు. పాడెమీద పెట్టి కొత్తబట్టలు కప్పారు. నాలుగువైపులా నలుగురు కలసి పాడెను ఎత్తుకున్నారు. శవం తరలి వెళ్లిపోతుంటే ఇంటిలోనివారంతా పెద్దగా రోదించసాగారు.

వినాయకరావు శవంముందు కొరివి పట్టుకొని నడవసాగాడు. శవానికి వెనుక చాలా మంది నడుస్తున్నారు. శంకరయ్య, చంద్రశేఖరంలు కూడా వారితోపాటు అడుగులు వేస్తున్నారు. అందరితో కలసి అడుగులు వేస్తున్నాడేగాని శంకరయ్య మనసు మాత్రం ఎక్కడో ఉంది.

శవం శ్మశానాన్ని చేరింది. శ్మశానం ముందర పాడెను ఒకసారి దించి తిరిగి పైకెత్తుకున్నారు వాహకులు. శవం చితి ముందుకు చేరింది. జరగవలసిన కార్యక్రమాలు జరిపించాక శవాన్ని చితిమీదకు చేర్చారు. వినాయకరావు చితికి నిప్పంటించాడు. క్షణాలలో చితి అంటుకుంది. మంచి మనసును తోడు చేసుకున్న భౌతికకాయం మంటలలో మాడిపోసాగింది. మరి ఆ మంచిమనసు ఎటు వెళ్లింది? ఆత్మ ఏ దారిన వెళ్లింది?

చితి మంటలు ఆకాశాన్ని అంటుకునేలా పైకెరగసాగాయి. అందరి కన్నులూ విషాదంగా ఆ చితివైపే చూడసాగాయి.

సూర్యుడు పూర్తిగా అస్తమించాడు. మండుతున్న చితి కాసేపు చూశాక అందరూ వెనుదిరిగారు.

వినాయకరావు ఇంటికి చేరుకున్నాడు.

కాసేపు వినాయకరావు పక్కనే కూర్చున్నాడు శంకరయ్య. అప్పటికి బాగా చీకటిపడిపోయింది. శంకరయ్య లేచాడు- ''దిగులువడకండి. బాధను మరచిపోయేందుకు ప్రయత్నించండి'' చివరి మాట చెప్పి బయటకు నడిచాడు. చంద్రశేఖరం ఆయనను అనుసరించాడు.

ఇద్దరూ కారెక్కారు. బరువెక్కిన గుండెలతో పల్లెవైపు కదిలారు.

శంకరయ్య ప్రస్తుతం భానుమూర్తి మరణాన్ని మరచిపోయి, ఈ విషయాన్ని తన ఇంట్లో చెప్పటం ఎలాగా అని ఆలోచించసాగాడు. ఆ దురదృష్టజాతకురాలి భవిష్యత్ ఏమి చేయడమా అని వ్యధపడసాగాడు.

కారు నెమ్మదిగా ప్రయాణం చేయసాగింది.

''మామయ్యా... ఏమిటిది... వసుంధర పెళ్ళి విషయం ఇలా అయిందేమిటి?''

ఆయన ఒకే ఒక మాట అన్నాడు. ''వసుంధర పెళ్లి విషయంలో గొప్ప దురదృష్టజాతకురాలు''

''ఎందుకని?'' ప్రశ్నించాడు చంద్రశేఖరం.

ఆయన జవాబివ్వలేదు. సీటులో వెనక్కువాలి తన ఆలోచనల్లో తను మునిగిపోయాడు. ఆ సమయంలో ఆయనను రెట్టించి అడిగే ధైర్యం లేకపోయింది అతడికి.

కారు పల్లెను సమీపించింది.

''ఈ విషయాన్ని ఇంట్లో చెప్పటం ఎలా?'' అనుమానంగా అన్నాడు చంద్రశేఖరం.

''ఎలా అయినా చెప్పక తప్పదుకదా?''

ఇల్లు దగ్గరవుతూ ఉంది. వారి గుండెల వేగం పెరుగుతూ ఉంది.

కారు ఇంటిముందు ఆగింది.

శారదమ్మ కారు దగ్గరకు పరిగెత్తుకుంటూ వచ్చింది. సర్వం పోగొట్టుకున్న రారాజులా దిగులు ముఖం వేసుకుని ఉన్న ఆయనను

చూడటంతోనే ఆమె మనసు కీడు శంకించింది- "ఏమయిందండీ?" అడిగింది ఆతృతగా.

ఆయన నిశ్శబ్దంగా లోపలికి నడవసాగాడు. ఆయన నిశ్శబ్దం ఆమెను మరింత కలవరపెట్టింది. ఆమె చంద్రశేఖరాన్ని నిలేసి ప్రశ్నించింది "ఏం జరిగింది అక్కడ?"

కారు ఆగిన శబ్దం కావటంతో వసుంధర లేచింది. రాత్రి భానుమూర్తి ఎందుకు రాలేక పోయాడో తెలుసుకునే ఉద్దేశంతో కిటికీ వరకూ వచ్చి నిలబడింది.

చంద్రశేఖరం అత్తయ్యవంక ఇబ్బందిగా చూశాడు. తర్వాత మామయ్యవంక ప్రశ్నార్థకంగా చూశాడు. ఆయన చూపులు నిస్తేజంగా ఉండటంతో ఇక తనకు తప్పదనిపించింది.

మెల్లగా గొంతు పెగుల్చుకుని చెప్పాడు "అత్తయ్యా... కంగారుపడకండి- రాత్రి ముహూర్తం అందుకునేందుకు బయలుదేరి వస్తుంటే... భానుమూర్తి కారు యాక్సిడెంట్ అయింది... అతడు... అతడు... చనిపోయాడు"

దబ్బున శబ్దం అయింది. అందరూ ఉలికిపడి అటుగా చూశారు. ఏదో అనుమానం కలిగి లోపలికి పరుగెత్తారు.

వసుంధర కిటికీకి చేరగిలబడి ఉంది.

"వసుంధరా... వసుంధరా..." వారంతా ఆతృతగా పిలిచారు.

ఆమెనుండి జవాబు లేదు. ఆమె అసలీ లోకంలో లేదు. అందరూ కలసి ఆమెను గది లోపలికి తీసుకెళ్ళి మంచంమీద పడుకోబెట్టారు.

"వనూ... వనూ..." పిలిచారు తల్లీదండ్రి.

వసుంధర మెల్లగా కళ్ళు తెరిచింది. వారందరివంకా ఒకసారి తేరిపారచూసింది. విన్న మాటలు జ్ఞప్తికి వచ్చాయి కాబోలు ఆమె చప్పున ముఖం తిప్పుకుని వెక్కసాగింది.

అందరూ ఆమెకు ఓదార్పుమాటలు చెప్పసాగారు.



వసుంధర మనసుకు ఈసారి తగిలిన దెబ్బ చాలా పెద్దది. ఆమె జీవితాంతం కోలుకోలేనంత బలంగా తగిలింది అది.

ఆమె ఇప్పుడు నాలుగు గోడల మధ్య శాశ్వతంగా బందీ అయింది. తన జీవితంలోని మలుపులను నెమరువేసుకునేది. ఆ సమయంలో ఆమెకు కన్నీరు కూడా వచ్చేదికాదు. కారణం- ఆమె కన్నులలో నీరు ఎప్పుడో ఇంకిపోయింది. ఆమెకు కొద్దికాలం క్రితం తన అదృష్టం గురించి ఒక అనుమానం ఉండేది. కాని ఇప్పుడు అది అనుమానం కాదు నిజమని రుజువయింది. తన దురదృష్టం ఒక ఉత్తముడిని బలి తీసుకున్నందుకు ఆమె బాధపడసాగింది. అందుకే జీవితంలో మరేనాడూ పెళ్ళిమాట తలపెట్టకూడదనీ, తన దురదృష్టాన్ని ఏ మగవాడికీ పంచకూడదనీ స్థిరనిర్ణయం తీసుకుంది. పురుషులకు ఆమడదూరంలో ఉండాలని అనుకుంది.

రోజులు మెల్లగా గడుస్తున్నాయి. కాలంతోపాటు ఆమె కడుపు కూడా పెరుగుతూ ఉంది. ఆమె దానిగురించి ఆలోచించడమే లేదు.

కాని శంకరయ్య, శారదమ్మలకు మాత్రం రోజురోజుకీ ఆందోళన పెరుగుతూ ఉంది. పెళ్ళి కాకుండానే కూతురు గర్భవతి అని తెలిస్తే ఈ లోకంలో తమిక తలెత్తుకుని తిరగలేరు. అందులోనూ అది పల్లెటూరు కాబట్టి ఏ విషయమయినా ఊరంతా గుప్పుమంటుంది. ఏ చిన్నతప్పు జరిగినా మర్యాదస్తులు నడివీధిలో తలెత్తుకుని తిరగలేరు. అందుకే ఆ తప్పు ఎవరికీ తెలియకుండా కప్పెట్టాలనుకున్నాడాయన. కూతురికి అబార్షన్ చేయించాలనుకున్నాడు.

ఆరోజు భార్య, చెల్లెలు పక్కన ఉన్నప్పుడు ఆయన ఈ చర్చ తీసుకువచ్చాడు.

"అమ్మాయికిప్పుడు మూడోనెల మొదలయింది. మరిన్ని ఎక్కువ రోజులు గడిస్తే అబార్షన్ చేయించటం కష్టం అవుతుంది. అందుకే ఆ ఏర్పాట్లు మనం త్వరగా చేస్తే బాగుండును"

శారదమ్మ చెప్పింది- "జరిగిన సంఘటన నుండి అమ్మాయి ఇంకా మానసికంగా కోలుకోలేదు. శారీరకంగా కూడా చాలా బలహీనంగా ఉంది. అటువంటి దానిని తీసుకెళ్లి హాస్పిటల్





పాలు చేయటం అంత మంచిది కాదేమో... ఆలోచించండి"

శంకరయ్య ఆమెవంక చిరుకోపంగా చూశాడు. "వళ్ళు సరిలేదనీ, మనసు బాగోలేదనీ మనం తాత్సారం చేస్తే ఆ తర్వాత ఆ తప్పును తప్పించటం ఎవరివల్లా కాదు. మరో నాలుగు నెలల తర్వాత దాని కడుపు కాస్త పైకిలేస్తే లోకులంతా మనవంక చూసి నవ్వుతారు. 'పెళ్ళి కాని తల్లి' అని దాని ముఖాన ఉమ్మేస్తారు" విసురుగా అన్నాడాయన.

ఆ మాటలలో కూడా నిజముంది.

"అయితే ఇప్పుడేం చేద్దాం"

"మీరెళ్ళి అమ్మాయిని అబార్షన్‌కి వప్పించండి" చెప్పాడాయన.

వారు తలూపారు. ఆ మధ్యాహ్నం వారిద్దరూ కలసి వసుంధర గదిలోకి వెళ్ళారు.

వసుంధర పూర్తిగా నీరసించిపోయి ఉంది. ఆమె ముఖంలో కళాకాంతులు తగ్గి, పీక్కుపోయినట్టుగా అనిపిస్తోంది. భానుమూర్తి మరణం తర్వాత ఆమె ఆ గది దాటి బయటకు రాలేదు. ఎవరితోనూ పలికి ఎరగదు. అన్నం కూడా శారదమ్మ ఆ గదికే తీసుకువచ్చి ఆమెచేత బలవంతంగా రెండు ముద్దలు తినిపించేది.

తన గదిలోకి అమ్మ, అత్తయ్య వచ్చారని తెలిసినా వసుంధర పట్టించుకోలేదు. ఒకసారి వారివంక చూసి తల తిప్పుకుంది.

"అమ్మా వసూ!" పలకరించింది శారదమ్మ.

ఆ మాట వినిపించిందో లేదో తెలియదు కాని వసుంధర జవాబివ్వలేదు. తిరిగి శారదమ్మే అంది- "వసూ... మీ నాన్నగారు నీకో విషయం తెలపమన్నారమ్మా"

అప్పుడు కూడా ఆమె తలతిప్పి చూడలేదు.

"ఈ పెళ్ళి ఆగిపోయినందుకు ఆయన చాలా బాధపడుతున్నాడు. అసలీ పల్లెలో తలెత్తుకుని తిరగలేకపోతున్నాడు. ఆయన ఆ బాధను ఎలాగో భరిస్తున్నాడు. కాని... పెరుగుతున్న మరో సమస్యను గురించి విపరీతంగా వ్యధ పడుతున్నాడు. రేపు ఈ విషయం పల్లెలో నివారికి తెలిస్తే ఎలాగా అని కుమిలిపోతున్నాడు..." ఆగిందామె.

వసుంధర తలతిప్పి వారివంక చూసింది.

శారదమ్మ కూతురి కన్నులలోకి జాలిగా చూసి చెప్పసాగింది- "అవునమ్మా... గుండెల మీద కుంపటిలా ఉన్న ఆ సమస్యవలన ఆయన నిద్రపోవటంలేదు. అనుక్షణం నీ గురించే ఆలోచిస్తున్నారు. నీ గర్భం విషయం బయటకు పొక్కితే... ఆయన ఈ ఊరిలో తలెత్తుకుని తిరగలేకపోవటమే కాదు, అవమానంతో మరేదైనా అఘాయిత్యం చేసుకున్నా చేసుకోవచ్చు..."

ఆమెలో కొద్దిగా చలనం కలిగింది. "అయితే... అయితే నన్నిప్పుడేం చేయమంటారమ్మా" గొంతు విప్పింది వసుంధర.

కొద్దిక్షణాలు మౌనంగా ఉండిపోయింది శారదమ్మ. తర్వాత మాటలు కూర్చుకుని మెల్లగా చెప్పింది- "ఆ విషయం లోకులకు తెలియనివ్వకుండా చేయాలంటే నీకిప్పుడు అబార్షన్ చేయించాలి"

ఆమె మొదట ఉలిక్కిపడింది. తర్వాత చాలాసేపు ఆలోచిస్తూ ఉండిపోయింది.

వసుంధర నుండి ఏ జవాబూ రాకపోవడంతో శారదమ్మే తిరిగి ప్రశ్నించింది. "జవాబు చెప్పకుండా మౌనంగా ఉండిపోయావేం వసూ?"

ఆమె విరక్తిగా నవ్వింది. "ఏంచెప్పనమ్మా! మనసున్న ఏ ఆడదీ తన కడుపును అర్థంతరంగా దించుకోవాలనుకోదు. నవమాసాలూ మోసి పండంటి బిడ్డను కనాలని అనుకుంటుంది"

ఈసారి శకుంతలమ్మ జోక్యం చేసుకుంది. "నిజమే! కాని... ప్రస్తుత పరిస్థితి వేరు. నీ మెడలో తాళి ఉండి ఒకవేళ ఏదయినా ఉపద్రవం జరిగి ఉన్నా ఆ తాళే నీకు రక్షణ కలిగించి ఉండేది. ఆనాడు నువ్వు బిడ్డను కనేందుకు మేమూ సమ్మతించి ఉండేవారం. లోకులు కూడా ఆనాడు నీమీదా, నీ బిడ్డమీదా జాలిపడేవారే తప్ప ఎత్తిపొడుపు మాటలు మాట్లాడి ఉండేవారు కాదు. కాని— నేడు నువ్వు తాళి లేకుండానే తల్లివయితే 'పెళ్లి కాకుండానే బిడ్డ'ను కన్నదని లోకులంతా

నిన్ను వేలెత్తి చూపిస్తారు. జనమంతా కలసి మన పరువును నడివీధిలోకి ఈడుస్తారు. ....ఆలోచించి వనూ''

''అంటే లోకుల కోసం నా కడుపును దించుకోమంటారా అత్తయ్యా! నా భవిష్యత్తుకు ఆధారం చేసుకోదలచుకున్న ఒకే ఒక ఆనందాన్ని కూడా వదులుకోమంటారా.... చెప్పండత్తయ్యా''

శకుంతలమ్మ బలవంతంగా నవ్వింది. ''పిచ్చిదానా! ఇప్పుడు నీ భవిష్యత్‌కి ఏమయింది? ఒక పెళ్లి ఆగిపోతేనే నీకిక భవిష్యత్ లేదనుకోవడం నీ పిచ్చితనం. ...అసలు నీ భవిష్యత్‌ను ఆలోచించే మేమీ పని చేయాలనుకుంటోంది''

ఆమె తల అడ్డంగా ఊపింది. ''లేదత్తయ్యా! నాకిక భవిష్యత్తు లేదు. పెళ్లి విషయంలో నేను గొప్ప దురదృష్ట జాతకురాలిని... జాతకమా! అదేమిటి! అదో మూఢనమ్మకం— అని కొందరు కొట్టిపారేయవచ్చు కాని కొన్ని రకాల అదృష్టాలు కొందరికి ఎంత ప్రయత్నించినా లభ్యంకావు. దానినే జాతకం అంటారు. పెళ్లి విషయంలో నా అదృష్టాన్ని మూడుసార్లు పరీక్షించుకున్నాను. మూడుసార్లూ దురదృష్టమే నన్ను వెక్కిరించింది. అందుకే— ఈ జీవితానికి పెళ్లి చేసుకునే యోగ్యత లేదని నేనేనాడో నిశ్చయించుకున్నాను. కాబట్టే నా కడుపులోని పాపానికి ఒక రూపం ఇచ్చి ఆ రూపాన్ని చూసుకుంటూ అయినా నా జీవితాన్ని గడిపేయాలనుకుంటున్నాను. కాని నాకు ఆ అదృష్టం కూడా దక్కించకూడదని మీరు ప్రయత్నిస్తున్నట్టుంది...''

వసుంధర మనసులోని అసలు బాధ వారికి అర్థమయిన క్షణం వారు కొద్ది క్షణాల వరకూ మాట్లాడలేకపోయారు. ఆమె నమ్మికలో నిజమెంతో తెలియదుగాని ఆమె అలా నమ్మకం ఏర్పరచుకోవడానికి సబలమైన కారణాలు ఉన్నాయి. అది కేవలం మూఢ నమ్మకం కాదు. ప్రయత్నించి తెలుసుకున్న నిజం! అందుకే ఆమె అభిప్రాయాన్ని కొట్టివేయలేకపోయారు. అలా అని సమర్థించనూ లేకపోయారు. ఏదేమయినా కుటుంబ పరువు కోసం వ్యక్తి ఆనందాన్ని బలిపెట్టక తప్పదు.

''నీ ఆనందాన్ని పాడుచేయాలని కాదు తల్లీ! నీ తండ్రి పరువును కాపాడాలనీ, రేపటి రోజు నలుగురి వెక్కిరింతకు నువ్వు గురికాకూడదనీ మేమీ ఆలోచనకు వచ్చాం. దెబ్బతిన్న మనసు కాబట్టి ఈరోజు నీకు ఈ చిన్న ఆనందాన్నయినా దక్కించుకోవాలనిపించవచ్చు. కాని రేపటిరోజు, ఈ గాయం మానిపోయాక, నీ భవిష్యత్‌కోసం మరో ప్రయత్నం ఛేయాలనిపిస్తే ఆరోజు నువ్వు ఆనందం అనుకున్న ఆ బిడ్డే నీకు ఆటంకం అనిపిస్తాడు''

''లేదమ్మా... వరుసగా అన్ని ప్రయత్నాలలో అపజయం పొంది జీవితంలో కోలుకోలేనంతగా నేను అలసిపోయాను. ఇంకా ప్రయత్నాలు చేసే ఓపిక, మానసిక స్థైర్యం నాలో లేదు. అంతేకాదు— అలా ప్రయత్నించి నా దురదృష్టాన్ని మరో ఉత్తముడికి అంటకట్టడం నేను అంగీకరించలేను''

శకుంతలమ్మ చెప్పింది- ''రేపటిరోజు నువ్వు ఇంకో పెళ్లికి అంగీకరించడం, అంగీకరించకపోవడం ప్రస్తుత సమస్యకాదు. అది తర్వాత విషయం. ప్రస్తుతం మనం మన ముందున్న గడ్డు సమస్యను తొలగించుకోవాలి. అందుకు నువ్వు ఒప్పుకోవాలి''

''ఒప్పుకోకపోతే?'' ప్రశ్నించింది వసుంధర.

అంతకుమునుపే ఆలోచించి పెట్టుకుని ఉన్న జవాబు చెప్పింది శకుంతలమ్మ. ''దానివలన చాలా అనర్థాలు జరుగుతాయి. మన కుటుంబ పరువు నడివీధిలో చర్చనీయాంశం అవుతుంది. మీ నాన్నగారు నలుగురిముందూ తలెత్తుకోలేరు. జనమంతా మన ఇంటివంక వేలెత్తి చూపిస్తారు. నిన్ను అందరూ అసహ్యించుకుంటారు. మన కుటుంబం అంటే అందరికీ చులకన భావం కలుగుతుంది. ఈ పరిణామాలకు మీ నాన్నగారు కృశించిపోతారు. లేదా గ్రామంలో తన గౌరవం పోయిందన్న బాధతో ఏదయినా ఘోరం తలపెట్టినా మనం ఆశ్చర్యపడవలసిన పనిలేదు''

వసుందర ఆ మాటలు ప్రశాంతంగా వింది. అత్తయ్య చెప్పినదాంట్లో అతిశయోక్తులు ఏవీ లేవు. భవిష్యత్ చిత్రణ ముందుగా చూపించిందామె... భవిష్యత్‌లో తనను అందరూ




వేలెత్తి చూపిస్తారు. కాని తను అందుకు బాధ పడబోదు. తన చిన్న ఆనందం కోసం తనీ లోకాన్ని ఎదిరించేందుకయినా సంసిద్ధురాలే. అయితే— తననెంతో అభిమానంగా, ఆప్యాయంగా పెంచుకున్న తండ్రి అపవాదు పడవలసిరావడం అంటే...? ఆమె మనసు ఆ ప్రశ్న దగ్గరే ఆగిపోయింది. తన కోసం వ్యధపడే తండ్రిని తన చిన్న ఆనందంకోసం బాధపెట్టడం ఆమెకెంతమాత్రం ఇష్టంలేదు. అలా అని ఆమె తన కడుపులో జీవం పోసుకుంటున్న ప్రాణాన్ని విసర్జించేందుకు వెంటనే అంగీకరించలేకపోయింది. అందుకే—

"అమ్మా... నాకు ఆలోచించుకునేందుకు కొంత గడువివ్వండి" అన్నది వసుంధర.

శంకుతలమ్మ ఏదో అనబోతుంటే, శారదమ్మ అడ్డుకుని- "అలాగే వసూ! ఈరోజంతా ఆలోచించుకుని రేపే నీ నిర్ణయాన్ని చెప్పు... ఏమయినా నీ నిర్ణయం మాకు ఆనందాన్ని కలిగించేదిగా చూడు తల్లీ".

వసుంధర నిశ్శబ్దంగా ఉండిపోయింది.

శారదమ్మ లేచింది. "రా శకుంతలా" అంది ఆడపడుచును ఉద్దేశించి శకుంతలమ్మ కూడా లేచింది. ఇద్దరూ బయటకు నడవసాగారు. గది గడపదాటకముందే శకుంతలమ్మ అంది- "అది ఆలోచించుకునేదేముంది? ఇప్పుడే ఒప్పుకోమని బలవంతపెడితే పోదా?"

"అలా వద్దులే శంకుంతలా! దానిని పరిస్థితులను ఆలోచించుకోనివ్వు. అది అంత మొండిపిల్లేంకాదు. తను పట్టిన కుందేటికి మూడేకాళ్ళు అనేరకం కాదు... పరిస్థితులను ఆలోచిస్తే, అమ్మాయే ఒప్పుకుంటుంది. ఇంతలోనే దానిని బలవంతపెట్టి, అయిష్టంగా ఒప్పుకునేలా ఎందుకు చేయడం?"

వారు ముందుకు సాగిపోయారు. కాని ఆ మాటలు ఆమెకు పూర్తిగా వినిపించాయి.

వసుంధర ఆలోచనల్లో పడింది. పరిస్థితులను సమీక్షించుకోవడం మొదలుపెట్టింది. అన్నివైపులా ఆలోచించుకోసాగింది.

"తనకు ఇక వివాహయోగంలేదు. తను జీవితాంతం అవివాహితగానే మిగిలిపోదలచుకుంది. అందుకే తన జీవితానికి ఆనందం ఇచ్చేందుకు ఒక పసివాడయినా ఉంటే బాగుండుననుకుంది. కాని ఆ పసివాడు తన కుటుంబపరువుకు సవాలు అవుతాడని తెలిసాక, తన తండ్రి ప్రాణాలకే ప్రమాదం తెస్తాడని తెలుసుకున్నాక ఆమె ఆ ప్రయత్నాన్ని విరమించుకోదలచుకుంది. జీవితపు చివరి ఆనందాన్ని కూడా తండ్రికోసం త్యజించదలచుకుంది. కేవలం తండ్రి కోసమే -

మర్నాడు ఆమె తన నిర్ణయాన్ని పెద్దలకు చెప్పింది. అందరూ ఆమె నిర్ణయానికి ఆనందించారు.



శంకరయ్యగారికి వెంకటనారాయణ అనే చిన్ననాటి స్నేహితుడు హైదరాబాద్‌లో ఉంటున్నాడు. ఆయన లాయర్. ఆయన భార్య ఈమధ్యనే చనిపోయింది. కొడుకులు, కూతుళ్ళు ఇతర రాష్ట్రాలలో ఉద్యోగంచేస్తూ అక్కడ సెటిల్ అయిపోయారు. ప్రస్తుతం ఆయన లంకంతకొంపలో ఒంటరిగా ఉంటున్నాడు. హైదరాబాదుకు ఎప్పుడయినా ఏదైనా పని మిద వెళితే, శంకరయ్యగారు ఆయన ఇంటిలోనే దిగుతూ ఉంటాడు.

ప్రస్తుతం తనకు వచ్చిన ఇబ్బందిని ఆయనకు లెటర్ ద్వారా తెలిపాడు శంకరయ్య. వెంటనే ఆయన దగ్గర నుండి ఉత్తరం వచ్చింది. అమ్మాయిని తీసుకుని వెంటనే బయలుదేరి హైదరాబాదుకు రమ్మని రాసాడాయన.

పెళ్ళి చెడిపోవటంతో వసుంధర మానసికంగా దెబ్బతిన్నదని, గాలి మార్పు కోసం ఆమెను వేరేఊరు తీసుకువెళుతున్నట్టుగా గ్రామస్తులకు చెప్పాడు శంకరయ్య. గ్రామస్తులంతా ఆమాట నమ్మారు.

ఒక మంచిరోజు చూసుకుని కూతుర్ని వెంటబెట్టుకుని, చెల్లెల్ని తోడుతీసుకుని బస్సెక్కాడు శంకరయ్య. బస్సు దిగి రైల్వేస్టేషన్ చేరుకున్నారు వారు.

వసుంధరకు రైలెక్కడం అదే మొదటిసారి. కిటికీ పక్కన కూర్చుని వెనుకకు జరిగిపోయే చెట్లను, కరెంట్ స్తంభాలను చూస్తుండిపోయింది - తాత్కాలికంగా తన బాధను మరచిపోయి.

ఉదయం ఎనిమిదిగంటలవేళ రైలు నాంపల్లి స్టేషన్‌లో ఆగింది. వెంకటనారాయణ గారు స్టేషన్‌కు వచ్చారు. బోగీలు వెతుక్కుంటూ వారున్న కంపార్ట్‌మెంట్ దగ్గరకు వచ్చాడు. "హలో శంకరం" అన్నాడు చేతులు చాచి.

"బాగున్నావా నారాయణ" అంటూ తనూ చేతులు చాచాడు శంకరయ్య. ఇద్దరూ గట్టిగా కౌగిలించుకున్నారు.

నిముషం తర్వాత వారిద్దరూ విడివడ్డారు. ఒకరి క్షేమసమాచారాలు ఒకరు అడిగి తెలుసుకున్నారు.

కొద్దిసేపటి తర్వాత ఆయన వసుంధర వంక చూసి- "మీ అమ్మాయే కదా?" ప్రశ్నించాడు శంకరయ్యను. తలూపాడు శంకరయ్య.

"నిన్నెప్పుడో చిన్నప్పుడు చూశానమ్మా! అప్పట్లో నేను మన పల్లెకు అప్పుడప్పుడూ వస్తూ ఉండేవాడిని. ఆ తర్వాత రావడం మానేసాను... నీ పెళ్ళికి మీ నాన్నగారు వెడ్డింగ్ కార్డ్ పంపించారు. కాని బిజీపనుల వలన నేనే రాలేకపోయాను...ప్చ్! బేడ్‌లక్'

ఆమె మౌనంగా ఉండిపోయింది.

"ఆ బాధను మర్చిపో తల్లీ... అనుకోనివి జరగడమే జీవితం. నీకు జరిగిన అన్యాయమంతా మీ నాన్నగారు ఉత్తరంలో రాసారు. ఆ సమస్యను తప్పించేందుకు నేను అన్ని ఏర్పాట్లూ చేశాను" అని ఆగి తర్వాత చెప్పాడాయన- "రండి వెళ్దాం".

వెంకటనారాయణగారు వెనుతిరిగి నడువసాగాడు. ఆ ముగ్గురూ ఆయనను అనుసరించారు. స్టేషన్ బయటకు వచ్చాక వెంకటనారాయణ వెళ్ళి పార్కింగ్‌లో ఉన్న తన కారు తీసుకువచ్చాడు. ముగ్గురూ కారు ఎక్కి కూర్చున్నారు.

కారు ముందుకు కదిలింది. విపరీతంగా రద్దీఉన్న రోడ్డును కన్నులు విప్పార్చి చూడసాగింది వసుంధర. హైద్రాబాద్ రావటం ఆమెకు అదే మొదటిసారి. ఎత్తయిన బిల్డింగులు, వేగంగా పరుగెత్తే వాహనాలు, రంగురంగులలో రకరకాలుగా అలంకరించుకుని వెళ్తున్న అమ్మాయిలను ఆసక్తిగా చూసింది వసుంధర.

మనిషిలోని బాధ నిరంతర ప్రవాహం కాదు. కొన్ని సమయాలలో మనిషి తన బాధను మరిచిపోతాడు. అలాగే కాలానికి కూడా బాధను మరిపించే గుణం ఉంది. కొత్త ప్రదేశాలు చూడటం, కొత్త వ్యక్తులతో మాట్లాడడం మనిషికి తాత్కాలిక ఉపశమనాన్ని ఇస్తుంది. అందుకే తెలిసినవారు బాధ కలిగిఉన్న వ్యక్తులను కొత్త ప్రదేశాలకు తీసుకువెళుతారు.

పది నిమిషాలు ప్రయాణం తర్వాత కారు ఓ అధునాతనమైన బిల్డింగ్ ముందు ఆగింది. వెంకటనారాయణ డోర్ తెరచి పట్టుకుని "దిగండి" అన్నాడు. ఆ ముగ్గురూ కిందికి దిగారు.

వసుంధర అప్పుడే తలెత్తి ఆ బిల్డింగ్ వంక చూసింది 'చాలా అందంగా ఉంది' మనసులోనే అనుకుందామె.

"రండి" ఆయన లోపలికి నడుస్తూ పిలిచాడు. లాన్ మధ్యగా ఉన్న సిమ్మెంట్‌దారి మీద నడవసాగారు వారు. ఇంటి లోపలికి వెళ్ళాక ఆయన పని కుర్రాడిని పిలిచి వారి లగేజిని గెస్ట్‌రూమ్‌లో పెట్టమన్నాడు. పని కుర్రాడు ఆ సూట్‌కేసులను తీసుకెళ్ళాక ఆయన వారిని వెంటబెట్టుకుని వెళ్ళి ఆ గదిలోనికి తీసుకెళ్ళాడు. "శంకరం... ఇదీ మీగది. మీకిష్టమైనన్ని రోజులు మీరీగదిలో ఉండొచ్చు. పోతే మీరిప్పుడు స్నానంచేయండి. టిఫిన్ పంపిస్తాను. ప్రయాణం చేసి వచ్చారు కాబట్టి మధ్యాహ్నం వరకూ విశ్రాంతి తీసుకోండి. నేను కోర్టునుండి మధ్యాహ్నానికి వస్తాను. అప్పుడు హాస్పిటల్ వివరాలన్నీ చెపుతాను"

తలూపాడు శంకరయ్య. ఆయన తలుపు దగ్గరగా లాగి బయటకు వెళ్ళిపోయాడు.




వారంతా ఆ గదిలో కొద్దిక్షణాలపాటు నిశ్శబ్దంగా ఉండిపోయారు. చివరికి శంకరయ్యే ఆ నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ- "వసూ! వెళ్ళి స్నానం చేయమ్మా" అన్నాడు.

వసుంధర తలూపింది.

అది అటాచ్డ్ బాత్‌రూం ఉన్న గది.

ఆమె సూట్‌కేస్‌లోనుండి బట్టలు తీసుకొని బాత్‌రూంలోకి వెళ్ళింది. వాటర్ హీటర్‌లో నుండి వేడినీళ్ళు వస్తున్నాయి. ఆమె బకెట్ నిండుగా వేడినీళ్ళు నింపుకుంది. శరీరం మీద వేడినీళ్ళు పడగానే ప్రయాణబడలిక ఒక్కసారిగా పోయింది.

పది నిమిషాలలో స్నానం ముగించుకుని ఆమె ఇవతలకు వచ్చింది. ఆ తర్వాత వరుసగా శంకరయ్య, శకుంతలమ్మలు స్నానం చేశారు. వారి స్నానాలు పూర్తయ్యేసరికి వంటవాడు ట్రేలో ఉప్మాప్లేట్లు, వాటర్ జగ్ తీసుకువచ్చాడు. ముగ్గురూ టిఫిన్‌చేశారు.

రాత్రంతా ప్రయాణంచేసి ఉండడంతో శంకరయ్య, శకుంతలమ్మలు వెంటనే గాఢనిద్రలోకి జారుకున్నారు. నిద్రపట్టనిది వసుంధరకు మాత్రమే! ఆమె కుర్చీలో వెనక్కువాలి- కాలప్రవాహంలో తన జీవితం ఎటు కొట్టుకుపోతుందా అని ఆలోచిస్తూ కూర్చుంది. ఎటుచూసినా తన బతుకులో ఈ ఘట్టం భయంకరంగానే తోస్తూఉంది.

మధ్యాహ్నం అయింది. వంటవాడు వచ్చి భోజనానికి పిలిచాడు. ముగ్గురూ హాలులోకి వెళ్ళి డైనింగ్ టేబుల్ ముందు కూర్చున్నారు. వాడు వడ్డించిన భోజనం తిని, తిరిగి గదిలోకి వచ్చేశారు. మధ్యాహ్నం మూడుగంటల వేళ వెంకటనారాయణగారి కారు వచ్చి ఆగిన శబ్దం అయింది.

శంకరయ్య గది బయటకు వెళ్ళి ఆయనను పలకరించాడు. "భోజనాలయ్యాయా"? అడిగాడు వెంకటనారాయణ.

"ఇంతకుముందే అయ్యాయి. నీ కోసం ఎదురుచూద్దాం అంటే నువ్వు ఎప్పుడొస్తావో తెలియదు కదా!"

"ఇట్సాల్‌రైట్" అంటూ ఆయన వాష్‌బేసిన్‌లో చెయ్యి కడుక్కున్నాడు. డైనింగ్ టేబుల్ ముందు కూర్చున్నాడు. వంటవాడు అప్పటికే వెళ్ళిపోయి ఉండడంతో ఆయనే వడ్డించుకుని భోంచేయసాగాడు. ఆయన భోంచేసినంతసేపూ శంకరయ్య ఎదురుగానే కూర్చుని ఉండిపోయాడు.

కోర్టు వ్యవహారాలతో ఆయన బాగా అలసిపోయి ఉన్నాడని గ్రహించిన శంకరయ్య- "సాయంత్రం వివరాలు మాట్లాడుకుందాంలే నారాయణ" అన్నాడు.

ఆయన తలూపి తన గదిలోకి వెళ్ళిపోయాడు. శంకరయ్య కూడా తనకు కేటాయించిన గదిలోకి వెళ్ళి ఒక కునుకుతీశాడు.

సాయంత్రం ఐదుగంటలవుతుండగా ఆ ఇద్దరూ గదులలోనుండి బయటకు వచ్చారు. బయట లాన్ దగ్గరకు వెళ్ళి, అక్కడున్న కుర్చీలలో కూర్చున్నారు. వారు కూర్చున్న ఐదు నిమిషాల తర్వాత వంటవాడు ట్రేలో కాఫీ కప్పులు పెట్టుకుని వచ్చి వారి ముందున్న టీపాయ్‌మీద పెట్టాడు.

"ఆ ఇద్దరికీ కాఫీ ఇచ్చావా?" ప్రశ్నించాడు వెంకటనారాయణ వాడిని.

"ఇచ్చాను సార్" చెప్పాడు వాడు.

వాడు వెళ్ళిపోయాక వారిద్దరూ కాఫీ సిప్‌చేయసాగారు. కాఫీ తాగడం పూర్తయ్యాక వెంకటనారాయణ శంకరయ్యకు హాస్పిటల్ సంబంధించిన వివరాలన్నీ చెప్పాడు. అప్పటికే ఆయన తనకు తెలిసిన లేడీడాక్టర్‌తో మాట్లాడి ఉన్నాడు. ఫీజు వివరాలన్నీ సేకరించి శంకరయ్యకు చెప్పాడు.

"మనం ఒకసారి ఆమెను కలిసి వస్తే బాగుంటుందేమో?" అన్నాడు శంకరయ్య.

"తప్పకుండా... అయినా ఆలస్యం ఎందుకు? ఇప్పుడే వెళ్ళి కలిసివద్దాం" చెప్పాడు ఆయన. తలూపాడు శంకరయ్య.

వెంకటనారాయణ వెళ్ళి కారు రివర్స్‌చేసి తీసుకువచ్చాడు. శంకరయ్య కారెక్కి మిత్రుడి పక్కనే కూర్చున్నాడు. కారు రోడ్డెక్కింది.

పావుగంట తర్వాత కారు ఓ నర్సింగ్ హోమ్ ముందు ఆగింది. వెంకటనారాయణ శంకరయ్యను వెంట తీసుకుని లోపలికి వెళ్ళాడు.



డాక్టర్ కన్సల్టేషన్ రూమ్‌లో ఉంది. బయట పేషెంట్స్ చాలామంది ఉన్నారు. వెంకటనారాయణ నర్స్‌తో తన విజిటింగ్ కార్డ్ లోపలికి పంపించి, వెంటనే కలుసుకోవాలన్నట్టుగా చెప్పి పంపాడు. లోపలనుండి వెంటనే కబురువచ్చింది. వారిద్దరూ లోపలికి వెళ్ళారు.

తెల్లకోటు వేసుకుని ఉన్న లేడీడాక్టర్ ఆయనను చూసి విష్‌చేసింది- "రండి లాయర్‌గారూ... కూర్చోండి" అంది. బెల్‌కొట్టి నర్స్‌ను పిలిచి కూల్‌డ్రింక్స్ పట్టుకు రమ్మంది.

వారిద్దరూ రెండు నిమిషాలు ఇతర విషయాలు మాట్లాడుకున్నారు. కూల్‌డ్రింక్స్ తాగాక వెంకటనారాయణ అసలు విషయంలోకి

దిగాడు.

ఆ కేసు గురించి అంతకుముునుపే విని ఉండడంతో డాక్టర్ శంకరయ్యను కేసు గురించి కొన్ని వివరాలు అడిగింది. ఎన్నోనెల, అమ్మాయి మరీ వీక్‌గా ఉందా- తదితర ప్రశ్నలు వేసింది. తర్వాత ఫీజు వివరాలు చెప్పింది. చివరగా- "ఇది పెద్దగా భయపడవలసినంత ఆపరేషనేం కాదు, అబార్షన్ చేశాక జస్ట్ నాలుగురోజులు బెడ్‌రెస్ట్ తీసుకుంటే పూర్తిగా రికవర్ అయిపోతుంది. వారంరోజులలో మునుపటిలా తయారయిపోతుంది" అన్నది ఆమె.

ఆయన తలూపాడు. మర్నాడు అమ్మాయిని తీసుకువస్తానని చెప్పి ఇవతలకు వచ్చాడు. వారిద్దరూ కారులో ఇంటికి చేరుకున్నారు.

మర్నాడు శంకరయ్య శకుంతలమ్మను, వసుంధరను తీసుకుని హాస్పిటల్‌కు చేరుకున్నాడు. డాక్టర్ వారికి రూం చూపించింది. ఆపరేషన్ కోసం అడ్వాన్స్ చెల్లించాడు శంకరయ్య.

ఆ మధ్యాహ్నం వసుంధరను ఆపరేషన్ థియేటర్‌లోకి తీసుకువెళ్ళారు. శంకరయ్య, శకుంతలమ్మలు థియేటర్ బయటే ఉండిపోయారు. కొన్ని పనులు మనిషికి ప్రమాదం కలిగించవని తెలిసినా మనిషి భయపడటం సహజం. శంకరయ్య కూతురు గురించి భయపడుతూ ఉన్నాడు.

కొద్దిసేపటి తర్వాత డాక్టర్ నవ్వుతూ బయటకు వచ్చింది- "పేషెంట్ బాగుంది" ఆయనతో చెప్పి తన రూంలోకి వెళ్ళిపోయిందామె.

స్ట్రెచర్‌మీద ఆమెను రూంలోకి తీసుకువచ్చారు. బెడ్‌మీదకు చేర్చాక స్ట్రెచర్ వెళ్ళిపోయింది.

శంకరయ్య కూతురి వంక జాలిగా చూశాడు. తనది కాని నేరానికి శిక్షఅనుభవిస్తున్న అహల్యాదేవిలా అనిపించింది వసుంధర ఆయనకు ఆ క్షణం.

నాలుగు రోజులపాటు వారు ఆ హాస్పిటల్ రూమ్‌లోనే ఉండిపోయారు. పళ్ళరసాలు, టానిక్‌లు వాడడంతో వసుంధర కాస్త త్వరగానే కోలుకుంది.

వసుంధరను తీసుకుని తిరిగి వెంకటనారాయణ ఇంటికి చేరుకున్నాడు శంకరయ్య. వెంటనే పల్లెకు చేరుకోవడం ఆయనకు ఇష్టం లేదు. వసుంధర మరికాస్త హుషారుగా తయ్యారయ్యాక పల్లెకు వెళ్లాలనుకున్నాడు ఆయన.

ఆమె ఆరోగ్యం కాస్త కుదుటపడ్డాక, మానసికంగా ప్రశాంతత పొందేందుకు ఆమెను తీసుకెళ్ళి సిటీ చూపించాలనుకున్నాడు శంకరయ్య.

ఆయన వసుంధరను తీసుకుని ఒకరోజు చార్మినార్ దగ్గరకు వెళ్ళాడు. అటునుండి అటు గోల్కొండ దగ్గరకు తీసుకెళ్ళాడు. హొటల్‌లో భోంచేశాక వారు బిర్లా ప్లానిటోరియం వెళ్ళారు. కిందికివస్తూ బిర్లా మందిర్‌లోని వెంకటేశ్వరస్వామిని దర్శించుకున్నారు. ఆ తర్వాత పబ్లిక్ గార్డెన్‌లో కాసేపు కూర్చున్నారు. ఇంటికి తిరిగివస్తూ విధానసభా భవనాన్ని రవీంద్రభారతిని చూశారు.

ఆ అపురూప కట్టడాలు, ప్రదేశాల సందర్శనలో ఆమె తన్మయత్వం పొందసాగింది. ఆ తన్మయత్వంలో ఆమె తన బాధను తాత్కాలికంగా మరచిపోయింది. ఆమెలో మునుపటి ఉత్సాహం చోటుచేసుకుంది. నాలుగు రోజుల పాటు వసుంధరను హైదరాబాద్ సిటీ అంతా తిప్పి చూపించాడు శంకరయ్య.

వసుంధర పూర్తిగా కోలుకుందని నిర్ధారణ అయ్యాక ఆయన పల్లెకు తిరుగు ప్రయాణం అయ్యాడు. మిత్రుడి దగ్గర వీడ్కోలు తీసుకున్నాడు.

వెంకటనారాయణ ఆ సాయంత్రం ఆ ముగ్గురినీ రైల్వేస్టేషన్‌కు తీసుకువచ్చాడు కారులో. చార్మినార్ ఎక్స్‌ప్రెస్ వచ్చేందుకు ఇంకా చాలా సమయం ఉంది. ఆయన వసుంధరను దగ్గరకు పిలిచి ఆప్యాయంగా చెప్పాడు. "చూడమ్మా వసుంధరా... ఈ లోకంలోని మగవారిలో అత్యధిక శాతంమంది స్త్రీ పొందుకోసం ఎంతకయినా దిగజారతారు. ఆడదానిని అనుభవించేందుకు ఎన్నో వేషాలు వేస్తారు. ఆమె నుండి కావలసింది పొందేందుకు ఎన్నో కల్లబొల్లి కబుర్లు చెబుతారు. మగవాడి మాటలు నమ్మి సర్వం ధారపోయడం ఆడపిల్లకు అంత

మంచిది కాదు... ఒకసారి బాధను అనుభవించావు కాబట్టి ఈ విషయం నీకు ఇప్పటికే తెలిసిఉంటుంది. అయినా ఇప్పటికైనా నువ్వు రియలైజ్ అయ్యావో కాలేదో అన్న అనుమానంతోనే నీకీ విషయం చెబుతున్నాను. ఇకనైనా భవిష్యత్‌లో జాగ్రత్తగా ఉండు... అన్నట్టు ఈసారి నీ పెళ్ళికి నేను తప్పకుండా వస్తాను. నెత్తిన నాలుగు అక్షింతలు వేసి మరీ ఆశీర్వదిస్తాను''

ఆయన మాటలకు దీర్ఘంగా నిట్టూర్చింది వసుంధర- 'తన జీవితానికి వివాహయోగం లేదన్న తన నమ్మకాన్ని ఆయనకు ఎలా తెలపడమో ఆమెకు తెలియలేదు. అయినా అది ప్రస్తుతం అనవసర ప్రయత్నం అనుకుందామె. ఏదేమయినా ఆయన ఆప్యాయంగా తన భవిష్యత్‌కోసం చేసిన హెచ్చరికలు మనసులోనే పెట్టుకుంది. ''జీవితంలో ఘోరమయిన ఎదురుదెబ్బలు తిని ఫలితాన్ని అనుభవించినదానిని- ఇకనైనా తెలివితెచ్చుకోకుండా ఎలా ఉండగలను?'' తనను తాను సమర్థించుకుంది.

చార్మినార్ ఎక్స్‌ప్రెస్ ప్లాట్‌ఫారం మీదకు వచ్చి ఆగింది. వారు కంపార్ట్‌మెంట్ వెతుక్కుంటూ వెళ్ళారు. నెంబర్‌లు చెక్‌చేసుకుని తమ సీట్లలో లగేజి ఉంచారు. శంకరయ్య తిరిగివెళ్ళి కంపార్ట్‌మెంట్ ముందు నిలబడి వెంకటనారాయణతో మాట్లాడసాగాడు- ''మన ఊరికి ఒకసారి వచ్చి వెళ్ళకూడదూ?'' ప్రశ్నించాడు ఆయన.

''నాకూ రావాలనే ఉంది. వచ్చి ఒకసారి మన మిత్రులందరినీ కలుసుకోవాలనుంది. కాని అలాగే తాత్సారం చేస్తూ వస్తున్నాను. ఈసారి వసుంధర పెళ్ళి నిశ్చయించు, ఎన్ని పనులున్నా అన్నీ కట్టిపెట్టి రెండు రోజుల ముందుగానే అక్కడికి వస్తాను''

శంకరయ్య ఒకింతసేపు సంశయించి తర్వాత అన్నాడు ''వసుంధర విషయాన్ని...'' చెప్పలేక ఆగాడు.

వెంకటనారాయణకు మాట అర్థం అయింది- ''భలేవాడివే శంకరం... నేనూ ఒకప్పుడు ఆడపిల్లల తండ్రినే. నా కూతుళ్ళు తప్పుచేసి ఉండకపోవచ్చు కాని ఒకవేళ వారు ఇలాంటి తప్పుచేసి ఉంటే నా మనసులోనే దాచుకోనా? అయినా నీ బిడ్డయితేవేరు- నా బిడ్డయితే మరొకటా? వసుంధర కూడా నా బిడ్డలాంటిదేనయ్యా. నా బిడ్డ తెలియక చేసిన తప్పును నా మనసులోనే దాచుకుంటాను తప్ప ఎట్టి పరిస్థితిలోనూ రెండవ వ్యక్తికి చెప్పనుగాక చెప్పను''

''ఆ నమ్మకంతోనే నేను నీ దగ్గరకు వచ్చాను... నువ్వు చేసిన సహాయానికి, నీ మంచి మనసుకూ చాలా కృతజ్ఞతలు''

''స్నేహితుల మధ్య కృతజ్ఞతలేమిటోయ్'' ఆప్యాయంగా విసుక్కున్నాడాయన.

అప్పుడే రైలు కూతవేసింది.

''రైలు బయలుదేరుతోంది... ఎక్కు'' చెప్పాడు వెంకటనారాయణ.

శంకరయ్య కంపార్ట్‌మెంట్‌లోకి ఎక్కి డోర్ దగ్గరే నిలబడ్డాడు. రైలు నెమ్మదిగా కదిలింది.

వెంకటనారాయణ ప్లాట్‌ఫాంమీదే నిలబడి చేతులూపసాగాడు. శంకరయ్య గేట్ దగ్గర నిలబడి తనూ చెయ్యి ఊపాడు. వసుంధర కూడా కిటికీలో నుండి ఆయనవంక చూసి చెయ్యి కదిలించింది.

రైలు కనుమరుగయ్యేవరకూ వెంకటనారాయణ చెయ్యి కదిలిస్తూనే ఉన్నాడు. మిత్రుడు కనిపిస్తున్నంతసేపూ శంకరయ్య చెయ్యి ఆడిస్తూనే ఉన్నాడు. రైలు ప్లాట్‌ఫారంను విడిచింది. మెల్లగా వేగం పుంజుకుంది.

శంకరయ్య లోపలికి వచ్చి కూతురి పక్కనే కూర్చున్నాడు. రైలు కాలంతో పోటీపడుతూ వేగంగా పరుగెత్తసాగింది.

సికింద్రాబాద్ స్టేషన్ చేరింది. ఆ స్టేషన్‌ను వదిలాక మరింత వేగాన్ని పుంజుకుని గమ్యంవైపు పరుగెత్తసాగింది.

వసుంధర సీట్లో వెనక్కువాలి కన్నులు మూసుకుంది. వెంటనే ఆమెకు తన పల్లె గుర్తుకు వచ్చింది. గతం ఒక్కసారిగా కనులముందు నిలిచింది. కొద్దిరోజులుగా మరిచిపోయిన జ్ఞాపకాలు ఒక్కసారిగా ఆమెను తట్టిలేపాయి. ఆమె గుండె బరువెక్కింది. మునుపటి వ్యథ యథాస్థానంలో చేరింది. కాకపోతే హైదరాబాదు వెళ్ళే




టప్పుడు కడుపులో ఒక బరువుంది; ప్రస్తుతం ఆ బరువు దిగింది; కుటుంబగౌరవం నిలబడింది. కాని... తన నమ్మకం, దురదృష్టం, మనసులోని వ్యధ ఎప్పటిలానే తనను వెన్నంటి వస్తున్నాయి.

తనకిప్పుడు ఏమాత్రం భవిష్యత్ లేదు; మనసులో మరే ఆశా లేదు; ఆ దేవుడు తననిక ఒక జీవమున్న బొమ్మలా బతకమని ఆదేశించి నట్టున్నాడు.

వసుంధర దీర్ఘంగా నిట్టూర్చింది- 'అంతే... ఇకనుండీ తను జీవమున్న ఒక బొమ్మలా బతకబోతోంది' అలా నిశ్చయించుకుంది వసుంధర.

కాని వెంటనే అనిపించింది- అసలు తనిక బతకటం ఎందుకు?

బతుకుమీద వ్యామోహం కాదుకాని, మరణించి తనవారినందరినీ బాధపెట్టడం ఆమెకు ఇష్టంలేకపోయింది. అందుకే ఆ ఆలోచనను మనసులోనుండి తుడిచేసింది.

ఎవరి ఆలోచనలతో నిమిత్తం లేకుండా రైలు వేగంగా పరిగెడుతూనే ఉంది. ఆలోచనల మధ్యనే ఆమె నిద్రలోకి జారుకుంది.

ఆమె తిరిగి మేలుకునేసరికి రైలు విజయవాడ స్టేషన్‌లో ఆగిఉంది. పాసింజర్స్ కొందరు దిగారు. మరికొందరు కంపార్ట్‌మెంట్‌లోకి ఎక్కారు.

పాతికేళ్ల పడుచుజంట రెండేళ్ల బాబుని ఎత్తుకుని లోపలికి వచ్చారు. సీట్లు చెక్‌చేసుకుని వారి ఎదురుగా కూర్చున్నారు.

ఆ జంటను చూస్తుంటే వసుంధర మనసులో బాధ ముల్లులా పొడవసాగింది. ఏ వ్యక్తికైనా అటువంటి సమయంలోనే తను పోగొట్టుకున్నదేమిటో గుర్తుకువచ్చేది. గుర్తుకు వచ్చిన బాధ మనసును పిండేస్తుంటే ఆమె నిశ్శబ్దంగా కన్నులు మూసుకుంది.

రైలు విజయవాడ స్టేషన్‌కు వీడ్కోలు చెబుతూ కూతవేసింది. మెల్లగా కదిలి త్వరగా వేగం పుంజుకుంది.

ఉదయం ఏడుగంటలవేళ ఎక్స్‌ప్రెస్, వారు దిగవలసిన స్టేషన్‌లో ఆగింది.

స్టేషన్ బయటకు వచ్చాక రిక్షా మాట్లాడుకుని ఎక్కి బస్టాండు చేరుకున్నారు. బస్సు రెడీగా ఉంది. వారు బస్సు ఎక్కి కూర్చున్నారు.

గంట ప్రయాణం తర్వాత బస్సు వారిని తమ పల్లెలో దించింది.

బస్సు దగ్గరనుండి ఇంటికి వెళుతుంటే చాలామంది వారిని పలకరించారు. అందరికీ జవాబు చెబుతూ ముందుకు సాగాడు శంకరయ్య.

వీధివాకిటనున్న రంగయ్య వారి రాకను చూశాడు. పరిగెత్తుకుంటూ వెళ్ళి యజమాని చేతిలోని సూట్‌కేస్ అందుకున్నాడు "ప్రయాణం బాగా సాగిందయ్యా?"

"సాగిందిరా" జవాబిచ్చాడు శంకరయ్య.

వారు ఇంటిలోకి అడుగుపెట్టారు. శారదమ్మ అప్పుడే హాలులోకి వచ్చింది. క్షేమంగా తిరిగి వచ్చిన కూతురిని చూసింది. ఆమెను అక్కున చేర్చుకుని, "బాగున్నావా వసూ" అంది.

"బాగున్నానమ్మా" జవాబిచ్చింది వసుంధర.

తల్లికి జవాబిచ్చాక ఆమె నిశ్శబ్దంగా తన గదిలోకి వెళ్లిపోయింది.

హాలులోని కుర్చీలలో కూర్చుని శారదమ్మకు వారు హైదరాబాదు విశేషాలు చెప్పసాగారు.

ఒక గండం గడిచిందని వారు సంతోషించసాగారు. ఆ సంతోషంతో ఉత్సాహంగా మాట్లాడుకోసాగారు.

★ ★ ★

అలాగే ఆరునెలలు గడిచింది.

గ్రామస్తులంతా జరిగిన ఘోరాన్ని మరచిపోయారు.

ఆ కుటుంబసభ్యులు కూడా మనసులోకి బాధను దిగమింగి కాసింత సంతోషంగానే ఉన్నారు. అయితే వారి మనసులోని అప్పుడప్పుడు వసుంధర భవిష్యత్ గురించిన ఆలోచన మాత్రం కలచివేసేది.

ఒకరిద్దరు శ్రేయోభిలాషులు కూడా శంకరయ్యకు సలహా ఇచ్చారు- "జరిగిందేదో జరిగిపోయింది. ఆ దారుణాన్నే మనసులో పెట్టుకుని అమ్మాయిని అలాగే ఇంటిలో ఉంచేసుకోవటం ఏం బాగుంటుంది- అమ్మాయికి పెళ్ళి

ప్రయత్నాలు చేయండి''

వారి మాటలలో ఏదో నిజం ఉన్నట్టుగా అనిపించింది. శంకరయ్యకు స్తబ్దంగా ఉండిపోయిన ఆలోచనలు మెల్లగా వసుంధరకు పెళ్ళి చేయాలన్న ధ్యాసవైపు మరలాయి. ఆయన ఈ విషయాన్ని భార్య, చెల్లెలిముందు ప్రస్తావించారు.

''దురదృష్టం ఒకసారి జరుగుతుంది కాని ప్రతిసారీ జరగదుకదా... ఇంటిలో పెళ్ళికాని ఆడపిల్లను పెట్టుకుని ఉండటం మనకు అంత మంచిదికాదు. వసుంధర కూడా మరే వ్యాపకమూ లేకపోవడంతో ఒకే ఆలోచనతో జరిగిపోయినదానినే తలచుకుని కృశించిపోతోంది. తనొక దురదృష్టజాతకురాలిననే నమ్ముతూ ఉంది. లేదు... నా బిడ్డ మరీ అంత దురదృష్టజాతకురాలు కాదు. నా ఇంట లక్ష్మీదేవిలా అనిపించే ఆమెకు వివాహయోగం లేకపోవటం ఏమిటి? జరిగిపోయినదంతా ఒక పీడకలలా మరచిపోదాం. జరగబోతున్నదే వాస్తవం. ఈ దేశంలో లక్షలకొలదీ పెళ్లికాని కుర్రాళ్ళున్నారు. వసుంధరలాంటి అందమైన దానికి మొగుడయ్యేందుకు, నాలాంటి ధనవంతుడికి అల్లుడయ్యేందుకు ఎంతోమంది ఉత్సాహం చూపిస్తారు. అవసరపడితే నా అల్లుడికి కట్నం ఇచ్చేందుకు నా ఆస్తినంతా కూడా అమ్మేయగలను. ఇప్పుడు నా కూతురికి పెళ్ళికావటమే ముఖ్యం...''

వారిద్దరూ మౌనంగా ఉండిపోయారు.

''వసుంధరతో ఈ విషయం చెప్పండి... ఆమెను పెళ్ళికి వప్పించండి'' అన్నాడు శంకరయ్య.

''అమ్మాయి ఇప్పటికే ఎదురుదెబ్బలు తిని పెళ్లంటేనే భయపడిపోయింది. అలాంటిదానిని మరోసారి తన అదృష్టాన్ని పరీక్షించుకోమనటం... ఒప్పుకోదేమో! ఈ విషయం విని బెంబేలుపడిపోతుందేమో'' మెల్లగా చెప్పింది శకుంతలమ్మ.

''వెంటనే ఒప్పుకోకపోవచ్చు కాని ఆమెకు నచ్చచెప్పండి. అవసరపడితే బలవంతం చేయండి... మనం ఏం చేసినా ఆమె మేలుకోసమే. అమ్మాయి కూడా అమాయకురాలు కాదు. ఈ విషయాన్ని అర్థం చేసుకోలేనంత మూర్ఖురాలు కాదు... మీరు ఎలాగయినాసరే అమ్మాయిని పెళ్ళికి వప్పించండి. నేను వరుడికోసం అన్వేషణ సాగిస్తాను'' స్థిరంగా అన్నాడు ఆయన.

వారిద్దరూ నిశ్శబ్దంగా తలలూపారు.

ఆ తర్వాత ఇద్దరూ కలసి వెళ్ళి వసుంధరకు ఈ విషయం చెప్పారు.

మరోసారి తన పెళ్ళి ప్రస్తావన వినడంతో ఆమె నిర్ఘాంతపోయింది. ''ఏమ్మా... నా మనసుతో మరోసారి ఆటలాడాలనుకుంటున్నారా?'' అని ప్రశ్నించింది.

''అదికాదు వసూ... ఒక్కసారి పెళ్ళి ఆగిపోయినంత మాత్రాన ప్రతిసారీ అలాగే జరుగుతుందని అనుకోవడం పొరపాటు''

''ఒక్కసారి కాదమ్మా... వరుసగా మూడుసార్లు... మూడుసార్లు నేను పెళ్ళి విషయంలో ఎదురుదెబ్బలు తిన్నాను. ఆ విషయంలో నేను పూర్తిగా అలసిపోయాను. ఇక ఈ విషయంలో పోరాడే ఓపిక నాకు ఎంతమాత్రం లేదు... నన్ను విడిచిపెట్టండమ్మా. పెళ్ళి అన్న పదం నా జీవితం నుండి పూర్తిగా తప్పించండి'' చేతులు జోడించి తల్లికి నమస్కరించింది వసుంధర.

బిడ్డ ఆవేదనకు శారదమ్మ కదిలిపోయింది.

''కావచ్చమ్మా... కాని ఇంకొక్క ప్రయత్నం చేయడంలో తప్పులేదు''

''మీకు తెలియదు- నేనొక దురదృష్టజాతకురాలిని... నాలాంటిదానికి జోడీని తీసుకురావాలని ప్రయత్నిస్తే నా దురదృష్టం ఆ వ్యక్తికి కూడా అంటుకుంటుంది. వద్దమ్మా... నా వలన మరొక వ్యక్తి బాధపడటం నేనెంతమాత్రం భరించలేను''

''నీది అర్థంలేని భయం. వట్టి అపోహ'' చెప్పింది శకుంతలమ్మ.

వారికి తన నమ్మకాన్ని ఎలా వివరించాలో, ఎలా ఒప్పించాలో అర్థంకాలేదు వసుంధరకు. ఆమె తన ఖర్మకు తానే తలకొట్టుకుంది.

''మీ నాన్నగారు ఈసారి గట్టి ప్రయత్నంలో ఉన్నారు. ఎలాగయినా నీకు పెళ్ళి చేసెయ్యాలనుకుంటున్నారు. ఆయన ప్రయత్నానికి





అడ్డు చెప్పకు''

ఆమె చాలాసేపు వ్యతిరేకించింది. వారు ఆ మాటలను లక్ష్యపెట్టలేదు. తమ ప్రయత్నం తాము సాగిస్తామని చెప్పి వెళ్లిపోయారు.

వసుంధర తన తలను గోడకు కొట్టుకుంది. నిస్సహాయతతో పిడికిళ్ళు బిగించి తలదిండును బాదింది.

శంకరయ్య వరుడికోసం అన్వేషించాడు. తెలిసినవారి ద్వారా ఒక కుర్రాడి వివరాలు తెలుసుకుని వెళ్లాడు. కుర్రాడు తాలూకా ఆఫీసులో గుమస్తా. ఆయనకు కుర్రాడు నచ్చాడు. తమ అమ్మాయిని చూసుకునేందుకు రమ్మని ఆయన వారికి చెప్పివచ్చాడు.

కాని వారు ఎన్నిరోజులకు కూడా ఆ ఇంటి వైపు తిరిగి చూడలేదు. కారణం ఏమిటో అని ఆయన విచారించను పోతే- తెలిసిన విషయం ఆయనను ఆశ్చర్యపరచింది. వారు అమ్మాయిని చూసుకునేందుకు వస్తుంటే పిల్లి ఎదురు వచ్చిందట. వారిది శకునాలు ఎక్కువగా లెక్కలోకి తీసుకునే కుటుంబం. కాబట్టి ఆ, అపశకునం దృష్ట్యా ఈ సంబంధం వద్దనుకున్నారు. ఆ సమయంలో ఆయనకు తన కూతురు కనులముందు నిలిచి 'నేను దురదృష్టజాతకురాలిని నాన్నా... నాకు కల్యాణయోగం లేదు' అని చెప్పినట్టుగా అనిపించింది. ఆయనకు బాధ కలిగింది.

అయితే ఆయన తన ప్రయత్నాన్ని మానుకోలేదు. పట్టువదలని విక్రమార్కుడే అయ్యాడు. మరో సంబంధం చూశాడు. వారు అమ్మాయిని చూసుకుని నచ్చి కూడా వెళ్ళారు... కాని వారినుండి ఎంతకాలానికీ కబురు రాలేదు. కారణం విచారిస్తే- అమ్మాయికి అంతకుమునుపు జరగబోయిన పెళ్ళి గురించి తెలిసిందనీ, అందువలన పెళ్లికొడుకు తల్లిదండ్రులు ఈ సంబంధాన్ని వద్దనుకున్నారనీను తెలిసింది.

మూడో సంబంధం ముహూర్తాల వరకూ వచ్చింది. కాని చివరిక్షణంలో పెళ్ళికొడుకు మరో అమ్మాయిని పెళ్ళిచేసుకున్నాడు. అతడు అంతకుమునుపే ఆ అమ్మాయిని ప్రేమించి ఉన్నాడట. పెద్దలు మరో సంబంధం ఖాయపరచుకుంటుండటంతో తొందరపడి ప్రేమించినవడతిని పెళ్ళిచేసుకుని ఏకంగా ఇంటికే తీసుకువచ్చేశాడు... అంత బాధలోనూ నవ్వువచ్చింది శంకరయ్యకు.

అలా- రెండు మూడు కాదు, చాలానే సంబంధాలు చూశాడు శంకరయ్య. కాని ప్రతి సంబంధానికీ ఏదో అడ్డంకి. మరేదో ఆటంకం. మొత్తంమీద కుదరబోతున్న సంబంధం చెడిపోయేది.

శంకరయ్యకు ఆశ్చర్యమే కాదు, అయోమయంగా కూడా అనిపించింది. ఆయన ఇప్పుడు తన కూతురు పెళ్ళి విషయంలో దురదృష్టజాతకురాలని నమ్మసాగాడు. వసుంధర చెప్పిన మాటలలోని నిజం బోధపడసాగింది.

ఈ ప్రపంచం వింతలమయం. కొన్ని విషయాలు చెపితే నమ్మలేము; దగ్గరకు వెళ్ళి పరిశీలించాక నమ్మకుండానూ ఉండలేము.

అందం, ఆస్తి- అన్నీ ఉన్న అమ్మాయికి పెళ్ళికాకపోవడం అన్నది నమ్మశక్యం కాకుండా ఉంటుంది కాని ఇది ప్రపంచం. నమ్మలేని విషయాలెన్నో మనచుట్టూ ఉన్నాయి. మనకు నిత్యం కాకపోయినా అరుదుగానయినా అనుభవంలోకి వస్తూ ఉంటాయి.

వసుంధరలాంటి యువతి అందరికీ, అన్నివేళలా తారసపడకపోవచ్చు కాని కొందరికయినా, కొన్నివేళలలో అలాంటి వ్యక్తులు తారసపడుతుంటారు. వారి కథ వింటే ఆశ్చర్యంగానూ, నమ్మశక్యం కాకుండానూ ఉంటుంది. ప్రయత్నిస్తే అలాంటి అరుదైన మనుషులు ఎక్కడో ఓచోట కనిపిస్తారు. అటువంటివారిమీద జాలిపడటం తప్ప మనం మరేమీ చేయలేము.

* * *

సాయంకాలపు నీరెండ నిర్మలంగా ఉంది. నీలిరంగు ఆకాశంలో వెన్నెల నురగలాంటి మేఘాలు ఎచటికో పయనిస్తున్నాయి. పశ్చిమ కొండలలో సూర్యుడు రుధిరవర్ణంలోకి మారుతూ ఉన్నాడు.

ఆ సాయంకాలపు వెలుగుజిలుగులను ఆమె నిశ్శబ్దంగా చూస్తోంది. ఆమె చూపులలో నిస్తేజత అలముకుని ఉంది.

ఒకప్పుడు ఆమె ఆ సంధ్యవెలుగులను



ఆనందంగా చూసేది. ప్రకృతి సౌందర్యాన్ని చూస్తూ పరవశించిపోయేది. ఏదీ తనలో ఆ భావుకత? అనుభవాల రాపిడిలో అనుభూతి శూన్యత్వంలో శవం లేచిన ఇంటిలోని నైరాశ్యపు విషాదం నిశ్శబ్దంలా తనచుట్టూ మిగిలింది. ఆర్ద్రతారాహిత్యంలో ఆమె చూపులలో ఆర్తిమాత్రమే మిగిలింది.

ఆమె ఇప్పుడు జీవమున్న బొమ్మ మాత్రమే!

"వసూ"

ఆమెచుట్టూ పేరుకుని ఉన్న నిశ్శబ్దం అలలుగా చెదిరి కదిలిపోయింది.

వసుంధర తలతిప్పి చూసింది. ఎదురుగా తండ్రి నిలబడి ఉన్నాడు.

పిట్టగోడ మీద కూర్చుని ఉన్న ఆమె లేచి నిలబడింది - "ఏమిటి నాన్నా?" అంది.

"ఏం చేస్తున్నావు వసూ" ప్రశ్నించారాయన మృదువుగా.

"ఏం లేదు నాన్నా.... ఏమీతోచక ఇలా కూర్చుండిపోయాను"

ఇద్దరి మధ్యా కొద్దిక్షణాలు నిశ్శబ్దం.

"కూర్చోండి నాన్నా" ఎదురుగా ఉన్న కుర్చీని చూపించిందామె. ఆయన కూర్చున్నాడు.

కొద్ది నిముషాల మౌనం తర్వాత ఆయన అన్నాడు - "వసూ... నువ్విలా దిగాలుగా ఉంటే నా మనసెంతో బాధగా ఉంది. కాస్త ఉత్సాహంగా ఉండేందుకు ప్రయత్నించు తల్లీ"

ఆమె జవాబివ్వలేదు. నవ్వి ఊరుకుండిపోయింది.

ఆయనే అన్నాడు - "అప్పటికీ నీ దిగులు పోగొట్టాలని నేనెంతో ప్రయత్నించాను.

ఎన్నో సంబంధాలు చూశాను. కాని ప్రతి సంబంధం చెడిపోవడం - నాకే ఆశ్చర్యంగా ఉంది. నువ్వన్న ఆ మాటలు నిజమేనేమోనన్న అనుమానం నాకిప్పుడు కలుగుతోంది"

"అనుమానం ఎందుకు నాన్నా... అది నిజం. కొందరి అదృష్టం అంతే. కొందరు కొన్ని దక్కించుకోవాలని ఎంతో ప్రయత్నిస్తారు ఇతరులచేత కూడా ప్రయత్నింపచేస్తారు. కాని ఆ కోరుకున్నది దక్కించుకునే అదృష్టం వారికుండదు"

"మరి నీ జీవితం?" ఆయన బాధగా ప్రశ్నించాడు.

"ఈ జీవితం ఇక ఇంతే నాన్నా" నవ్విందామె.

నిముషం తర్వాత ఏదో గుర్తుకు వచ్చినట్టుగా చెప్పింది -

"నాన్నా... మీరు ఊహించకనే పెట్టారో, నా భవిష్యత్ జాతకాన్ని చూసే పెట్టారో తెలియదు గాని 'వసుంధర' అన్నపేరు నాకు చక్కగా సరిపోయింది... వసుధ అంటే భూమి. ఈ భూమిని జనం గునపాలతో పొడిచి తూట్లు చేస్తారు. నా మనసును చంద్రశేఖరం అలాగే తూట్లు పొడిచాడు; ఎందరి పాపాలనో ఈ భూమి భరిస్తుంది. మోహన్‌కుమార్ పాపభారాన్ని నేను కూడా మోశాను. ఈ భూమ్మీద పాపాత్ములే కాదు, భూమి తల్లిని పూజించే భానుమూర్తిలాంటి మంచివారు కూడా ఉన్నారు. కాని 'పాపి చిరాయువు'- పుణ్యాత్ములు త్వరగా వెళ్ళిపోతారు అనేది నిజమేనని పిస్తోంది. ఈ వసుంధర దురదృష్టం కూడా అదే. మంచివాడిని నిలుపుకోలేకపోయింది. నాన్నా...! ఈ భూమితల్లి నలుగురి ఆనందంకోసం, జనం ప్రయోజనం కోసమే సృష్టించబడింది. ఈ వసుధ నిస్వార్థపరురాలు. ఇతరుల ఆనందం కోసం సర్వం త్యాగంచేసిన దీనురాలు, తన కోసం తను ఏమీ పొందలేని అభాగ్యురాలు. నేను వసుంధరను కదా నాన్నా... అందుకే నాకీ దుస్థితి... వసుంధరను నేను... సార్థకనామధేయురాలను... నాగురించి మరేం బాధపడకండి. నేను చదువుకుంటాను. చదవగలిగినంత చదువుతాను. చదువులోపడి ఈ ప్రపంచాన్ని మరచిపో ప్రయత్నిస్తాను. చదువులోనే భవిష్యత్తును చూసుకుంటాను" దృఢనిశ్చయానికి వచ్చినదానిలా అంది వసుంధర.

శంకరయ్య కూతురి వంకే చూస్తుండిపోయాడు. ఆయన కన్నులలో సన్నటి నీటిపొర ఏర్పడటంతో ఆమె ఆకారం అస్పష్టంగా కనిపించసాగింది.







# 27 కోట్ల కారు

**కో**ట్లకు పడగలెత్తిన గెరార్ట్ అనే పెద్ద మనిషికి ఒకానొక శుభముహూర్తాన పూర్తిగా బంగారంతో తయారైన కారుంటే బాగుండునన్పించింది. లేడికి లేచిందే పరుగ'న్నట్లు ఆ ఆలోచనపుట్టిన 1986 జులై మూడో తారీఖు నుంచే దానికి అవసరమైన ఏర్పాట్లు చేసేయడం మొదలెట్టాడా శ్రీమంతుడు. కనీసం భార్యకి కూడా చెప్పకుండా ఆరోజే బ్యాంకులాకరులో దాచివుంచిన బంగారునగలన్నీతీసి, కరిగించి, ముద్దగా చేసిపెట్టుకున్నాడు. ఆ తర్వాత ఇళ్లూవాకిళ్లూ, భూమి పుట్రా సర్వం అమ్మకానికి పెట్టి వచ్చిన డబ్బుతో బంగారం కొనిపడేశాడు. ఇంకా బంగారం అవసరమైతే తన ఫ్యాక్టరీలను కూడా అమ్మిపారేశాడా పెద్దమనిషి. ఎలాగైతేనేం? స్టీరింగ్ నుంచి ప్రతిపార్టూ కూడా బంగారంతో తయారైనదై ఉండేలా జాగ్రత్తపడ్డాడాయన. అందుకోసం మొత్తంమీద 27 కోట్ల రూపాయలపైనే ఖర్చయిందా పెద్దమనిషికి.

అయితే కేవలం బంగారంతో తయారవడమే ఆకారు ప్రత్యేకత అనుకుంటే పప్పులో కాలేసినట్లే! దానిలోపల భాగం అన్ని కార్లలా కాక రోమన్ దేవాలయంలా ఉంటుందట, లోపలి స్తంభాలు, నీళ్లతొట్టెలు సమస్తం స్వచ్ఛమైన 24 కారట్ల బంగారంతో తయారైనవే. ఇంకా లోపల దేశదేశాలనుంచి తెప్పించిన అతిఖరీదైన మద్యాలతోనిండిన మినీ బార్ కూడా ఉంది. "మందు ఉన్నప్పుడు తోడుగా మగువ తప్పదుగదా" అనుకొంటూ ఇద్దరు సుందరాంగుల్ని ఫుల్‌టైమ్ ఉద్యోగులుగా నియమించుకున్నాడా కుబేరుడు. అయ్యగారు అలసిపోయినపుడు తమ అందచందాలతో అలరిస్తూ, సేవలు చేయడమే ఆ సుందరాంగులపని.




ఆ కారు విషయం అడిగితే ఆయనగారి భార్యామణి, "ఏంచెప్పమంటావ్ బాబూ! ఆయనగారికి ఈ కారే పెళ్లాం అయిపోయింది ప్పుడు. దానికోసం నన్ను వదులుకోడానికైనా



సిద్ధమేనంటున్నాడాయన. అయితే విడాకుల కి నేనూ సిద్ధమే... కాని ఆ కారు నాకిచ్చేసే షరతు మీదైతేనే అందుకు అంగీకరిస్తా'' అంటోంది.

ఆవిడగారి మాటలవల్లే ఆకారువట్ల ఆవిడ కి కూడా ఎంత క్రేజ్ ఉందో అర్థమవుతోంది. అలాంటప్పుడు అంతమోజుపడి చేయించు కున్న తన ముద్దులకారుని విడాకుల కోసం భార్యకిచ్చేంత మూర్ఖుడా మన మిస్టర్ గిరార్త్? మీరే చెప్పండి.

## టెన్నిస్ వింతలు

క్రీడా ప్రపంచంలో టెన్నిస్‌కున్న స్థానం అద్వి తీయమైనది. కాని ఎందరో అభిమానుల్ని తమ క్రీడానైపుణ్యంతో ఆకట్టుకునే ఆ క్రీడాకా రులు టెన్నిస్ కోర్టులో ప్రవర్తించేతీరు ఒక్కో సారి తమాషాగా ఉంటుంది. కొంతమంది హుందాగా, పెద్దమనిషి తరహాలో ప్రవర్తిస్తే మరికొందరు గిల్లికజ్జాలు పెట్టుకుంటారు. ఇంకొందరు గిమ్మిక్కులు చేయడంలో ఘనాపా టీలు! హుందాగా ప్రవర్తించేవారిలో జాన్‌బోర్గ్, విలాండర్, ఎడ్‌బర్గ్, నిర్‌ట్రామ్, యారిడ్, కార్ల్‌సన్ తదితరుల్ని చెప్పుకోవచ్చు.

ఇక జాన్‌మెకెన్రో, ఇలీ నటాసీల విషయాని కొస్తే ఇద్దరూ చిటపటరాయుళ్ళే. టెన్నిస్ కో ర్టులో సదా ధుమధుమలాడుతూ ఉండే వీరు తమ పిచ్చిచేష్టలతో ఎన్నోసార్లు జరిమానాకు గురయ్యారు. ఓసారి లైన్ రిఫరీ పొరపాటు పడ్డాడని భావించి నటాసీ ''అయ్యా! తమరికే మీ దృష్టి మాంద్యం లేదు గదా?'' అన్నాడు వ్యంగ్యంగా. తనకలాంటి దోషమేమీలేదని ఆ రిఫరీ సమాధానం చెబుతుండగా నటాసీ రెచ్చి పోయి, ''....నో.... నువ్వు నిజంగా గుడ్డివాడివే'' అని అరిచాడు. ఫలితంగా ఆ తర్వాత 100 డాలర్ల జరిమానా చెల్లించుకున్నాడతను.

మెకన్రో ఆడుతున్నాడంటే చిటపటలు రేగు తున్నట్లే లెక్క! ఆటకన్నా తన ధుమధుమల తోనే అతడు ప్రత్యర్థి మీద వత్తిడి తెస్తాడని అంతా చెప్పుకుంటారు. ఆ విద్యతోనే అతను 1984లో వింబుల్డన్ మ్యాచ్ గెలుచుకున్నాడు. అనవసర కోపతాపాలవల్ల అతనోసారి మూడు నెలలపాటు టెన్నిస్ పోటీలనుండి బహిష్కర ణకు గురి అయ్యాడు కూడా. అతిగా నోరుపారే సుకునే అలవాటున్న ఆ పెద్దమనిషి గత సంవత్సరం వింబుల్డన్ ఛాంపియన్‌షిప్ ఛాంగ్‌కి దక్కితే కోర్టులో బట్టలు విప్పుకుని తిరుగుతానని ప్రతిజ్ఞ చేసి తన ఉక్రోషాన్ని వెల్లడించుకున్నాడు.

రెండేళ్ళక్రితం బోరిస్‌బెకర్-పాట్‌క్యాష్‌ల మధ్య వింబుల్డన్‌లో హోరాహోరీ పోరు జరి గింది. ఆ సందర్భంలో బెకర్ నెట్ వెంబడే జార్చిన బంతిని తీయబోయి పాట్‌క్యాష్ నెట్ మీద నుంచి పిల్లిమొగ్గలేస్తూ బెకర్ కోర్టులో పడ్డాడు. మరుక్షణం బెకర్ కూడా నెట్ మీద



నుంచి జారి తలకిందులుగా ఇవతలికోర్టులో పడ్డాడు. టెన్నిస్ ఆటలో ఈ పిల్లిమొగ్గల ఫీట్లేమిటా అని జనం ముక్కున వేలేసుకున్నారు.

ఆటమధ్యలో తన తలకి కట్టుకున్న 'హెడ్‌బాండ్'ని ప్రేక్షకుల మీదికి విసిరే అలవాటు పాట్‌క్యాష్‌కు ఉంది. ఒక్కో మేచ్‌లో అతనలా 200 దాకా హెడ్‌బాండ్స్ విసురుతాడని ప్రతీతి. యుగోస్లేవియా ఆటగాడు జివోజినోవిక్ ధాటిగా సర్వీసులుచేయడంలో దిట్ట. పాయింట్ వచ్చినప్పుడల్లా పిడికిళ్ళు బిగించి గాలిలోకి చేతులు విసరడం అతని అలవాటు.

ఆ మధ్య వింబుల్డన్‌లో జరిగిన పోటీలో బార్బారాపాంగర్ అనే అమ్మడు చెమటతో తడిసిపోయిందని తన టీషర్టుని నడికోర్టులో విప్పి (ప్రేక్షకులకి తన అందాలతో కనువిందుచేసి)మరొకటి ధరించింది. ఈ సంఘటన గొప్ప సంచలనం సృష్టించింది. క్రిస్ ఎవర్ట్‌కీ ఈ అలవాటున్నా ఆమె కొత్తది తొడిగాకనే పాతది విప్పుతుందట. స్టెఫీగ్రాఫ్ సంగతి సరేసరి! ఆటజరుగుతున్నంతసేపూ ఆమె మూతి బిగించుకొని సీరియస్‌గా ఉంటుంది. అదేమిటంటే "చిరునవ్వులు చిందిస్తూ ఆట ఆడటం నావల్లకాదు. ఆ రెంటిలో ఏదో ఒకటి మాత్రమే చేయగలను" అంటుందామె. ఈనాడు టెన్నిస్ రాణులందరిలోకీ గాబ్రియేలా సబటినీ మిక్కిలి అందగత్తెగా ప్రసిద్ధికెక్కింది. ఆమె ఆడుతున్నంతసేపు మగప్రేక్షకులు ఈలలువేస్తూ, కేరింతలుకొడుతూ ఆమెను ప్రోత్సహిస్తుంటారు.

## ఫలించిన కల

"సామాన్యుడు 'అసామాన్యుడి'గా పేరుతెచ్చుకోడానికి డబ్బో, రాజకీయాధికారమో ఉండనక్కరలేదు — కృషి, పట్టుదల ఉంటేచాలు" అంటాడు జయంత్. 20 ఏళ్ల వయస్సులో ప్రపంచమంతా తన సైకిలుమీదే చుట్టివచ్చి అపారమైన పేరు ప్రఖ్యాతులార్జించాడతను.



నాలుగైదు జతల బట్టలు, 48 రూపాయల నగదు, ఓ పాత కెమేరాతో సైకిలు సవారీ ప్రారంభించిన జయంత్ తన సాహసయాత్రలో 3 లక్షల 84 వేల కిలోమీటర్ల దూరం ప్రయాణంచేసి 135 దేశాల్ని సందర్శించి వచ్చాడు. ఆఫ్రికాలో కొన్నిచోట్ల అడవి ఏనుగుల మందలు అతన్ని నానా యిబ్బందులకు గురిచేశాయి. అలాగే నికరాగువాలో విప్లవకారుల చేతికి చిక్కాడతను. వారతన్ని ప్రభుత్వ గూఢచారిగా భావించి కొంతకాలం నిర్బంధించారు. ఆ తర్వాత నిజం తెలుసుకుని వదిలిపెట్టేశారు. అమెరికాలో డబ్బులేక వీధులు ఊడ్వడం, హోటళ్ళలో పనిచేయడం కూడా జరిగింది. అయితే ఆనాటి అమెరికా అధ్యక్షుడు రీగన్ - కూతురు, అల్లుళ్లతో కలిసి

లంచ్ చేసే అవకాశమూ చిక్కిందతనికి. ఏవో చిన్నా చితక యిబ్బందులెదురైనా ప్రతిచోటా అతనికి సుహృద్భావ వాతావరణమే గోచరించింది. అన్ని దేశాలవారూ అతన్ని ఆప్యాయంగానే చూశారు. ప్రతివారూ భారతదేశం పట్ల తమకున్న గౌరవభావాన్ని ప్రకటించారు.

బెంగాల్‌లోని బిష్ణుపూర్ నివాసి రాధాకాంత్ మోండల్ సామాన్య కుటుంబీకుడు. అతనికి ఎనిమిదో సంతానంగా పుట్టిన జయంత్ చిన్నతనంనుంచి సైకిలుపై ప్రపంచ ప్రదక్షిణం చేయాలని కలలుగనేవాడు. ఆ కలలు నిజం చేయడం కోసం డిసెంబర్ 24, 1974న ప్రపంచ యాత్రకు బయలుదేరి పదిహేను సంవత్సరాలపాటు దేశదేశాలూ తిరిగి అపారమైన అనుభవాన్ని గడించాడతను. ప్రస్తుతం ఫొటోగ్రాఫర్ వృత్తిని చేపట్టిన జయంత్ ఓ సైన్స్ గ్రాడ్యుయేట్. తనింకా చైనా, జపాన్, ఆస్ట్రేలియాలను చూడలేదనీ, మరోసారి వాటిని కూడా సైకిలు మీదెవెళ్ళి చూసివస్తానని అంటున్నాడతను.

## ఆ పాప ఉభయలింగజీవి!

**పు**ట్టిన వారానికే తల్లిదండ్రులకో పెద్దసమస్య అయికూర్చుంది సోనాలి. పుట్టి వారం తిరిగేనరికల్లా ఆ పాప మర్మావయవానికి కొంచెంపైన పురుషాంగం ఒకటి ఏర్పడి క్రమేణా పెరగనారంభించింది. నిరక్షరాస్యులు, నిరుపేద కుటుంబీకులు అయిన ఆ పాప తల్లిదండ్రులు ఈ పరిణామానికి తల్లడిల్లిపోయారు. పశ్చిమబెంగాల్‌లోని తమ స్వగ్రామమైన పానిహతిలోనూ, కలకత్తాలోనూ ఉన్న ఆసుపత్రులన్నింటికీ తిరిగారు. కాని ప్రయోజనం శూన్యం. ఇంకా తిరగాలని ఉన్నా వారి పేదరికం ఆటంకమైంది. అంచేత ధనసహాయంకోసం ఎన్నెన్నో ధార్మిక సంస్థలతోపాటు ఆరోగ్యశాఖకూ విజ్ఞప్తులు చేసుకొంటున్నారు.

ఉభయలింగజీవిగా పెరుగుతూ రెండో సంవత్సరం పూర్తిచేసుకోబోతున్న ఆ పాప దుస్థితికి జాలిపడి ఓ ఉదారవాది వెల్లూర్‌లోని క్రిష్టియన్ మెడికల్ కాలేజి హాస్పటల్‌కు ఈ విషయాన్ని తెలిపాడు. ఆపరేషన్ ద్వారా పురుషాంగాన్ని తొలగించవచ్చుననీ, అందుకు కనీసం 8 వేల రూపాయలదాకా ఖర్చవుతుందని జవాబిచ్చారు ఆ కాలేజి ఆస్పత్రివాళ్లు. మార్కెట్‌లో టీలు అమ్ముకొంటూ జీవించే ఆ దంపతులు అంత సొమ్ము ఎక్కడినుంచి తేగలరు? అందుకే తమ బాధని ఒకరితో చెప్పుకోలేక తమలో తామే కుమిలిపోతూ ఉన్నారు వారు.



పాపం పుణ్యం ఎరుగని సోనాలిమాత్రం ఆడపిల్లలా గౌనులే ధరిస్తూ అమ్మవళ్లో కూర్చుని ఆటలాడుకొంటోంది. ఇటువంటి సంఘటనలు ఎక్కడో నూటికి కోటికి ఒకటి ఎదురవుతుంటాయని ఆ పాపను పరిశీలించిన డాక్టర్లు వ్యాఖ్యానిస్తున్నారు.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291.

# బ్రేక్‌ఫాస్ట్ కోసం చాక్‌లెట్!




# బాని మిక్స్® చాక్‌లెట్

## రోజు ఆరంభానికి చాక్‌లెట్ లాంటి పద్ధతి!

మీ బాబుకు అతను తిరస్కరించలేని బ్రేక్‌ఫాస్ట్‌ను ఇయ్యండి, బానిమిక్స్ చాక్‌లెట్. ఇది చిరుధాన్యములు, పళ్ళు కాజుపల్కులతో చాక్‌లెట్ కలిసిన పోరిజ్.




**తయారుచేయుటకు ఎంతో అనుకూలమైనది.**

వండుకోవలసిన అవసరం లేదు. ఒక గిన్నెలో కావలసినంత పరిమాణంలో బానిమిక్స్‌ను వేయండి. మరగపెట్టి సిద్ధంగా ఉంచిన పాలను అందులో పోయండి. మీకు కావలసిన మృధువైన జావ తయారయ్యేదాకా, నెమ్మదిగా, కలియబెట్టండి.



**బాని మిక్స్®**

ఓక్షణంలో తయారయ్యే పోరిజ్.

**2 రకాలలో లభిస్తుంది.** నాచురల్ * చాక్‌లెట్

గ్లాక్సో నుండి వస్తుంది మంచి ఆరోగ్యం.

GL/C/1/89/R/TEL

